# భారతి

మాసపత్రిక

★

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

★



జనవరి 1965

★

సంపుటము 42 : : సంచిక 1

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1965

# స్వ విష యము

"భారతి"కి 42 వ సంవత్సరము అరంభమైనది. నాలుగు దశాబ్దములు పైగా నిరాఘాటముగా సాహిత్యసేవ చేయగలిగినందుకు "భారతి" గర్విస్తున్నది. ఆనందిస్తున్నది. ఇక ముందు కూడా ఇతోధికముగా సాహిత్యసేవ చేయగలనను దృఢనిశ్చయముతోను, దృఢసంకల్పముతోను వున్నది. ఆ సంకల్ప సాధనకు రచయితల సహకారము పూర్తిగా లభించగలదని ఆశిస్తు న్నది. సహకరించిన వారందరికీ కృతజ్ఞత తెలుపుతున్నది.

# శ్రీ వేంకటేశ్వరము

## [మధ్యాక్కరలు]

### శ్రీ బండి నాగరాజు

తోరముగఁ బుట్టించెదవు చతుర్ముఖమునఁ గోరికలను,
దీరుగాఁ బోషింతు వానిఁ దేపకు శంఖచక్రధర!
తీఱుతువు వానిని జీవర దేవ! పన్నగభూష! నీవు
ఆరయ మూర్తిత్రయుండ వటె వేంకటేశ్వరా, స్వామి!

కోరిన కోర్కె లన్నిటిని గూరిమిన్ దీర్తువా! మరలఁ
దీఱని కోర్కె లెన్నొ మదిఁ దేలుచుం బాధించు నెపుడు;
కోరిక లివి యెల్లఁ దీఱఁ గోట్లయుగమ్ములే యగునో!
జీరవోయెను గొంతు, కోరి! శ్రీ వేంకటేశ్వరా, స్వామి!

కలలోన మ్రొక్కనఁ గాని - కాని నైనను, వడ్డికోడఁ-
గలవరపఱచియు నైనఁ గ్రక్కించుకొందు గ్రక్కనను;
నిలఁ బడ్డవాఁ డేడి భూమి, నీతోడ స్నేహమ్ము సేసి
యొలివడకుండ సర్వ ? మ్మహో! వేంకటేశ్వరా, స్వామి!

సిరిరాజువని నిన్ను నమ్మి చేసాఁచి యడుగఁగా వచ్చి
గొఱిగించుకొని పోవుచుంటి, గొప్పవాఁడవుర నా యబ్బ!
సిరు లున్నవారలం జూచి చేసాఁచుటకు మారు తారు
బెరుకుపడి యిచ్చివత్తు రఁటవే! వేంకటేశ్వరా, స్వామి!

ధనముతోఁ బాటుగా మాదు తప్పిదమ్ములఁ గూడఁ గొంచు
మనములం బరిశుభ్రపఱచి మన్నింతు పూర్వపాపముల;
నినుఁ జూచియును నాదు బుద్ధి నిల్కడం గన దేమి సేతు?
తను వేల గైకోవు, వలవదా? వేంకటేశ్వరా, స్వామి!

పాచికల యాటలో గొప్ప పండితుండ వటంద్రు, నీదు
పాచికల్ పాఱుట లేద భాగ్యవంతులమీఁద? బాబు!
ఈ చిడిగొట్టువాని పయినే వేయు దెల్లపందెములు!
గోఁచికి మించి లేదు గయికొన! వేంకటేశ్వరా, స్వామి!

నలు పెక్కు పోయితి వేమి? నాయనా! మా పాపములను
దొలఁగింపఁగా వచ్చినావు, తోర మైనవి, చాల వీవు;
అలముకొన్నవి నిన్నుఁ! - బసిఁడి యాభరణము లెన్ని వేసి
ఫలితమ్ము నిప్పచ్చరమ్ము, పద! వేంకటేశ్వరా, స్వామి!

ఏడుకొండ లవేమి లెక్క? యేడు సంద్రము లైనఁగాని
నేఁడు పోఁగలిగి యున్నాము! నీ వెందుఁ బోఁగలవు మీఱి?
పీడము, పాపము మేము! వేసారి యైన వచ్చెదము!
జాడయే తెలియదు! చెప్ప, చాల్! వేంకటేశ్వరా, స్వామి!

కోఁతులు, నాతులు నిన్నుఁ గూడి యాడెనఁట పూర్వమున,
నీ తనూధారికి నేల యింతైన నిల్కడ లేదు?
కోఁతి మించినవాఁడఁ గానె? కొన వేమి నన్ను నాగతిని?
నీతిగా నీచెంత నుండనీ! వేంకటేశ్వరా, స్వామి!

నినుఁ గన్నఁ గైతయే రాదు, నెలకొను మూఁగయు, నత్తి;
మనమున నుతియింప నెంతు, మాటలు లేకుండ నెట్లు?
తెనుఁ గేమి దా నమ్మయైనఁ దగదు నిన్ గొనియాడ; మూఁగ
మనసెపో, తగినది పొగడ మహి! వేంకటేశ్వరా, స్వామి!



# శబ్దమయ ప్రపంచం-1

శ్రీ జాఁ పోల్ సార్త్రె

పుస్తకాలతో నా జీవితం ప్రారంభమయింది. అనుమానం ఏమీ లేదు. పుస్తకాలతోనే అంతం అవుతుంది. మా తాత గారికి ఒక అధ్యయన మందిరం ఉండేది. అందులో పుస్తకాలు ఎక్కడ పడితే అక్కడ ఉండేవి. సంవత్సరానికి ఒక్కసారిగాని వాటి దుమ్ము దులప రాదు. అదిగూడా అక్టోబరు రాకముందు జరగాలి. ఇదో విశేషం. నేను ఇంకా చదవడం నేర్చుకముందే, నేను ఆ పుస్తకాలను ముట్టుకుని పవిత్రం చేశాను. కాదు, నేనే పవిత్రుణ్ణయ్యాను. పుస్తకాలు నిల్చిన రాళ్ళను పోలి కన్పించేవి. నిటారుగా వాలి ఉండేవి. లైబ్రరీ అరలల్లో ఇటికలు పేర్చబడినట్లు ఉండేవి. రెండు రాళ్ళను నిలువుగా నిలిపి, వాటిపైన పలువుగా ఇంకో రాయిని పరచి, అట్లా వరుసలు వరుసలుగా ఏర్పాటు చేసినట్లు హుందాగా, ఉండేవి. మా వంశం అస్తి అంతా అదేనని మా కుటుంబపు అదృష్టం అంతా వాటి మీదే ఆధారపడి ఉన్నదని అనుకుంటూ ఉండేవాణ్ణి. అవి అన్నీ నాకు ఒకే తీరుగా కన్పించేవి. అవి ఉన్నచోటు నాకు దేవాలయం. గర్భగుడి. నేను అందులో గాలిలో తేలిపోతున్నట్లు తిరుగుతూ ఉండేవాడిని. ఆ గుడిలో పురాణ స్మృతిచిహ్నంను పోలి ఆ పుస్తకాలు అట్లా పడివుండేవి. నేను పుట్టడం వాటికి తెలుసు. అవి అందుకు సాక్షిభూతాలు. అట్లా నా మృతిని గూడా అవి చూస్తాయి. అందుకు కూడా సాక్షిభూతాలు అవుతాయి. అవి అంత శాశ్వతమైనవి. అవి శాశ్వతమైనవి గనుక నా భవిష్యత్తును గూర్చిన ఇబ్బంది నాకు కల్గలేదు. దానిని గూర్చిన చింత నాకు చింతాకంత కూడా లేదు జరిగిన కాలాన్ని గూర్చి నా మనస్సు ఎంత శాంతంగా ఉంటుందో, ఏ విధంగా ఉద్విగ్న రహితమై ఉంటుందో, అట్లాగే భవిష్యత్తును గూర్చి కూడా ఈ పుస్తకాలు నాకు అటువంటి ధైర్యాన్ని ఇచ్చాయి. ఆ పుస్తకాలను అట్లా ముట్టుకుంటే, అట్లా ఆ పుస్తకాలను అంటి ఉన్న దుమ్మును చేతికి అంటించుకుంటే, నా చేయి పునీతం అయిపోతుందని నాకు ఉండేది. అట్లాగే ముట్టుకునే వాణ్ణి. దుమ్ము అంటించుకునే వాణ్ణి. వాటిని ఏమి చెయ్యాలి? అవి ఎందుకు ఉపయోగిస్తాయి? నాకు తెలిసేది కాదు. ప్రతిరోజూ అక్కడ ఏదో జరుగుతూనే ఉండేది. ఆ జరుగుతున్న దాని అర్థం కూడా నాకు అంతు పట్టేది కాదు. నన్ను కికురించిపోయేది. మా తాతగారు ఉన్నారు. ఆయన అదో రకం మనిషి. చేతులకు లక్షణంగా వేసుకునే "గ్లోవ్"లను మా అమ్మ తొడిగేది. గుండీలు పెట్టేది. ఆయన అటువంటి మరిపిష్ట మనిషి. ఆ పుస్తకాలను, సంస్కృతి అంతా మూర్తీభవించిన వస్తుజాలాన్ని. ఆయన చూస్తూ ఉండేవాడు. అందులో నేర్పు ఉంది. కుశలత్వం ఉంది. మత గురువులాగా ఆ పనులు ఆయన చేసేవాడు. వందల సార్లు చూశాను. ఏదో మరిచిపోయిన వాడికి మళ్ళే అక్కడ బల్ల చుట్టూ ఆయన వక్రాలు తిరిగేవాడు. రెండు అంగల్లో గదిలోకి వెళ్ళేవాడు. ఏదో పుస్తకాన్ని చేతో పుచ్చుకునేవాడు. అందులో ముందు వెనుకలు చూపించేవాడు కాదు. గబగబా పేజీలు తిప్పేవాడు. ఆ తిప్పడం గూడా బొట్టన వ్రేలికి చూపుడువేలును అంటించి చిటికెలు వేస్తున్నట్లు తిరగ వేసేవాడు. ఆయనకు ఒక పడక కుర్చీ ఉండేది. దాని దగ్గరకు వచ్చేలోపల ఈ పని పూర్తి అయ్యేది. కుర్చీలో కూర్చునేలోపల "కావాలనుకున్న పేజీ" తెరపుడు పడి ఉండేది. అప్పుడు ఆ పుస్తకం చెప్పులు 'కిర్రు' మన్నట్లు 'కిర్రు' మనేది. ఒక్కొక్కప్పుడు నేను ఆ పుస్తకాల పెట్టెల దగ్గరకు వెడుతూ ఉండేవాడిని. అవి ముత్యపు చిప్పలకు మల్లే నోళ్ళు తెరుచుకొని ఉండేవి. లోపల ఏమి ఉన్నది ప్రత్యక్షంగా, శరీరంలో అంగాలు కన్పించిన విధంగా కన్పిస్తూ ఉండేది. అవి పాలి పోయి, మెత్తపడి, ముడతలు పడిన పేజీలు కలిగి, నల్లని నరము అల్లుకున్నట్లు దర్శనం ఇచ్చేవి. అవి సిరా త్రాగి, బూజు కంపు కొట్టేవి.

మా అమ్మగారి సంగతి. అది ఇంకో విధంగా ఉండేది. పుస్తకాలు అక్కడ నేల మీద పడుకొన్నట్లు పడి ఉండేవి. ఆవిడ ఆ పుస్తకాలను బయటి నుంచి, లైబ్రరీలలోంచి తెస్తు

కునేది. రెండు పుస్తకాలకు మించి ఆవిడ తీసుకురాదు. తీసుకురాగా నేను చూడలేదు. తడవకు రెండు పుస్తకాలు చొప్పున తెచ్చుకునేది. అవి కొత్త పుస్తకాలు. వాటిని చూస్తే ఉగాది పండుగనాడు పిల్లల కోసం తెచ్చే మిఠాయి పొట్లాలు నాకు గుర్తు వచ్చేయి. దారు కాగితాల అట్టలు, ఉలిపిరి అట్ట అట్టలు. తెల్లగా, మహా ఇదిగా, కొత్తవేమో అన్నట్లు ఉండేవి. వాటిలో నాకు ఇన్ని రహస్యాలు ఉన్నాయి కదా ! వాటికి ఇవి ఏమో కాలంగా వున్నట్లు భావించే వాడిని. ప్రతి శుక్రవారం మా అమ్మ మంచి బట్టలు వేసుకొని అట్లా బయటికి వెళ్లేది. "వాటిని తీసుకు రావడానికి వెళుతున్నాను" అనేది. ఎప్పుడూ అదే మాట. తిరిగి వచ్చి, తలమీంచి నల్లని టోపీని, మేలిముసుగును తొలగించేది. అప్పుడు చేతి సంచిలోంచి వాటిని తీసేది. (ఆ సంచి గొట్టంలాగా ఉండేది. ఉన్నితో కుట్టబడి ఉండేది. చేతులు వెచ్చగా ఉండటం కోసం వాటిని ఉపయోగిస్తారు). వాటిని అట్లా ఆవిడ బయటికి తీసినప్పుడల్లా "ఇవి ఆ పాత పుస్తకాలేనా ?" అని నాకు అనిపిస్తూ ఉండేది. ఆవిడ కేమో ఆ పుస్తకాలంటే, అబ్బో ! ఎంతో భద్రం. భద్రంగా దాచుకునేది. చూడనిచ్చేది కాదు. కప్పిపెట్టేది. అప్పుడు ఆ పుస్తకాలలో ఒక పుస్తకాన్ని ఏరి పుచ్చుకొని, కిటికీ ప్రక్కన తన కుర్చీలో కూర్చునేది. ఆ కుర్చీ ఆవిడ తాతగారు ఇచ్చింది. ఆ కుర్చీలో కూర్చునేది. కళ్లద్దాలు పెట్టుకొని, ముఖం పొందుతున్నట్లు, ఆనందం అనుభవిస్తున్నట్లు నిట్టూర్పులు విడిచేది. కళ్లు ఆర్పి సుతి మెత్తగా మందహాసం చేసేది. అది చాలా అందమైన మందహాసం. మధురమైన మందహాసం. ఆ తర్వాత అటువంటి మందహాసరేఖను 'మోనాలిసా' పెదవుల మీద చూచాననంతే. అప్పుడు మా అమ్మ సర్దుమణిగేది. నిశ్శబ్దతను భజించేది. నన్నుగూడా అట్లా ఉండమని సంజ్ఞలతో చెప్పేది. అది చూస్తే నాకు చర్చిలో ప్రార్థన, మరణము, నిద్ర జ్ఞప్తికి వచ్చేవి. పవిత్రమైన భావాన్ని నేను ధరించేవాణ్ణి. ఉండి, ఉండి, లూసీ ఏదో విధంగా వచ్చేది. కుమార్తెను పిలిచి, ఒక పంక్తిని చూపించేది. ఇద్దరు ఏదో కుట్రలో లాగా చూపులు మార్చుకునేవారు. నాకు మాత్రం ఆ పోకు పోకడల పుస్తకాలంటే ఎప్పుడూ గిట్టింపులేదు. అవి ఇంట్లో ప్రవేశించడానికి తగినవి కావు. దొంగల వంటివి. మా తాతయ్యకు అవి అంటే అసహ్యం. ఆ అసహ్యాన్ని ఆయన ఎప్పుడూ దాచుకోలేదు. అవి ఆడజాతి పుస్తకాలని ఆయన అనేవాడు. వాటి జాతి కూడా తక్కువదనే మా తాతయ్య తీర్పు. ఆదివారాలు వచ్చినప్పుడు మా తాతయ్య చేసే పని ఏమీ లేక అమ్మమ్మ గదిలోకి వచ్చేవాడు. ఆవిడకు ఎదురుకుండా స్థాణువులాగా నుంచునేవాడు. ఏమి మాట్లాడే వాడు కాదు. మాట్లాడ్డానికి ఏమీ ఉండేది కాదు. అంతా ఆయన వంక చూసేవాళ్లు. ఆయన కిటికీమీద వేళ్లతో మద్దెం వేసేవాడు. ఏమీ తోచేదికాదు కాబోలు, లూసీ పక్కకు తిరిగి, ఆవిడ చేతిలో పుస్తకాన్ని కాస్త ఎగరకొట్టేవాడు. తాను తీసుకునేవాడు. అమ్మమ్మకు కోపం వచ్చేది. కోపంగా అనేది : "ఛార్లెస్ ! నా పేజీ చెరుపుతావు." తాతయ్య కనుబొమలు ఎత్తేవాడు. అప్పటికే పుస్తకం చదువుతూ ఉన్నవాడు, హఠాత్తుగా తర్జనితో పుస్తకాన్ని తర్జించి, "అర్థం కాదు" అనేవాడు. అమ్మ 'నీ కెందుకు అర్థం కావాలి' అనేది. 'నువ్వు బంతుల మధ్య చదువుతావు' అనేది. చివరికి తాతయ్య పుస్తకాన్ని అట్లా బల్లమీద విసరికొట్టి, బుజం ఏదో విధంగా ఎగురవేస్తూ వెళ్లిపోయే వాడు.

తాతయ్యమాట తప్పుకాదు. తప్పు అయ్యేందుకు వీలు లేదు. తాతయ్య వృత్తి అది. లైబ్రరీలో అరలో పుస్తకాలు చూపించి, "వాన్నోయ్ ? ఇవి నీ తాతయ్య వ్రాశాడు" అనే వాడు. ఏమి గొప్పతనం ? ఏమి హుందా ! నేను పవిత్ర వస్తు ప్రసృష్ట అయిన వాడి మనుమణ్ణి. ఆ పవిత్ర వస్తు సృష్టిలో తాతయ్య నిపుణుడు. అది ప్రత్యేకతగా కలవాడు. వాద్య యంత్రాలు తయారు చేసేవాడిలాగా తాతయ్య మర్యాదస్తుడు. మర్యాద పొందేవాడు. చర్చికి దర్జీవుంటాడు. ఆ దర్జీ అంత మర్యాద కలవాడు. కాక తప్పదు. నేను అటువంటి పవిత్ర కళాకారుని మనుమణ్ణి. తాతయ్య పని చేస్తూ ఉండగా చూచాను. ప్రతి సంవత్సరం ఆయన ఒక పుస్తకానికి సంపాదకత్వం వహించేవాడు. దాన్నే ప్రతి సంవత్సరం సరిదిద్దుతూ ఉండేవాడు. సెలవులు వచ్చేవి. "గ్యాలీ ప్రూఫులు" వచ్చేవి. మా ఇంట్లో అంతా వాటి కోసం అప్పుడు పరీక్షిస్తూ ఉండేవాళ్లు. నిర్వ్యాపారత్వం ఛార్లెస్ నిఘంటువులో మాట కాదు. దానిని తాతయ్య సహించలేక పోయేవాడు. అందువల్ల పనిలేక పోతే ఆయనకు కోపం వస్తూ ఉండేది. కస్సు బుస్సు మనేవాడు. ఎట్టకేలకు ఆ 'ప్రూఫులు' వచ్చేవి. పోస్టు బంట్రోతు తెచ్చేవాడు. పెద్ద పార్సెళ్లలో వచ్చేవి. దారాన్ని కత్తెరతో తెగ నరకాలి. ఆ పని తాతయ్య చేసే వాడు. 'ప్రూఫుల'ను బయటికి తీసి భోజనాల బల్లమీద పరచేవాడు. వాటి మీద ఎర్రగీతలు కొట్టేవాడు. కత్తితో నరుకుతున్నాడా అనిపించేది. తప్పు కనిపిస్తే చాలు భగవంతుడా అనగా ధూము ధాము చేసేవాడు. వంట మనిషి వడ్డించడానికి వచ్చేది. తాతయ్య సద్దుమణిగేవాడు. కుంయిమనే వాడు కాదు. అందరికి హాయిగా ఉండేది. నేను బల్ల ఎక్కి నల్లని పంక్తులను తిలకించే వాణ్ణి. నా సంతోషానికి అంతు ఉండేదికాదు. ఉరకలు వేసేది. నల్లని బంతుల క్రింద ఎర్రని గీతలు. నెత్తురులాగా కన్పించేవి. చార్లెస్ ష్వైట్జర్ నాతో ఒకసారి చెప్పేద

పుస్తకాలు ప్రచురించే వాడు ఉన్నాడే, వాడు చార్లెస్‌కు బద్ధ విరోధి. మరి తాతయ్యకు లెక్క చేశనవునా? అది అవమానం. తాతయ్యకు తెలియదు. తాతయ్య చేతికి పనంలేదు. తెలివె గుప్పెడే గాని పండడంలేదు. జాగ్రత్త ఎరక్కపోవడం ఇందుకు కారణం. ఇక ఈ విషయం ఉంది. ఇదో దాబుసరి. ఔదార్యం కన్పించక పోవడం తప్పు. చివరికి ముసలి వయస్సులో తాతయ్య తాపత్రయానికి అంతులేక పోయింది. పట్టి పిసినికొట్టుగా తయారైనాడు. ఎంతైయోశల్లి వచ్చిన ప్రతి వాడికి తగిలే జబ్బే ఇది. తాతయ్యకు కూడా తగిలింది. శక్తి ఉడిగిన తర్వాత చావంటే భయం వేస్తుంది. ఆ రెండు కారణాలు వృద్ధాప్యంలో మనిషిని పరమలోభిని చేస్తాయి. నేను చెబుతున్న సమయంలో తాతయ్యకు ఈ బాధ్యం అవమానం వల్ల పుట్టింది. తాతయ్యకు పుస్తకాల మీద డబ్బు వచ్చేది. పోస్టులు ఆర్డరు రాగానే తాతయ్య రెండు చేతులు పైకి ఎత్తేసేవాడు. నా కంఠం కోస్తున్నారనేవాడు. పెద్దగా అరిచేవాడు. నన్ను తినేస్తున్నారో అని గోంచేసేవాడు. అట్లా చెయ్యకేదో, అమ్మమ్మ దగ్గరికి పోయేవాడు. ఏడుపు ముఖం పెట్టి అనేవాడు. "చూడు ? అమ్మీ ? ఈ పబ్లిషర్లు నన్ను పగలే దోచేస్తున్నారు." అప్పుడు నాకు అర్థమైంది. మనిషి వలన మనిషి స్వార్థాన్ని చేస్తున్నాడు. మనిషి శక్తిని ఉపయోగించుకొని స్వార్థ బుద్ధితో అర్థాన్ని వృద్ధి చేసుకుంటున్నాడు. ఇది అసహ్యమైన విషయం. ఇదే అంటూ జరక్కపోతే ప్రపంచం ఎంతో బాగుండేది. మచ్చ లేకుండా ఉండేది. యజమానులు తాము ఇష్టకల్పించేవా ఇస్తున్నారు. పనివాళ్ళ వాళ్ల కర్మకొద్దీ పుచ్చుకుంటున్నారు. నాకు అనిపించేది. మా తాతయ్య పుస్తకాలు వేసేవాళ్ళ పట్టి విషప్పురుగులు. వాళ్ళ మా తాతయ్య నెత్తురు పీల్చేస్తున్నారు. ఇట్లా అంతా ఎందుకు పాడుచేస్తున్నారో నాకు అర్థం కాలేదు. పాడుచేయకుండా ఉంటే బాగుండును అనుకునే వాణ్ణి. చేసిన పనికి ప్రతిఫలం ముట్టనివాడు మా తాతయ్య అనుకునేవాణ్ణి. అటువంటి భక్తి పరుడు తాతయ్య. ఆయన యందు నా గౌరవం ఇనుమడించింది. చిన్నప్పటి నుంచి నాకు ఒకటే నేర్పాటు. మతంలో ఉద్యోగమే విద్య; సాహిత్యం అంటే పడి చావడమే అనురాగం—అని.

నాకు ఇంకా చదవను చేతకాలేదు. పుస్తకాలు కావాలనే అనవసర్థ అహంకారం మాత్రం బలిసింది. ఎవరిలాగో ఉండాలనే పట్టుదల పెరిగింది. తాతయ్య పుస్తకాలు వేసేవాడి దగ్గరకు వెళ్లాడు. వాడు 'లే కూంత్'' ఇచ్చాడు. దానిని రచించిన వాడు మారిస్ బూషోర్. ఆయన కవి. జానపదులు చెప్పుకునే కథలను పిల్లల కోసం కథలుగా అల్లాడు. బూషోర్‌ను గురించి ఇట్లా చెబుతారు. ఆయన కళ్లు పసిపిల్లవాడికళ్లలాగా ఉంటాయట. నేను వెంటనే ఆ పుస్తకాన్ని మ్రింగివేయ దానికి కూర్చున్నాను. ఆ పుస్తకం చిన్నది. రెండు చిన్న భాగాలుగా ఉంది. నేను వాటిని ఒకసారి అట్లా వాసన చూశాను. అట్లా ముట్టుకు చూశాను. అలవోకగా తెరచి చూశాను. తాతయ్య పుస్తకం తెరిస్తే "కావాలనుకున్న పేజీ" వచ్చేది. కిర్రుమని మోత మోగేది. నేను కూడా అట్లా చేద్దామనుకున్నాను. "సరియైన పేజీ తెరిచాను". కిర్రుమనిపించాను. అందులో పస కన్పించలేదు. పసిగాలేదు. అవి నా పుస్తకాలు కావనిపించింది. ఆ పుస్తకాలు నావేనన్న భావం కల్గలేదు. అప్పుడు వాటిని ఆట బొమ్మల్లాగా చూద్దామనుకున్నాను. ఉయ్యాలలు వూపాను. ముద్దు పెట్టుకున్నాను. కొట్టాను. కృత కృత్యుణ్ణి కాలేదు. కళ్లు నీళ్లు తిరిగాయి. పుస్తకాలను అమ్మ ఒళ్లో పడవేశాను. అమ్మ ఏదో పనిలో ఉంది. తల ఎత్తింది. "నాన్నా ? ఏమి చదవ మంటావు" అంది. ఇందులో దేవకన్యకల కథలు ఉంటాయి. చదవనా ?" అంది. నాకు ఆశ్చర్యం కల్గింది. ఈ పుస్తకాలలో దేవకన్యకలు ఉన్నారా ? నేను నమ్మలేక పోయాను. అమ్మను అడిగాను. నాకు ఆ కథ బాగా తెలుసు. అమ్మ చాలాసార్లు చెప్పింది. దుమ్ము దులుపుతూ చెప్పింది. ఉడుకులాంతో ఒళ్లు అంటుతూ చెప్పింది. నీళ్లు పోస్తూ చెప్పింది. అమ్మ నీళ్లు పోస్తూ ఉన్నప్పుడు చెయ్యి జారి సబ్బుబిళ్ల నీళ్ల తొట్టెలో పడుతూ ఉండేది. దానిని వెదికి తీస్తూ చెప్పింది. వినివిని నాకు విసుగు పుట్టింది. అరచెవి పెట్టి వినేవాణ్ణి. ఎప్పుడూ వింటూ ఉండే కథే నాది. నాకు ఒక్కటే కోరిక. రోజా తెల్లవారుఝామున నాకు ఎన్ని—మారీ కనిపిస్తూ ఉండేది. అందకత్తె. ఆమెను చూస్తూ ఉండాలన్నదే కోర్కె. ఆ కంఠం వినాలి. ఆ కంఠ ధ్వనిని, బానిసత్వం చేత అర్థకుంఠితమైన దానిని, వినాలి. ఆమె వాక్యాలు ఎప్పుడూ పూర్తిగా పలికేది కాదు. పగంలో సమూలుతూ ఉండేది. అది ఒక పళాన తెమిలి వచ్చేది కాదు. అంతలో ఏదో రహస్యం; దాని బ్రతుకు కూడా తెల్లవారేది కాదు. తోక ముడిచేది. ఓడిపోయి కాలికి బుద్ధి చెప్పేది. తంతలో తిరిగి ఏదో ధ్వని; కర్కశంగా, అందంగా ఉండేది. అప్పుడు మాటలు బాగా వచ్చేవి. సాఫీగా వచ్చేవి. ఒక్క గతుకు, తర్వాత సాఫీ—అట్లా ఉండేవి. ఇక్కడ కథ ప్రధానం కాదు. అది అనుషంగికం. ఆమె తనలో తాను మాట్లాడుకుంటున్నట్లు ఉండటం, జనాంతిక సంభాషణం జరపడం, ఆ సంభాషణకు లగింపు కుదిర్చడం—ఇదే ప్రధానం. ఇదే ముఖ్యం. ఆమె మాట్లాడుతూనే ఉండేది, మేము తప్ప ఎవరూ ఉండేవారు కాదు. మనిషికి దూరంగా,

దేవుళ్లకు దూరంగా, పాఠం చెప్పే వాళ్లకు దూరంగా, అడవులలో సెలవంకలు ఉన్నట్లు ఉండేవాళ్లం. రెండు సెలవంకలు; ఇంకా చాలా సెలవంకలు ఉండేవి. అవి ఆ దేవ కన్యకలు. వాటితో కలిసిపోయి మేము ఉండేవాళ్లం. నాకు దేవుళ్ల మీద, దేవతల మీద నమ్మకం ఏమిటి ? నమ్మకంవు, ఉడుకులాం కంపు కొడుతూ ఉండేది. మా జీవితం ఈ కథను కట్టడం కోసం ఈ పుస్తకం వ్రాశాడా ? నేను నమ్మలేక పోయేవాణ్ణి.

ఎన్నీ—మారీ— నన్ను తనకు ఎదురుగా కూర్చోమనేది, నాకు చిన్న కుర్చీ ఉంది. దాని మీద కూర్చో మనేది. నేను కూర్చునే వాణ్ణి. అప్పుడు ఆవిడ అట్లా వాలి, కనురెప్పలు మోడ్చి, నిద్దుర పోయేది. ఆ ముఖం ఏదో ముసుగు తొడుక్కున్నట్లు ఉండేది. పాత పోసిన విధంగా మాటలు విన్పించేవి. నాకు అదో విధంగా ఉండేది. భయోమయంగా ఉండేది. ఎవరు మాట్లాడుతున్నారు ? ఏమి మాట్లాడుతున్నారు? ఎవరితో మాట్లాడుతున్నారు. అమ్మ కాదు. అమ్మలేదు. అంతర్థానమై పోయింది. తిరోహితమైంది. ఒక్క చిరునవ్వు పెదలేదు. రవ్వంత గూడు పుతాణీలేదు. నేనో ప్రవాసిని. నాకు ఆ భాష అర్థంకాలేదు. గుర్తు పట్టలేక పోయాను. ఈ రహస్యాలన్నీ అమ్మ ఎక్కడ నేర్చింది ? ఎవరికి తెలుతోంది ? ఒక్క క్షణం. నాకు తెలిసింది. పుస్తకం మాట్లాడుతోంది. ఆ మాటలు నన్ను భయపెడుతున్నాయి. పెయ్య కాళ్ల జెర్రులకు మల్లే ఉన్నాయి. అక్షరాలు. అక్షరాల కూడికలు. సంధులు పూడివస్తున్నాయి. పొల్లులు మ్రోగుతున్నాయి. వేణువులు పూడుతున్నాయి. అనునాసికాలవుతున్నాయి. నిట్టూర్పులతో, అలస్యాలతో తిరుగు తున్నాయి. అజ్ఞాత శబ్ద సామర్థ్యం చేత పొడ్కల్యం పెంచుకుంటున్నాయి. వాటి మర్య అవే ప్రేమ చేసుకుంటున్నాయి. వంకర నడకలు కొడుతున్నాయి. నేనంటే వాటికి ధ్యాసే లేదు. నన్ను పట్టించుకోనడమే లేదు. నేను అర్థం చేసుకోవాలనుకుంటాను. అర్థం కాకముందే అవి అంతర్థానం అవుతున్నాయి. కొన్ని ముందుగానే అర్థం అవుతున్నాయి. గొప్పగా మొగ్గలు వేసుకుంటూ అవి ముందుకు పోతున్నాయి. చివరికి పోతున్నాయి. ఒక్క 'కామా'ను కూడా నా కోసం పెట్టడం లేదు. అవి నా కోసం కాదువలె ఉంది. కథ మాత్రం ఆదివారం కోసం సింగారించుకున్నట్లు ఉంది. కట్టెలు కొట్టేవాడు; వాడికో పెళ్లాం; ముగ్గురు కూతుళ్లు. ఓ దేవకన్య, ఇంకా చాలా మంది, చాలామంది; సన్నకారు జనం, మా బోటి వాళ్లు. అందరిలోను రాజసం ఉట్టిపడుతోంది. వాళ్లు కట్టుకున్నవి పీలికలు, బ్రహ్మాండంగా వర్ణించబడినాయి. ప్రతి దాని మీద మాటల ముద్ర ఉంది. శబ్దముల ప్రభావం ఉంది. కథలో పట్టులను తద్ధితాల క్రింద మారుస్తాయి. సంఘటనలకు కర్మకాండ వేషాన్ని తొడుగుతాయి. ఎవరో ప్రశ్నలు అడగడం మొదలు పెడతారు. మా తాతయ్య పుస్తకాలు వేసే ఆయన. బడిపిల్లల పుస్తకాలు వెయ్యడంలో ఆయన మొనగాడు. అది ఆయన పాపమ్మ. కుర్ర వాళ్లను ప్రశ్నలు వేసి తెలివి తేటలు పరీక్షిస్తాడు. అడవు చిక్కితే వదలడు. కట్టెలు కొట్టే వాడు ఉన్నాడా ? వాడి స్థానంలో నువ్వు ఉన్నావనుకో ! ఏమి చేస్తావు? అందులో పిల్లలు ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారు. అక్కా, చెల్లెలు. వాళ్లిద్దరిలో ఎవరంటే నీకు ఇష్టం ? బాచెతా శిక్ష ఉంది. అది నీకు నచ్చిందా ? నీవు ఒప్పుకుంటావా ? ఇట్లా ప్రశ్నలు వేస్తాడు. పిడుపు కథలు వేసినట్లు వేస్తాడు. ఇప్పుడు ఈ శిశువు ఉన్నాడు. వాడు పూర్తిగా నేను కాదు. జవాబు చెప్పాలంటే నాకు భయమయ్యేది. నేను నేను కాక ఎవరినో అయినట్లు అనిపించేది. ఏదో చెప్పేవాణ్ణి. కంఠం పెగిలేది కాదు. ఎన్ని— మారీ ఉంది; ప్రశ్నలు చెప్పే దాని ముఖం చదివు. అది కూడా అది కాని విధంగా ఉండేది. ఎవరో అయిపోయేది. అమె అందరి తల్లి; నేను అందరి బిడ్డను— అట్లా అయిపోలే వాళ్లం. అమె ఏడవడం మానేది. నేను వెంటనే పుస్తకాలు లాక్కునే వాణ్ణి. చంక క్రింద పెట్టుకునే వాణ్ణి. చక్కా పోయే వాణ్ణి. ఇంత చేసినందుకు ఒక్క మాట గూడా అనేవాణ్ణ కాదు. పెళ్లిపోయే వాణ్ణి.

నాతో నేను నేను కాకపోవడం ఇట్లా జరిగింది. రాను రాను అది నాకు ఆనంద సంధాయకం అవుతూవచ్చింది. మారిన్ బూషోర్ నా శైశవ జీవితంమీద అట్లా తొంగి చూచాడు. అందులో అద్దాలు ఉండేవి. ప్రపంచం అంతకు సంబంధించిన అద్దాలు ఉండేవి. పెద్ద పెద్ద దుకాణాలు ఉన్నాయి. అందులో సరుకులు అమ్మేవాళ్లు ఉంటారు, కొనేవాళ్లు వస్తారు. ఆ కొనేవాళ్లకోసం ఆ అమ్మేవాళ్లు ఎంత అద్దాలు చూపిస్తారు? బూషోర్ నా మీద ప్రసరింపచేసిన అద్దాలు అటువంటిది. అది నాకు మూసి పోయింది. కట్టు కథలంటే ఇష్టం తగ్గింది. పుస్తకాలలో వ్రాసిన కథలంటే, కల్పనాకథలంటే మోజు హెచ్చింది. శబ్దాలు దూరవు. అవే వరుసలో ఉంటాయి. అవి నన్ను ఆకర్షించాయి. నా మనస్సు వాటికి వశమవుతోంది. ఎప్పుడన్నా చదువు; ఎన్నిసార్లన్నా చదువు; అవి అట్లాగే ఉంటాయి. వరుస మారదు. క్రమం తప్పదు. వాటికోసం నిరీక్షణ అధికమైంది. ఎన్నీ— మారీ కథలో కథలలో అంతా అరాచకమే. అంతా ఎగుడు దిగుడే. ఆ కథల్లో మనుష్యులు ఒక పద్ధతిలో ఉండేవాళ్లుకాదు. ఎన్నీ—మారీ సంగతి కూడా అంతే. ఆ మనుష్యులందరు వాళ్ల కర్మ అన్నట్లుగా ఉండేవాళ్లు. అది అంతా చరిత్రలో తద్దినంలాగా ఉండేది. పేర్లూ, ఊళ్లూ; ఊళ్లూ పేర్లూ— అంతులేకుండా చర్విత చర్వణం అవుతూ ఉంటాయి. వాటిముందు నేను పట్టి ప్రేక్షకుణ్ణి. ఇట్లా ఉండేది.

చెప్పవద్దు. అమ్మ అంటే నాకు కొంచెం ఈర్ష్య పుట్టింది. అమ్మ కథ చెప్పడం ఏమిటి? నేను వినడం ఏమిటి?

నేను చెప్పాలి. అమ్మ వినాలి. మా ఇంట్లో "ట్రిబ్యులాసియొదాః షీన్వా అషీన్" అన్న పుస్తకం ఉంది. అది పుచ్చుకు పరుగెత్తాను. సామానుల గది ఉంది. అందులో పందిరి మంచం ఉంది. దానిమీద పడ్డాను. పుస్తకంమీద కూడా పడ్డట్లు నటన చేశాను. పుస్తకంలో ఉన్న నల్లని పంక్తులు. కళ్లను వాటివెంట త్రిప్పాను. ఒక్క బంతి కూడా వదిలిపెట్టలేదు. నాకు నేనే కథ చెప్పుకున్నాను. వినిపించేట్టు చెప్పుకున్నాను. ప్రతి మాట అన్నాను. వదిలి పెట్టలేదు. నేను ఎక్కడ ఉన్నది తెలిసిపోయింది. తెలిసిపోయేట్లు చేశాను. అట్లాగా నాన్నా! అన్న మెప్పుదలలు వచ్చాయి. అప్పుడు అక్షరాలు నేర్పితే బాగుంటుందనుకున్నారు. అందుకు సమయం అయ్యారు. మతం పుచ్చుకున్నంత ఉత్సాహం కల్గింది. నాకు నేనే 'ప్రైవేటు' చెప్పుకున్నాను. సామానుల గది ఉంది. పందిరి మంచం ఉంది. హెక్టార్ మాలో "సాఁఫామీయ్' ఉంది. నేను ఉన్నాను. దాన్ని కంఠో పాఠం చేశాను. సగం అప్పచెప్పుకోవడం. సగం కూడా పలుక్కోటం; ఒక పేజీ తర్వాత ఒక పేజీ. అట్లా పుస్తకం అంతా పంత చెప్పుకున్నాను. చివరి పేజీ తిరగ వేశాను. నాకు చదవడం తెలిసింది.

నా సంతోషానికి పట్టపగ్గాలులేవు. అడవులను గూర్చి మృగాలను, పక్షులనుగూర్చి పుస్తకాలు ఉన్నాయి. అవి ఎప్పుడూ ఏదో కలకలం చేస్తున్నట్లు ఉంటాయి. ఎండిపోయిన కంఠాలు అన్నీను. ఒక్కసారి అట్లాచూస్తే చాలు, తాతయ్యకు అన్ని మోతలు మ్రోస్తాడు. తాతయ్యకు అవి అట్లా వినిపిస్తాయి. నాకు వినిపించేవి కావు. ఇప్పుడు వినిపిస్తున్నాయి. ఇప్పుడు అవి నా సొంతం. హమారా హక్కు. నేను ఇప్పుడు వాటిని వింటు న్నాను. వాటితో నేను ఉపన్యాసాలు ఇచ్చుకుంటున్నాను. మాటలు కొట్టేసుకుంటున్నాను. నాకు అన్నీ తెలుస్తున్నాయి. ఇప్పుడు నేను లైబ్రరీకి పోవచ్చు. అందులో తిరగొచ్చు. అక్కడ మానవ విజ్ఞానం అంతా పొత్తులలో పేరుకొనివుంది. నేను కూలివేసి దాడి చేశాను. నేను ఇంతవాణ్నయ్యాను. అందుకు అది కారణం. అది నన్ను ఇంతవాణ్ణి చేసింది. చాలాకాలం తర్వాత యూదులు వట్టి మూర్ఖులని, వారికి ప్రకృతి, ప్రకృతి రహస్యాలు తెలియవని, అందువల్ల వాళ్లు వట్టి బడుద్ధాయిలని అనడం విన్నాను. యూదులంటే కిట్టనివాళ్లు ఇట్లా అనేవాళ్లు. నేను అనేవాణ్ణి. అట్లా అయితే నేను యూదుల కన్నా యూదుణ్ణి" అని. చిన్ననాటి జ్ఞాపకాలను, చిన్ననాటి సంగతులను నాలో నేను వెతుక్కుంటూ ఉంటాను. అవి కన్పించవు. అల్లికపడిన ఆ జ్ఞాపకాలు, గ్రామీణ శిశుత్వ నిర్వేతుకా స్థితి నాకు అందకుండా పోయింది. ఎల్లా నేలను మట్టగించింది ఎప్పుడూలేదు. పిట్టల గూడులకోసం వెతుకులాడిందీలేదు. చెట్టులకోసం పట్టుదలతో వెట్టినదీ లేదు. పిట్టలమీద నెట్టనగా రాళ్లు కొట్టినదీలేదు. నా పుస్తకాలే నాకు పిట్టలు. నా పుస్తకాలే నా పిట్టలు పెట్టె పట్టులు. నాకు ఇష్టమైన జంతువులు. జంతువులు ఉండే చోట్లు. పల్లె పట్టులంటారు. అవి కూడా నాకు పుస్తకాలే. లైబ్రరీయే నాకు సర్వమూను. అద్దంలో అది పెద్ద అద్దం. ప్రపంచంఅంతా అందులో అద్దబడిఉంది. దాని పరిణామం దానికి ఉంది. దాని వైశాల్యం దానికి ఉంది. దాని వైవిధ్యం దానికిఉంది. ఇదమిత్థమని చెప్పరాని దైవస్థితి అంటూ ఒకటి వుంటే, అట్టిదానియొక్క స్థితి దానికి ఉంది. నేను ఒక మహా సాహసానికి తెగబడ్డాను. అది ఊహించ రానంతటి సాహసం. అందులో కుర్చీలు ఎక్కడం, బల్లలు దూకడం ఘనకార్యాలు. అందులోనూ ప్రమాదాలు ఉన్నాయి. ఈ ఎక్కడములో, ఈ దూకడములో ఏమి తప్పు జరిగినా పుస్తకాలు మంచు కొండలు విరిగినట్లు ఒరిగి పడతాయి. నువ్వు క్రింద కూలక పోతావు. పై అరలలో పుస్తకాలు ఉన్నాయి. చాలాకాలందాకా అవి నాకు అందని మ్రానిపండ్లుగా ఉండి పోయినాయి. అందేవి ఏమున్నాయంటే వాటిని నన్ను ముట్టు కోనియ్యలేదు. చేతులలో నిల్వనీయలేదు. తప్పేశారు. ఇంకా ఎన్నో పుస్తకాలు ఉన్నాయి. దాక్కున్నాయి. నేను వదలలేదు. బయటికి లాగాను. చదివి ఎక్కడ పెట్టాలో అక్కడ పెట్టే వనుకున్నాను. మళ్లీ వాటి ముఖం చూడాలంటే రోజులకు రోజులు పట్టేది. వారాలకు వారాలు గడిచేవి. ఒక్కొక్కప్పుడు పెద్ద యుద్ధాలే నడిచేవి. ఆల్బములు ఉన్నాయి. తెరిచేవాణ్ణి. రంగుల రంగుల బొమ్మలు ఉండేవి. ఒకబొమ్మ దగ్గరకు వచ్చేవాణ్ణి. వికృతమైన కీటకాలు పాకినట్లనిపించేది. కళ్ల ముందు అవి ఒకటే ఆడేవి. తివాసీమీద పడుకొని ఫాంటనెల్, అరిస్టొఫేన్స్, రేబిలేలను తిరగవేసేవాణ్ణి. బంతులు కొరుకు పడేవికావు. పిడిరాళ్లలాగా ఉండేవి. వీటితో జాగ్రత్తగా ఉండాలి. ప్రక్కకు తప్పుకుపోతూ ఉండాలి. చూట్టూ తిరగాలి. మన కెందుకులేఅని దూరంగా తప్పుకు తిరుగుతున్నట్లు ఉండాలి. అంతలో హఠాత్తుగా ఎదురుతిరిగిమీద పడాలి. మనం అట్లా చేస్తున్న సంగతి అక్కడ ఉండదు. అట్లా బేహజారు'గా ఉన్నప్పుడు పట్టుకోవాలి. అబ్బ! ఆ మాటల కు బోలెడన్ని రహస్యాలు. ఒక్క పళాన అంతుపట్టవు. అంత పట్టనివ్వవు. రహస్యాలను దాచుకుంటాయి. నేను మాత్రం ఆ పుస్తకాలను చదువుతూ ఒకసారి 'లాపెరూజ్'నయిపోతూ ఉండేవాణ్ణి. ఇంకోసారి 'మాగెల్లాన్'ను అయి పోయేవాణ్ణి. మరోసారి 'వాస్కోడిగామా'నే అయ్యేవాణ్ణి. విచిత్రమైన దేశాలకుపోయి విచిత్రమైన జనాన్ని కనుగొంటూ ఉండేవాణ్ణి. అనేకసార్లు, అనేక పుస్తకాలలో నాకు ఇటువంటి అనుభవమూ అనుభూతి కలుగుతూ ఉండేవి. వికోవ్', 'షియామ్మే' 'పారాంగూ' ఆదిగాగల పండితాది 'కాఫిర్'లు పేజీలు తిరగ వేస్తూవున్నకొద్దీ పైకిలేస్తూ ఉండేవాళ్లు. పేరాగ్రాఫులకు పేరాగ్రాఫులు వారి దర్శనంవలన విస్మయింపబడిపోతూఉండేవి. ఆ మాటలకు పది పదిహేను సంవత్సరాల అనంతరంగాని నాకు అర్థాలు తెలియలేదు. ఇవ్వాళ్టికికూడా అందులో కొన్నిమాటలు నాకు కొరుకుడు పడకుండా బుర్రకు ఎక్కకుండా మిగిలి పోయినాయంటే నమ్మండి! నా బుర్రలో అవి అట్లా ముడ తలుపడ్డ ఆకులవతుగా ఇప్పటికీ విచ్చి ఉన్నాయి.

("ఎన్‌కౌంటర్" సౌజన్యంతో)

# అతి భాగ్యశాలి

## శ్రీ పి. గణపతి శాస్త్రి

హతవిధికి నాపై మహాసూయ కలిగెనో!
అడుగడుగునా వెంటబడి తరిమి వేటాడె.
అంతరాన నిరంతరాగ్నికీల రగిల్చి
అంతమే లేని నైరాశ్య ధూమము నించె.

మనికిజూదమ్ములో పెను పందెములు వైచి,
మరుగు పేరాస మైమరిచి పాచిక విసిరి,
మాటిమాటికి ఓడి, మరి బ్రతికి ఫలమేమి?
మరణమే ఇక పరమశరణ మని తలచితిని.

కాని, నా హృదయ ముక్తాహార హీరమణి!
మానసము నిన్నొక్కమారు తలచిన యంత,
ఆనందజలధి లోలోన ఉప్పొంగినది!
మేనెల్ల వివశమై మింటికే యెగసినది!

ఐశ్వర్యవంతులై, అధికార మహితులై
అవనిలో వివిధ వైభవపూర్ణు లున్నారు!
అయిన నేమాయె! రవ్వంత నను బోలగల
అతి భాగ్యశాలి ఒకడయిన లేడనిపించె!

---

# రచయిత అతని సమస్యలు - 4

శ్రీ యుజ్నే ఐనెస్కో

తాను తానుగా వుండడం, వుండకపోవడం అనేవి రెండూ సరిసమానంగా కష్టమైనవే. విలువకట్టడానికి కొలతబద్దలు, ప్రమాణాలు అనేవి వుండటం నిష్పాక్షిక దృష్టికి చిహ్నాలుకావు. అంతేగాకుండా, బహువిధమైన ప్రమాణాలు వుండడం, అస్పష్టస్థితికి దోహదమిస్తుంది. ఏవిధమైన ప్రమాణాలతోను, కొలతబద్దలతోను సంబంధంలేకుండా విమర్శను వూహించవచ్చు. విమర్శకుడు రచన నడిచిన త్రోవనే ఆసాంతము నడిచి, అది చెప్పిన దేమిటో వర్ణించి వూరుకుంటే చాలనుకుంటాను. విమర్శకుడు నైతికవాది, తత్వవేత్త, మానసిక శాస్త్రవేత్త, సంఘశాస్త్రవేత్త కావచ్చు. ఒక రచనయొక్క నైతికప్రబోధాన్ని, తాత్విక ప్రబోధాన్ని నిర్ణయించడం అనేది న్యాయమైనదైనా, అది వేరేస్థాయిలో జరుగుతుంది: అది రచనను గురించిన విమర్శ కాదు. అది భిన్నమైన విషయం, కాని రచన నడకలో నడిచే విమర్శకుడు రచనను వెలుగులోకి తీసుకువస్తాడు. నిజానికి అదే అతను చేయవలసింది. అలా చేస్తేనే అది విభిన్న మార్గాలలో పోతున్నదా, విభిన్నమార్గాలలో పోతున్నప్పటికి చివరకు ఒకే గమ్యస్థానానికి చేరగలదా లేదా అనేది తెలుస్తుంది.

వ్రాయడం అంటే గమనంలో గమనించడం. వ్రాయడం అంటే అన్వేషణ. కవి సంచారక్రమాన్ని విమర్శకుడు తిరిగి చెప్పాలి. కవి తరచు చీకటిలోనో, సంధె చీకటిలోనో సంచరిస్తూవుంటాడు. అతను సంచరించిన ప్రాంతాలను విమర్శకుడు దీపము వెలిగించి చూపిస్తాడు. రచన అనేది ఒక కట్టడంలాంటిదని నే నిదివరకే చెప్పాను. కట్టడాన్ని గట్టిగా కట్టాలి: దాని లోపాలను అంటే కప్పు కారుతున్నదా, మెట్లు పడిపోయేటట్టు వున్నాయా, కొన్ని గదులలోకి వెళ్ళకుండా తలుపులు తాళాలు వేసి వున్నాయా ఈ మొదలైన లోపాలను చూపించడం విమర్శకుని పని.

తాను వ్రాసేటప్పుడు కవి తా నెరిగిన రచనల నన్నింటిని మర్చిపోవాలి: చెప్పిందే చెప్పడం జరిగిందేమో అని చెప్పడంకోసం విమర్శకుడు కవి రచించిన మొత్తరు రచన

లన్నిటిని జ్ఞప్తిలోవుంచుకోవాలి. పాతది కాకపోయినంతమాత్రాన మనకు తెలిసిన వాటిని మించినదని అనుకోనడానికి వీలు లేదు. అదొక పద్ధతికి చెందింది. ఆ పద్ధతి లోనే భిన్నమైనది. అది ఇంకొక కంఠస్వరం. అయితే ఇది నిజంగా విమర్శేనా అని ఆశ్చర్య మేస్తుంది. ఇది సాహితీ చరిత్రా లేక విభిన్న రచనను పరస్పరం పోల్చిచూడడమా అని అనిపిస్తుంది. పుస్తకాన్ని వర్ణించడంలో విమర్శకుడు ఆ పుస్తకం అంటే తనకు ఇష్టం-అయిష్టం అని చెప్పకూడదు. ఇంకొక పుస్తకంకంటె బాగున్నదని — బాగాలేదని అనకూడదు. అలా అంటే తన పాఠక దృక్పథాన్ని వెల్లడిచేసినట్టు అవుతుంది. అభి రుచుల విషయంలో వాదానికి తావులే దన్నది తెలిసిన విషయం. విమర్శకుని తీర్పు పుస్తక వర్ణనను మించివుండకూడదు. విమర్శ అంటే రచనలో వున్నదానిని సరిగ్గా తెలియజెప్పడం, అవునా - కాదా అని తేల్చడం, ధృవపరచడం.

విమర్శకుని వర్ణనలోని వివరణ మూలానే రచన లోపాలు ప్రదర్శిత మౌతాయి. వర్ణన అంటే తీర్పుచెప్పడం అనడంలో ఇదే ఉద్దేశ్యం. లోపాలు అంటే నిర్మాణంలోవుండే లోపాలు. నిర్మాణం అనే మాట పూర్తిగా సరైనమాట కాదు. మామూలుగా నిర్మాణం అంటే అనుకొనే అర్థంకాదు. నిర్మాణం లేకపోవడమే ఒక్కొక్కప్పుడు ఒక రకమైన నిర్మాణం అవుతుంది. ఒక నిర్ణీతమైన పద్ధతిని అనుస రించకపోవడంవల్లనే ఒక రచనలో లోపాలు ఏర్పడతాయి. ఇక్కడ నిర్దుష్టత అనే ప్రసక్తి రాదు. నిర్దుష్టత అనేది కూడా ఒక అస్పష్ట మైన మాటే. కృత్రిమం అనేదే సమస్య. తాను పెట్టుకున్న నియమాలను తాను అనుసరించకపోవడమే దాని లోపం. ఈ నియమాలు కళకు సంబంధించిన నియ మాలు కావు. అసలు అవి ఏమిటో ఎవ్వరికీ తెలియదు. అనేక రకాల నియమాలు వున్నాయి. పద్ధతులు వున్నాయి: అనుస రించలేదన్నది రచయిత తానై ఏర్పరచు కున్న నియమాలే. ఒక రచనలోవుండే నియమాలను అనుసరించి, కొన్ని పద్ధతులు రూపొందుతాయి. ఒక రకమైన రచనలో అంతర్గతంగావున్న సూత్రాలను అనుస రించి, ఒక రకమైన నియమాలను ఏర్పడే టట్టు చేయవచ్చు. అందుకనే రసాన్ని గురించిన వాదాలకు ఏకీభావం వుండదు. కళతో కూడిన ఒక రచన ప్రతిపాదించిన నియమాలకు పెద్ద ప్రాముఖ్యత వుండక పోవచ్చు.

ఈ నియమాలను ఆధారంచేసుకొని సూత్రాలను ప్రశ్నలను పెంచుతారు: ప్రాథ మికమైన, పరిపూర్ణమైన ఒక శాసనం వుండివచ్చు. కాని అదేమిటో ఇంతవరకు ఎవ్వరూ తెలుసుకున్నారని నేను అనుకోను. కళకు తృప్తికరమైన నిర్వచనం లేదు. వివ రణవల్ల ఒక రచనలోని విశీర్ణత్వం బయట పడితే దాని లోపాలు ప్రత్యక్షం అవుతాయి. రచన బలహీనత బయటపడుతుంది. అంత ర్గతంగా దానిలోవున్న విరుద్ధభావాలు, దానిని పట్టి పిప్పిగా మారుస్తాయి. ఒక రచన తాను చెప్పుకున్నది కానప్పుడు చెడ్డది అవుతుంది. అది ఒక వ్యక్తివలె ప్రత్యేకంగా వుండాలి. ఆ ప్రత్యేకత అంటే అందంగా వుండాలనికాని, సౌష్టవంగా వుండా

లని కాని కాదు. అందంగావున్నా, అంద వికారంగావున్నా దానికి అదిగా నిలబడలి ఇంకొకదానితో మార్పిడి చేయడానికి వీలు లేదు. రచనలోవుండే తప్పులు, నిరుపయోగమైన భావాలు ఏవంటే - దానిలో అతుకని భాగాలు. అంటే రచన అనేది పరస్పరం ఆధారపడిన అవయవాలున్న జీవి. నిజమైన రచన అంటే ఇదే అర్థం. సత్యానికి కళకు భేదం లేదనడానికీ ఇదే అర్థం. ఈ సత్యం రచయితకు కనపడేటటువంటిది. అతనికి కనపడే సత్యం అదొకటే. విషయ పరిశీలన ప్రగాఢమై, పరిపూర్ణమై, తాదాత్మ్యత సిద్ధిస్తుంది. తాదాత్మ్యత అనేది ఎంతో అవసరం. రచన ఒక వైఖరిని వెల్లడి చేయడం. ఈ వైఖరికి ఒక ఆకారంవచ్చి, పైనచెప్పిన మోస్తరు ఒక జీవిగా తయారు అవుతుంది: బహువిధమైన విరుద్ధశక్తులు, దానిని తినివేయకుండా శరీరంలోవున్నట్లే, రచనలో కూడా వుంటాయి.

ఆవేశాలు, ఉద్దేశాలు ఎన్నివిధాలుగా ఎంత భిన్నంగా, ఎంత క్లిష్టంగా వర్ణించగలిగితే అంతగా రచనకు ప్రాధాన్యత ప్రాప్తిస్తుంది. రచన ఒక ప్రత్యేకత, ఒక వ్యక్తిత్వం కలది. ఒక నిర్మాణము, అన్వేషణ ఫలితం. ఊహాజనితం - వాస్తవం; ఉపయోగము - నిరుపయోగము; అవసరము - అనవసరము; సత్యము - సాహిత్యము; అది కపటమెరుగని వ్యాసంగ ఫలితం. దానిని తిరస్కరించవచ్చు. హానికరమైనదనవచ్చు. ఒక వ్యక్తిని ఖండించినట్లే, చంపివేసినట్లే దీనినీ చేయవచ్చు: అయితే ఇది విమర్శకుని పని కాదు. నైతికవాదిది. సంఘవాదిది: దైవ శాసనాన్ని గురించి చెప్పేవారిది: శిరచ్ఛేదకునిది. ఈ రచన ఇతరులకోసం ఎందుకు వుండాలని; అది వున్నట్లుగా వుండడానికి కారణమేమిటని; ప్రజలు దానిపట్ల ప్రవర్తించిన పద్ధతికి కారణమేమిటని చెప్పడం కూడా విమర్శకుని పనికాదు. ఆ విధమైన పరిశీలన నిరుపయోగమని చెప్పను. అది వేరే విధమైన పని అంటాను.

ఇప్పటికి నేను కొన్ని అంశాలను నిరూపించగలిగానని అనుకుంటాను. రచనకు పూనుకొనడానికి కారణమైన ఉద్దేశాలు, వికారాలు, ఇంకా కారణమైనవి, కాకపోయినవి లెక్కలోనికిరావు. వాటికి అతీత స్థితిని పొందడం జరుగుతుంది. రచన ఆ స్థితిలో చేసినది. అది అతని అదుపాజ్ఞలలో వుండదు. తాను తయారు చేయాలనుకున్న దానికి భిన్నంగా వుంటుంది. రచనకు ఏదో ఉద్దేశ్యం వున్నదని చూపెట్ట ప్రయత్నించే వారు, దృష్టిని రచననుండి మళ్లిస్తున్నారని చెప్పాలి, ఒకరికి ఇష్టంవున్నా, ఇష్టంలేకపోయినా ఒక వ్యక్తిని లేదనలేనట్లే, ఒకరు చూడడం ఇష్టపడనంతమాత్రాన రచనను లేదనలేరు. అతను అతనుగా వుంటాడు. వున్నాడు. అతనిని లెక్కలోకి తీసుకోవాలి. ప్రభుత్వాధికారులు జనాభాను లెక్కలో వ్రాసుకుంటారు, విమర్శకుడు రచనను గురించి వ్రాసుకుంటాడు. పుట్టిన బిడ్డ ప్రత్యేక లక్షణాలను పేర్కొంటాడు. అది మనుష్యుల బిడ్డే అని, పిల్లిపిల్ల, చేపపిల్ల కాదని, ఎవరిబిడ్డో కాదని, వాకబుచేసి ధృవపరచుకుంటాడు. దానిని ఏమిచేయాలంటే అది వేరేవిషయం.

విమర్శకుడు విచక్షణాజ్ఞానాన్ని చూపించాలి. అంటే ఇది - ఇది; అది - అదికాదు,

అని వేరుగా చూపెట్టాలి. "ఈ రచన అంటే ఇది. అది చెప్పినదేదో నేను వివరించాను. దాని అంతర్భాగాలు ఎలా పనిచేస్తున్నాయో చెప్పాను. ఇది దాని ఎక్సురే ఫొటో. ఇది దాని గుర్తుచీటి." ఈ విధమైన విమర్శ ప్రత్యేకమైన వ్యాసంగము. విమర్శకుడు, విమర్శ చేసేటప్పుడు తత్వజ్ఞుడు కావచ్చు. కళాపరిశీలకుడు కావచ్చు. మానసిక శాస్త్ర వేత్త, నైతికవాది కూడా కావచ్చు. సాహితీ చరిత్రకారుడు కావచ్చును. భిన్న సాహిత్య పతిత కావచ్చును. అయితే చరిత్ర, తత్వ శాస్త్రము, విమర్శ తరువాత రావాలి. వాటి వాటివి వేరు వేరు రంగాలు. అవి ఒకటికి ఒకటి కాకూడదు.

రచన చెప్పినదానికి అంటిపెట్టుకొని, వర్ణన ఉండవలసినంత విపులంగానుంటే, రచన అంతఃశక్తి స్పందనాలు గోచరమై, రచనలోని ఏకత్వము బోధపడుతుంది. దాని సంచలనము, స్వభావములు చూడటానికి తోడ్పడుతుంది. (నిర్మాణం అనటంకంటె సంచలనం అనటం మంచిదేమో)దాని ఉద్దేశము, దాని అంతరార్థము, అప్రయత్నంగా వాటి కవే వెల్లడి అవుతాయి. ఏ ఒక రచనను గురించి వర్ణిస్తున్నా - అది కేవలం ఆ రచనకే అంటిపెట్టుకొని ఉండవలసినా— దాని సార్వాత్మికతను కూడా, నొక్కి చెప్పడం జరుగుతుంది. దానికి ఆధారమైనదీ, దానిని సమర్థించేదీ, అంటే అది అవసరమని అనేది, ఎప్పుడూ శాశ్వతంగా ఉండే సామాన్య మానవ ప్రవృత్తికి భిన్నంగా ఉండేటట్లు చూడటం జరుగుతుంది. దాని కదే సాటి కాబట్టి ప్రతి రచన ఒక ప్రత్యేక సృష్టి అయినా, ఇదివరకు ఎరిగినదే. సనిపి స్తుంది. రచన బాహ్యస్వరూపాన్ని మించి, దాని ప్రత్యేక వ్యక్తిత్వాన్ని, సాధారణ విమర్శ వ్యక్తపరచదు. ఒక రచనను గురించి చెప్పినది, ఆ కోవకు చెందినవాటి కన్నిటికీ వర్తిస్తుంది. ఈ విషయాన్ని నిరూపించటం అతి సులభం. ఒక చిత్రానికి, ఒక రచనకు సంబంధించిన వ్యాఖ్యానాన్ని తీసికొని, ఆ వ్యాఖ్యానించబడే రచన పేరు, రచయిత పేరు, ఆ రచనలో పేర్కొన్న మాటలను తీసివేసి, వేరే పేరునూ, వేరే మాటలనూ పెట్టిచూస్తే, మొదట రచనకు అతికినంత చక్కగానూ, రెండో రచనకు అతుకుతుంది. అదెవరు గమనించకుండా నేపోతుంది. ప్రధాన లక్షణాలనువదలి, అప్రధాన లక్షణాలమీద వ్యాఖ్యాత తన దృష్టిని కేంద్రీకరించటం మూలాన అస్పష్టమైన, సాధారణ సూత్రాలను పట్టుకొని వ్రేళ్ళాడటం జరుగుతుంది. రచనలో స్థూలంగా ఉన్న భావాలను, అది సూచించే నైతిక తాత్విక సూత్రాలను పట్టుకొని అసలు రచనను వ్యాఖ్యాత జార విడుస్తాడు. ఈ ఉద్దేశాలకు రచన చిత్రామాత్రంగా చూచాడు. కాని, దాని నిజ స్వరూపానికి, దానివరుసలో వచ్చిన ఇతర రచనలలో సాధారణంగా కనుపడే ఉద్దేశాలకు ఈ చిత్రీకరణకు పోలిక లేదు.

దీనికి సాక్ష్యం చాలా తేలికగా దొరకుతుంది. చిత్రలేఖనకు సంబంధించిన విమర్శను ఒకటి ఉదాహరణకు తీసుకొందాము. అందుకుగాను ఆంధ్రిలోకే ఒక చిత్రాన్ని గురించి చేసిన వ్యాఖ్యానాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాను :

"వర్ణ విషయంలో పునరుక్తి దోషం అనేది రాకుండా వుండడానికి, అది మరీ

మందంగాను మరీ పల్చగాను వుండకుండా వుండడానికి చిత్రకారుడు ఎంత శ్రద్ధ, జాగ్రత్త తీసుకున్నాడో తెలుస్తుంది. ఇవి చిత్రానికి సాధారణంగావుండే లోపాలు, చిత్రంలో ప్రతివస్తువు ఒక చిహ్నంగా రూపొందించబడింది. అది ప్రత్యేకంగా పేర్కొనబడి, ప్రక్కనున్నదానితో బాగా భిన్నంగా కనబడేటట్లు చూపబడింది. పరీక్షగా చూచినా, పైకి కనబడినట్లే కనపడుతుంది. స్వరూపంలోగాని పరిమాణంలోగాని ఏ రెంటికీ సంబంధంలేదు. అనిర్వచనీయమైన, సమానస్థితిగల, వేర్వేరు స్వభావముగల విభాగములకు, వస్తుసమూహానికి గల సంబంధాన్ని జ్ఞప్తికి తెచ్చేవిగా చిత్రించబడినది."

ఈ లక్షణాలుగల అనేక ఇతర చిత్రాలకు ఈ పరిశీలన ఎందుకు వర్తింపచేయకూడదు అని నేను అనుకుంటాను. ఈ వ్యాఖ్యాత మరొక చిత్రాన్ని గురించి ఇలా వ్రాశాడు :

"చిత్రంలో ప్రతి విభాగానికి ఇచ్చిన స్థానక్రమాన్నిబట్టి అది, ప్రక్కన వున్నది కలిసి నిజమైన కూర్పు తయారు అవుతుంది. ఒకటి రెండవదానిని సరిదిద్దే కోణాలమీద, వంపులమీద ఈ కూర్పు ఆధారపడివున్నది. పైకి క్రమరహితంగా కనుపడే దీనికన్న, ఎక్కువగా క్రమబద్ధమైనది మరిలేదు. పరిశీలనలో అనుకోని అర్థం రావటం జరగదు. చెల్లాచెదురుగా పైకి కనపడేదానిలో ఒక క్రమపద్ధతి దాగివున్నది" ఇతర చిత్రాలను మనస్సులో వుంచుకొని ఈయన వ్రాయడం లేదు కదా అనిపిస్తుంది. ఈ వర్ణనలో మాంఢ్రియానా జివాన్ వెల్డ్ గురించి చెప్పటంలేదా అని కూడా అనిపిస్తూంది... కాదు! ఫ్రూగల్ మాంటిగ్నా గురించి వ్రాశారు :

నాకు ఎంతో గౌరవంవున్న ఒక ప్రముఖ విమర్శకుడు ఇలా వ్రాశాడు : "ఆయన కళ ప్రకృతికి చాలా సన్నిహితంగా వుంటుంది. అంతే కాదు. ఆయన చిత్రించిన ప్రకృతి దృశ్యాలను చూస్తే ఇంప్రెషనిస్టు ధోరణి కనపడుతుంది. హార్బరులో నౌకలు, వాటి తెరచాపలుచేసే ధ్వని వినపడుతుంది."

అసలు ఈ వ్రాసేది ఎవ్వరినీ గురించి? డూఫీని గురించా లేక ఇంప్రెషనిస్టును గురించా లేకపోతే ఇంకా అంతకుపూర్వం ఏ పెద్ద స్రష్టనైనా గురించా? ఏమీ కాదు. మానిసర్‌ను గురించే. ఈ విమర్శకుడు ఇలా వ్రాశాడు : "దేవతలు, మునులు, విద్యాధరులు వచ్చి కైర్లిస్తు శిశువును దర్శించిన రాత్రి......మంత్రముగ్ధమైన కల్పిత గాథా వాతావరణమును, తూర్పుదేశముల భోగ పరాయణత్వము" గూర్చి చెప్పినప్పుడు డిలాక్రోయిక్స్‌ను గురించి కాని, ఇంకొక రినైజాన్స్ చిత్రకారుని గురించిగాని, లేక, స్రియలిస్టు చిత్రకారుని గురించి గాని చెప్పడంలేదు. ఇది మానిసర్‌ను గురించే.

ఇదంతా చూస్తే చివరికి రచనను సంక్షిప్తం చేయడమో, లేక దానిని గురించి చెప్పడమో లేక, విమర్శించబడేది, చిత్రం అయితే చిత్రాన్ని, పద్యం అయితే పద్యాన్ని, నవల అయితే నవలను పూర్తిగా ప్రచురిస్తే ఉత్తమమైన పద్ధతి ఏమో అని

అనిపిస్తుంది. ఇలా రచనకు అపార్థం కలిగించకుండా సాధ్యమయ్యే విమర్శ అసలు విమర్శే కాదు. కాని అంతమాట అనను. విమర్శకుడు చిత్తశుద్ధిగల అవయవ శాస్త్రజ్ఞుడుగా వుండాలి.

మలర్మే, వాలరీల కవిత్వాన్ని వ్యాఖ్యానిస్తూ థిబోబాల్డ్ చెప్పినట్టు సద్విమర్శకుడు రచన అంతరార్థాన్ని వివరించి, విప్పి చెబుతాడు. నేనింతవరకు చెబుతూ వచ్చినట్లు సద్విమర్శకునికి, మంచి ధారణా శక్తివుంటే, ఒక రచన కొత్తదా, పాతదా అని చెప్పగలుగుతాడు. రచన కొత్తగాను, సత్యంగాను వుండాలి. సత్యం అన్నదానికి అర్థం ఏమిటో తర్వాత చెప్పగలగవచ్చు. సత్యం అంటే శిల్పియొక్క ప్రగాఢమైన చిత్తశుద్ధికి చిత్రణ. ఒక రచన పుష్టి, పుష్కలత్వాన్నిబట్టి దాని విలువయొక్క ఎక్కువ తక్కువలు నిర్ణయం అవుతాయి. కొత్తగా వచ్చిన ఆ రచనలో చిత్రించబడిన ప్రపంచ స్వరూప స్వభావాలనుబట్టి కూడా నిర్ణయం అవుతుంది. అనేక రచనల అనంతరం గాని ఒక రచన రాదని మనకు తెలుసు. అంటే దానికి పరంపర అనేది వున్నదని అర్థం. అంటే అది తన తల్లిదండ్రుల బిడ్డే. తానే తన తల్లిదండ్రులు కాదు. ఒక వంశానికి చెందిన అనేక రచనలు వచ్చిన తర్వాత గాని, ఒక రచన రాదని మనకు తెలుసు.



# అడవి పూవు

## శ్రీ బలివాడ కాంతారావు

కనకరాజు భార్య కమల సన్నజాజి పువ్వులా నాజూగ్గా సన్నంగా ఉండేది. ఎప్పుడూ వాడని పుష్పంలా ఉన్న ఆమె మొహాన్ని ఎన్నిసార్లు ఆమె నిద్రపోతున్నా కూడా చూస్తూ మురిసి పోయేవాడు. ఆ దాంపత్యం నీలి ఆకాశంలో వెలిగే చంద మామ చిరునవ్వులా ఉండేది. హంసల్లాంటి తెల్లని బట్టలు కట్టుకొని, అపూర్వమైన వయ్యారం ఒలకబోసుకొని ఒక్కొక్క అడుగు వేస్తుంటే, గుప్పెట్లో ఇమిడిపోయేటట్లున్న ఆ నడుము పట్టుకొని ఆమెను తనవేపు త్రిప్పుకోవడం అలవాటు. నిజం చెప్పి న్యాయంగా ధనార్జన చేస్తే మనస్సెంత చల్లగా ఉంటుందో, ఆమెతో కాపురం అలా ఉండేది. రాబడి ఖర్చులు త్రాసులో సరితూగుతున్నట్లు సంసారం సాగించేది. జీవితం నల్లచుక్క పడని తెల్ల కాగితంలా ఉండేది.

చల్లనిగాలి, చిటికీ చిటికీ గాలివాన అయినట్లు ఒకనాడు కనకరాజు జీవితం భీభత్సం అయిపోయింది. సమ్మోహనంగా ఉండిన వసంతం గ్రీష్మంగా మారింది. కళ్లల్లోని ఆశాజ్యోతులు నిరాశతో నీరైపోయాయ్. సంతోషంలో ప్రవహించిన హృదయం దుఃఖంలో చెక్కలైంది. అతను ఏది నిత్యం ఏది సత్యం అనుకున్నాడో అది మాయా అసత్యం అయిపోయాయ్. కమల చనిపోయి ఆరు నెలలైనా నిన్నా మొన్నా ఆ పిడుగులాంటి సంఘటన జరిగినట్టుంది. ధైర్యాన్ని గుటకలు మింగి, శోకాన్ని భరించి, ఇద్దరి పాపల్ని ప్రాణప్రదంగా చూసుకుంటున్నాడు. మాటాడిన పుష్పాన్ని కోల్పోయిన అతని మనస్సు, మాటాడని మొగ్గలతో పరిచయాన్ని యేర్పరచుకుంది. అందుకే కళ్ల వేడుకనిచ్చే పూలతోటను తన బంగళా చుట్టూ సృష్టించుకున్నాడు.

ఒక నాటి వేకువఝామున యేదో కలగని తెలివి తెచ్చుకున్న కనకరాజు నిస్పృహను పరకాలని మనసును పూలతోటపై మళ్లించాడు. తోటలోనికి వచ్చి సిమెంటు దిమ్మపై కూర్చున్నాడు. వికసిస్తున్న మొగ్గలా, విచారం వదలుతున్న మనసులా ఉషస్సు ఉదయిస్తోంది. తన కుటుంబంలోని వ్యక్తుల్లా, ఆ రకరకాల పూలమొక్కలతో అతనికి సన్నిహితం ఉంది. ఉదయ భానుని రక్తాన్నంతా పీల్చేసి యెరుపుదేరిన మందారాలు సాయంత్రానికల్లా ఆ రక్తాన్నంతా తిరిగి అతనికి అప్పచెప్పి తలలు వంచేస్తాయ్. మల్లెలు కొల్లలుగా పూసి బంగళా చుట్టూ పన్నీరు జల్లుతాయ్. బొద్దుగా శీకరంగా పూసిన బొగడలు, ఆకుల్లో అణగి అపూర్వమైన వాసనలను వెదజల్లుతున్న సంపెంగలు, ఝుమ్మని రొదచేసే తుమ్మెదలను ఆహ్వానించే రంగురంగు గులాబులు, సుఖాన్ని పొదలు వెతుక్కొని రాత్రంతా వరుని కోసం వేచివున్న శోభనాంగిలా ఉన్న లిల్లీపూలు— వీటన్నిటి పేర్లు తెలుసు. వీటి అందాలు పరిమళాలు అతని మనసులో చోటు చేసుకొని మూగ బాసలతో తన దుఃఖాన్ని ఉపశమింప చేస్తున్నాయ్.

ఆకసంలో తోకచుక్కలా ఒక్కసారి తన దృష్టిని తొలిసారి గేటు దగ్గరేనున్న పేరు తెలియని పూలమొక్క ఆకర్షించింది. పెద్దకాడతో తెల్లగా ఒక పూవు తొలిసారి విడివడింది. ఆకలితో సన్నబడిన తల్లిలేని పిల్లలాంటి మొక్కను షికారుకు వెళ్లినప్పుడు ఆరునెలల క్రితం తెచ్చినాటాడు. మన్నిక మెరుగని రూపుతో మోటు ఆకులతో ఉన్న అడవి మొక్క అంత అందమైన పూవుతో సింగారించుకుంటుందని తను ఊహించుకోలేదు. అందమైన పువ్వును చూడగానే ఆ పూలమొక్కపై అభిమానం పెంచుకొచ్చింది. గబగబా దగ్గరకెళ్లి నిల్చొని చెట్టుని ఒకసారి ఆప్యాయంగా తాకబోతుంటే చేతిలో కాఫీ కప్పుతో పుష్పమ్మ ప్రత్యక్షమైంది. ఇన్నాళ్ల తను లేచేసరికి బెడ్‌కాఫీ మంచం ప్రక్కనే బల్లమీదుండేది. ఈ వేళ తను వేగంగా లేచిపోవటం ఈమె తనకు దగ్గరగా రావటంతో పరీక్షగా చూడటం జరిగింది.

రెండేళ్ల క్రితం ఆఫీసునించి ఇంటికి వచ్చేసరికి ఆకలితో చిక్కి అసహ్యంగా ఉన్న పిల్ల అగపడింది. ఎవరని అడక్కుండానే కమల ఆ పిల్లగాథ చెప్పింది. ఆ పిల్లకు యెవ్వరూ లేరట. అడుక్కుని కడుపు నింపుకుంటోంది. పని చేసుకోరాదా అంటే యెవరిస్తారని యెదురు ప్రశ్న వేసింది. ఆ ప్రశ్నకు సమాధానంగా కమల ఆ పిల్లని పనిపాట్లు చెయ్యడానికి పెట్టుకుంది.

# అడవి పూవు

శ్రీ బలివాడ కాంతారావు

కనకరాజు భార్య కమల మల్లెజాతి పువ్వులా నాజూగ్గా సన్నంగా ఉండేది. ఎప్పుడూ వాడని పువ్వులా ఉన్న ఆమె మొహమును మనసారా ఆమె నిద్రపోతున్నా కూడా చూస్తూ మురిసి పోయేవాడు. ఆ దరహాసం నీలి ఆకాశంలో వెలిగే చంద మామ చిరునవ్వులా ఉండేది. హంసల్లాంటి తెల్లని బట్టలు కట్టుకొని, అపూర్వమైన వయ్యారం ఒలకబోసుకొని ఒక్కొక్క అడుగు వేస్తుంటే, గుప్పెట్లో ఇమిడిపోయేటట్లున్న ఆ నడుము పట్టుకొని ఆమెను తనవేపు త్రిప్పుకోవడం అలవాటు. నిజం చెప్పి వ్యాఖ్యంగా దర్శన చేస్తే మనస్సెంత చల్లగా ఉంటుందో, ఆమెతో కాపురం అలా ఉండేది. రాబడి ఖర్చులు త్రాసులో సరితూగుతున్నట్లు సంసారం సాగించేది. జీవితం నల్లచుక్క పడని తెల్ల కాగితంలా ఉండేది.

చల్లనిగాలి, చిలికి చిలికి గాలివాన అయినట్లు ఒకనాడు కనకరాజు జీవితం భీభత్సం అయిపోయింది. సమ్మోహనంగా ఉండిన వసంతం గ్రీష్మంగా మారింది. కళ్లల్లోని ఆశాజ్యోతులు నిరాశతో నీరై పోయాయ్. సంతోషంలో ప్రవహించిన హృదయం దుఃఖంతో చెక్కలైంది. అతను యేది నిత్యం యేది సత్యం అనుకున్నాడో అది మాయా అసత్యం అయిపోయాయ్. కమల చనిపోయి ఆరు నెలలైనా నిన్నా మొన్నా ఆ పిడుగులాంటి సంఘటన జరిగినట్లుంది. ధైర్యాన్ని గుటకలు మ్రింగి, శోకాన్ని భరించి, ఇద్దరి పాపల్ని ప్రాణప్రదంగా చూసుకుంటున్నాడు. మాటాడిన పువ్వున్ని కోల్పోయిన అతని మనస్సు, మాటాడని మొగ్గలతో పరిచయాన్ని యేర్పరచుకుంది. అందుకే కళ్ల వేడుకనిచ్చే పూలతోటను తన బంగళా చుట్టూ సృష్టించుకున్నాడు.

ఒక నాటి వేకువఝామున యేదో కలగని తెలివి తెచ్చుకున్న కనకరాజు నిద్రపోను నరకాలని మనసును పూలతోటపై మళ్లించాడు. తోటలోనికి వచ్చి సిమెంటు దిమ్మపై కూర్చున్నాడు. వికసిస్తున్న మొగ్గలా, విచారం వదులుతున్న మనసులా ఉషస్సు ఉదయిస్తోంది. తన కుటుంబంలోని వ్యక్తుల్లా, ఆ రకరకాల పూలచెట్లతో అతనికి సన్నిహితం ఉంది. ఉదయ భానుని రక్తాన్నంతా పీల్చేసి యెర్రబడిన మందారాలు సాయంత్రానికల్లా ఆ రక్తాన్నంతా తిరిగి అతనికి అప్పచెప్పి తలలు వంచేస్తాయ్. మల్లెలు కొల్లలుగా పూసి బంగళా చుట్టూ పన్నీరు జల్లుతాయ్. బొద్దుగా శ్రీకరంగా పూసిన బొగడలు, ఆకుల్లో అణగి అపూర్వమైన వాసనలను వెదజల్లుతున్న సంపెంగలు, ఝుమ్మని రొదచేసే తుమ్మెదలను ఆహ్వానించే రంగురంగు గులాబులు, సుఖాన్ని పొదలు పట్టుకొని రాత్రంతా వరుని కోసం వేచివున్న శోభనాంగిలా ఉన్న లిల్లీపూలు— వీటన్నిటి పేర్లు తెలుసు. వీటి అందాలు పరిమళాలు అతని మనసులో చోటు చేసుకొని మూగ బాసలతో తన దుఃఖాన్ని ఉపశమింప చేస్తున్నాయ్.

ఆకసంలో తోకచుక్కలా ఒక్కసారి తన దృష్టిని తొలిసారి గేటు దగ్గరేనున్న పేరు తెలియని పూలమొక్క ఆకర్షించింది. పెద్దకాడతో తెల్లగా ఒక పూవు తొలిసారి విడివడింది. ఆకలితో వస్తుబడిన తల్లిలేని పిల్లలాంటి మొక్కను షికారుకు వెళ్లినప్పుడు ఆరునెలల క్రితం తెచ్చినాటాడు. మన్నిక లేని రూపుతో మోటు ఆకులతో ఉన్న అడవి మొక్క అంత అందమైన పూవుతో సింగారించుకుంటుందని తను ఊహించుకోలేదు. అందమైన పువ్వును చూడగానే ఆ పూలమొక్కపై అభిమానం ముంచుకొచ్చింది. గబగబా దగ్గరకెళ్లి నిల్చొని చెట్టుని ఒకసారి అప్యాయంగా తాకబోతుంటే చేతిలో కాఫీ కప్పుతో పుష్పమ్మ ప్రత్యక్షమైంది. ఇన్నాళ్ల తను లేచేసరికి బెడ్‌కాఫీ మంచం ప్రక్కనే బల్లమీదుండేది. ఈ వేళ తను వేగంగా లేచిపోవటం ఈమె తనకు దగ్గరగా రావటంతో పరీక్షగా చూడటం జరిగింది.

రెండేళ్ల క్రితం ఆఫీసునించి ఇంటికి వచ్చేసరికి ఆకలితో చిక్కి అసహ్యంగా ఉన్న పిల్ల అగపడింది. ఎవరని అడక్కుండానే కమల ఆ పిల్లగాథ చెప్పింది. ఆ పిల్లకు యెవ్వరూలేరట. అడుక్కుని కడుపు నింపుకుంటోంది. పని చేసుకోరాదా అంటే యెవరిస్తారని యెదురు ప్రశ్న వేసింది. ఆ ప్రశ్నకు సమాధానంగా కమల ఆ పిల్లని పనిపాట్లు చెయ్యడానికి పెట్టుకుంది.

కమల పోయాక ఇంట్లో పని, వంట, పిల్లల కింద సేవ పున్నమ్మే చేసుకుంటోంది. భార్య ఉన్నప్పుడు, పోయినప్పుడు, ఇంత వరకు తనలో ఆమెపై రాజుకున్న మోహం ఇంక పున్నమ్మ అంటే తొలి రోజు చూసిన ఆకారమే మనసులో మెదలు తుంది.

ఈ రోజు అడవి పూవు మీద చూపించిన శ్రద్ధే ఆమె వేపు చూసాక కలిగింది. పోషణతో పాటు ప్రమోదమైన వాతావరణం ఆమెను అడవి మొక్కలా ఏపుగా బలిష్ఠంగా పెంచింది. వయసు ఒళ్ళంతా ప్రాకిపోయింది. ఆమె అవయవాల పొందిక చూసిన కనకరాజు మనసు ఒక్కసారి చలించింది. కాఫీ త్రాగుతూ ఆగిఆగి క్రీగంటగా ఆమెవేపు పదేపదే చూసాడు.

ఆమె అక్కడనించి కదిలాక ఆమె వెంటపడాలని, ఒక సారి ఆమె కళ్ళల్లోకి దీక్షగా చూడాలని, ఆమె చిరునవ్వు ఒలక బోస్తే తాను యెన్నాళ్ళకు మళ్ళీ నవ్వ గలిగానని— ఇలా మన సులో ఆలోచనలతో పాటు ఆకాంక్షలను కూడా సృష్టించు కున్నాడు. చెక్కిన దంతం బొమ్మలాంటి కమలలో మంత్రిం చిన మోహం ఉండేది కాదు. ఆమె అందం, సంస్కారం అంతా సున్నితమైంది. సిల్కు బట్టలాంటి శరీరం ఆమెది. మగవాడి చూపులను వెనక్కి రాకుండా బంధించగల బలిసిన యవ్వనాన్ని తాకాలనే కోర్కె కమల ఉన్న రోజులనించీ తీరని కోర్కెగా నిలిచి పోయింది.

ఎంతో ఈ అడవిపూవు పికపిక మంటూ తోటలోని అన్ని పూలకు దీటొస్తున్నది. రోజుకు రోజు బలిసి ఆందోళన ఆవేశం నల్లమేఘాలు ముసురుకొని ఢీకొన్నట్లు మనసులో రగులుకుంటున్నాయి. కమ పోతే మళ్ళీ పెళ్ళి చేసుకోనని ధీమా మీద దెబ్బకొట్టినట్లు తెలియవచ్చిన తన నిర్ణయాన్ని అంతా హర్షించారు. తన యేకపత్నీవ్రతాన్ని శ్లాఘించారు. కమల లాంటి అపూర్వమైన స్త్రీతో కాపురం చేసిన వాడు ఇలాంటి స్త్రీని మళ్ళీ పొందలేడన్న భావం తనలో పాతుకు పోయి ఉండేది. ఇప్పుడు గాలితో పొంగిన రబ్బరు బెలూనులా యవ్వనంతో పొంగిన పున్నమ్మవేపు దొంగ చూపులు చూస్తుంటే కనక రాజు మతిపోతుంది.

ఈ అడవిపూవు యెంతకాలం ఇంత సమ్మోహనంగా చెట్టున ఉంటుంది? రాలిన రాలుతుంది! ఎవరైనా తెంపినా తెంపుతారు. ఏదో తుమ్మెద వాలితే పూవు కాయవుతుంది. కాలం అందాన్ని తెస్తుంది. అందాన్ని మింగుతుంది. చావు పుట్టు కల మధ్యకాలం దైన్యాన్ని కాకుండా ఆనందానికి వినియోగించు కోవటంలో ఉంది మనిషి ప్రజ్ఞ. ఈ ప్రజ్ఞను తను, నలుగు రిలో అర్థంలేని గౌరవం తెచ్చుకోవడం కోసం యెందుకు వదులుకోవాలి?

కోరిక బాధించినా, ధర్మం తెలుసుకున్నవాడు కాబట్టి ఇంట్లో ఉన్న పున్నమ్మను ముట్టుకోలేక పోయాడు. అప్పు డప్పుడు మనసు పట్టలేక ఆమె వేపు కళ్ళల్లో నిండుగా పూరించిన కామంతో సూటిగా చూసేవాడు. ఆమె చూపులు యెప్పుడూ మిణుకు మిణుకు మనే చుక్కల్లా ఉండేవి. చుక్కలవేపు చూసి కవిత్వం అల్లుకునే ప్రేమికుల్లా మనసులో అనుభూతులు కలిగేవి. మరికొన్ని రోజులు పోయాక ఆమె నవ్విస్తుంటే కుతూహలంగా ఉన్న చేతులను తాకాలని తాకలేక చిన్న నవ్వు నవ్వితే జవాబు రాలేదు. బాధపడినా ఇంకోసారి వంటింట్లో ఒక్కర్తె ఉంటే దగ్గరకు వెళ్ళాలని రెండు అడుగులు వేస్తే పున్నమ్మే ఇటు వస్తూ యెదురయింది. చేతులు రేగాయి గానీ ఆమె ప్రక్కకు కదిలి పోయింది. తరవాత తోటలోనికి వచ్చి యేకాం తంగా కూర్చొని గంటలు తరబడి తనను తాను విమర్శించు కున్నాడు. నరాల పొంగు తగ్గిన తరవాత తెలివి తెచ్చుకొని అంతా కల అనుకున్నాడు. పున్నమ్మ తన కళ్ళ యెదుట తన కూతు రిలా పెరిగింది. కనికరించినా కడతేర్చినా తనే చెయ్యాలి. "దుష్టులు చేసే పాపం సమర్థుడు చూసి ఊరుకుంటే, వాళ్ళ పాపంలో తను భాగస్థుడవుతాడని" మహాభారతంలో చదివాడు.

సమర్థుడనుకున్న తనే దుష్టుడైతే పాపం పండి పోతుంది. తెలివితక్కువ వాడు, మూర్ఖుడు చేసిన మహా పాపం కంటె తెలివైన వాడు, సమర్థుడు చేసిన కొద్ది పాపమే హెచ్చుగా పరిగణింప బడుతుంది.

ఈ ధర్మా ధర్మ విచక్షణ ఇంకా మనసులో నించి తుడిచి పెట్టక మునుపే ఆ మరునాటి రోజు ఒక సంఘటన జరిగింది. వేగంగా ఆఫీసునించి వచ్చేసాడు. పున్నమ్మ ఇంకో ఇనుపగుండులా ఉన్న యువకుడితో సరదాగా పకపక నవ్వుతూ యేకాంతంగా తోటలో పరిచయ మున్నట్లు మాటాడుతోంది. ఆ మాటల్లో మోటుహాస్యం విన్నాడు. ఆ కొంటె చూపుల్లో కోరికలు చూసాడు. తిరిగి వెనకకు బాధతో కదిలి పోయాడు ఆ రాత్రి తిండి దగ్గర ఆమె వేపు చురచుర చూసాడు. ఆ చూపుల్లో ఆక్షేపణ, ఈర్ష్య, నిరసన అంతా వ్యక్త పరిచాడు. ఆమె తొణకలేదు బెణకలేదు. మామూలుగా పనిపాట్లన్నీ చేసుకుంటోంది. ఏదో అందామనుకున్నాడు. మందలిద్దా మనుకున్నాడు. తను యేమన్నా యేది చేసినా యేదో స్వలాభం తోను, అసూయతోనే చేయటం జరుగుతుంది కాని ఆమె రక్షకునిగా చెయ్యటం లేదని తర్కించుకోవటం వలన పూరు

కున్నాడు. ఆఫీసుకు పోయినా, ఇంట్లో ఈ సరికి యేం జరుగుతుందో వూహించుకునే వాడు. తను కమల నివసించే గదిలో పిల్లిద్దరూ స్వేచ్ఛగా విహరిస్తుంటారని తోచగానే భరించ లేక ఇంటికి వచ్చేసరికి ఆమె యేదో పనిపాట్లు చేసుకుంటోంది. ఎన్ని మాటలు అందామని వచ్చాడో అన్నీ దిగమింగేసాడు. ఇంకో రోజున ఆమె పెరటి వరండాలోనే వాడితో పాటు మాటాడుతోంది. అక్కడికి వెళ్లడం మర్యాద కాదనుకున్నా చప్పున వెళ్లాడు. ఆమె నిర్ఘాంత పోయింది. ఏమీ మాటాడ కండా కోపంగా మొఖం పెట్టి వచ్చేసాడు.

ఆ క్షణం నించి ఆమె అతని యెదుట పడటానికి జంకుతోంది. పువ్వు మీద మంచులా ఆమెకు దిగులు కప్పేసింది అతను ఇంట్లో ఉండగా ఇదివరకు ఉన్న చనువులేదు, సంతోషం లేదు. చాటు మాటుగా కదులుతోంది. కనకరాజు ఈ మార్పును సహించలేక పోయాడు. ఇదివరకు ఆమె నిర్లక్ష్యంగా వదిలి పెట్టిన యవ్వనం, ఎప్పుడూ చిరునవ్వుతో చిందులు తొక్కే పెదాలు, అరమరికలు లేకండా అన్నీ అమర్చి పెట్టే ఆ చనువు --ఇవన్నీ ఇప్పుడు కరవు కాగానే అతను ఇంట్లో ఉండలేక పోయాడు.

ఎన్నాళ్లే — తీరని కోరిక ఎలాగైనా సాధించుకోవా లన్న పట్టుదల హెచ్చయింది. తనలో ఎన్నెన్నో ఆలోచనలు కలిగినయ్. ఆమెను ఒకసారి యేదో చేసేస్తే ? తన కోరిక ఆమెతో చెప్పితే ? ఆమె అందుకు ఒప్పుకుంటే ? ఆమె తనను పెళ్లి చేసుకోడానికి ఒప్పుకుంటే తనకు సంఘంలో ఉన్న మర్యాద అంతా గంగలో కలిసిపోతుంది. "నీకూ నాకు జోడీ యెలా కుదురుతుంది బాబూ, నీ కూతురులాంటి దాన్ని" అంటే తనకు జవాబు చెప్పటానికి మాటలు రావు.

అతనికి రోజుకు రోజు వికారం హెచ్చవుతోంది. తనింకా యౌవనంలోనే ఉన్నాడు. తనలో ఉన్న సున్నితం, సంస్కారం, ఉగ్గులు తేరిన తన జాతస్త, పుటం వేసిన బంగారం లాంటి తన శరీరచ్ఛాయ, ఆడది చూడగానే వలపును పండించగల తనకు మాని పేదరికం, మోటుతనంతో నిండిన మనిషితో పున్నమ్మ సంపర్కం పెట్టుకోవటం— ఈ అవమానంతో అతని హృదయం బేజారవుతోంది. ఈ విషయంలో మౌనం యెంత కాలమో తనకు సరించలేదు. ఒకసారి పరోక్షంగా ఆమెకు వినిపించేటట్లు అన్నాడు "ఈ మొగాళ్లు మోసం చేస్తారు" ఇంకోసారి "ఒక్కర్తె ఉంటావు ఇల్లు జాగ్రత్త" అన్నాడు. వేరొకసారి "ఎవరిని నేను లేనప్పుడు రానివ్వకు" అన్నాడు. ఆఫీసుకు వెళ్లిపోతూ తన అడివి పువ్వు మీద వాలటానికి యెన్నో తుమ్మెదలు కొట్లాడుకోవటం గమనించాడు.

ఆమె మనసు మెల్లగా మార్చాలన్న ప్రయత్నంతో ఒకసారి "పున్నమ్మా— నీవు లేకపోతే పిల్లల గతి చూడు" ఆమె జవాబు చెప్పకండా అలాతల దించుకునే ఉంది.

"మాట్లాడవేం ?"

"నే నెక్కడికి వెళ్ళిపోతాను బాబూ ?"

"అయితే యెందుకలా దిగులుగా ఉంటున్నావ్ ?"

"ఏంలేదు బాబూ"

"చూడు— ఇంకా చిన్నదానివు కాదు. మంచి చెడు తెలుసు కొని మెసలాలి."

పున్నమ్మ చప్పున కళ్ల నీరు తెచ్చుకుంది.

"ఏడవక. నీకు కష్టం పెట్టడం నాకిష్టం లేదు."

"అమ్మగారే ఉంటే—" అంటూ ఇంక వెక్కుతూనే వంటింట్లోకి వెళ్లిపోయింది.

ఈ మాట ఎన్నో అర్థాలు నిస్తుంది. అమ్మగారే ఉంటే ఇలాంటి చూపులతో మీరు నన్ను వేధించేవారా ? అమ్మగారే ఉంటే వయసు వచ్చిందని నన్ను ఎవణ్ణో చూసి పెళ్లి చేసే వారుకదా ? అమ్మగారే ఉంటే నేనిలా పడయ్యే దాన్నా ? అమ్మగారే ఉంటే.... ఇలా యెన్నో ప్రశ్నలూ సమాధానాలతో తోటలో గడ్డిలో కూల బడిపోయాడు. కామంతో చీకటైన హృదయంలో అప్పుడప్పుడూ ఆత్మ వెలుగు పడుతోంది. ఆ వెలుగు కదలగానే మళ్లీ చీకటి. ఆమెకు దగ్గర దగ్గర అవుతున్నాడు. మాటలు కలుపుతున్నాడు. ఆమెను చూసి నవ్వబోతున్నాడు. తాకబోతున్నాడు. ఎల్లప్పుడూ ఆమె గురించే ఆలోచిస్తున్నాడు. అడవిపూవు వాడిపోలేదు. అతని తృష్ణ చల్లారలేదు.

ఒకనాడు రాత్రి చిన్నపిల్ల నిద్దరనించి లేచి యేడుస్తోంది. ఎందుకో చెప్పదు. బహుశః తల్లి జ్ఞప్తికి వచ్చిందేమో ? లేక తల్లి కలలో కనిపించిందేమో ? అంతవరకు పున్నమ్మ గురించి ఆలోచిస్తూ నిద్దరపోని కనకరాజు ప్రక్కగది వేపు వెళ్లి తలుపు తట్టాడు. పున్నమ్మ చిన్న పిల్లను భుజం మీద వేసుకొని వోదారుస్తూ తలుపు గడియ తీసింది. పిల్లను తీసుకొని ఇటు అటు కదులుతూ ఒక మూల తలదించి నిల్చున్న పున్నమ్మవేపే చూస్తున్నాడు. ఆమె తరగని శృంగా రంతో ఒయ్యారంగా ఉంది. యౌవనం పొంగులాగు పువ్వ

ఘుమ ఘుమంటూ గుభాళిస్తోంది. ఒళ్లంతా కళ్లు చేసుకొని చూస్తుంటే అప్పుడప్పుడూ పై తెరిచిన ఆమెకళ్లు బెదర సాగినయ్. పిల్లను ఆమె చేతికి అందివ్వ బోయాడు. ఆమె అత నికి తగలకుండా అందుకుంది.

"పిల్లకు భయమేమో దీపం ఉంచి పడుకో" అన్నాడు.

మౌనంగా తల వూపింది. కాళ్లు కట్టేసినా అక్కడ నించి మర్యాదకు కదిలిపోయాడు. తిరిగి వచ్చినా కనకరాజుకు నిద్దరలేదు. వలపు ఒళ్లంతా కుమ్మరిస్తోంది. వయసు వెనుకకు ప్రయాణం చేస్తోంది. ఒకసారి లేచి ప్రక్కగది వేపు వెళ్లాడు. అద్దం తలుపుగుండా తొంగి చూపాడు. పైన తిరుగుతున్న ఫేను గాలిలో పున్నమ్మ ఒళ్లుమరచి నిద్దరపోతోంది. నీటిలో నిద్దరపోతున్న బలిసిన బొంతచేపలా ఉంది. తను ఈదినా దానిని పట్టుకోలేడు. అతను గట్టుదాటని సముద్రంలా కట్టుబాటులో ఉంటే వలపన్నలేదు. చూపులను ఆమె అవయవాలపై అప్పచెప్పి అతను గుటకలు మింగసాగాడు. రానురాను ఉప్పొంగి పోతున్న సముద్రంలా హృదయంలోంచి రక్తం పొంగ సాగింది. ఆ హోరు తను వినలేక పోతున్నాడు. రావి ఆకులా వడవడ వణికిపోతూ తలుపు తట్టాడు. ఆమె లేవ. నిద్దర భంగ మైంది. చీర సర్దుకొని ప్రక్కకు తిరిగి పడుకుంది. పెద్ద నిట్టూర్చి మళ్లీ తలుపు తట్టాడు.

పున్నమ్మ ఒక్కసారి తలెత్తి చూసింది. ప్రసరిస్తున్న కామదృష్టికి అలాంటి చిరునవ్వే జతచేర్చాడు. ఆమె గాభరా పడింది. ఆమె పెదాలు కదిలాయి గానీ ఆ మాటలు అతనికి వినిపించలేదు. లేచి చప్పున దీపం ఆర్పేసింది. ఆమె యేమైందో అతనికి కనపడలేదు. చీకటిలో ఆమెవైపు చూడలేని కళ్లు అవమానంతో తనలోనికి చూసినయ్. ఆమె తనను అవమానించి నందుకు నానా దుర్భాషలు మనసులోనే ఆడుకున్నాడు. ఆ మరు నటి రోజే ఆమె పని పట్టేస్తా ననుకున్నాడు. చెప్పినట్టు వినక పోతే యెలా వచ్చిందో అలానే పంపించాలని నిశ్చయించు కున్నాడు. ఆమెపై పగతీర్చుకొనే ఆలోచనలు అంతం కాకుం డానే యెలాగో ఆలస్యంగా మగత నిద్ర కప్పేసింది.

తెలివి వచ్చేసరికి కిటికీగుండా సూర్యరశ్మి పడుతోంది. ప్రక్కకు చూసాడు. టేబిలు మీద బెడ్ కాఫీ లేదు. చప్పున లేచి వంట ఇంటివేపు వెళ్లాడు. అంగటికి రాగానే గేటు తలు పులు తెరిచి ఉన్నాయ్. గబగబా గేటు దగ్గరకి నడిచాడు. అడవి పూనే కాదు మొక్కతో యేదో పసువు పీక్కుపోయింది. మూయని గేటుకు అనుకొని రెండోసారి పగిలిన హృదయాన్ని పట్టుకొని నిల్చుండి పోయాడు.



## నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు 5:

# గోపీచంద్

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

'మెరుపుల మరకలు' నవలలో ఉషారాణి వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని తర్కిస్తూనే వివాహ వ్యవస్థ భవితవ్యాన్ని గూర్చి పూహాగానం ప్రారంభించిన గోపీచంద్ ఆ ధోరణికి కళ్ళెంలాగ లేక చేసిన రెండు రచనలు : 'ప్రేమోపహతులు' 'శిధిలాలయం' అనేవి. శిధిలమై కూలిపోతున్న నేటి వివాహ వ్యవస్థే— శిధిలాలయం. ఆ కూలిన గోడల మధ్య 'నాగరకత' పేరిట లైంగికస్వైర విహారము(Sexual Promiscuity) చాల నేర్పుగా, పరస్పర సహకార పద్ధతిని సాగిస్తున్న భార్యాభర్తల జంట— ప్రేమోపహతులు. వారిని 'ప్రేమోపహతులు' అనటంలోనే గోపీచంద్ లైంగిక స్వైర విహారము దానికదే గమ్యమైన ఒక సహజ జీవన విధానం ఎన్నటికీ కాజాలదని సూచించాడు. అంతటితో ఆ ఆలోచనకు స్వస్తి చెప్పి వివాహం శిధిలమైన తదుపరి సంఘంలో వచ్చే పరిణామాన్ని గూర్చి మరొకసారి ఆలోచిస్తూ, పర్యవసానం 'శిధిలాలయం' అనే కథలో నిక్షిప్తం చేశాడు. ఈ కథలో సామాన్యులైన స్త్రీ పురుషుల శిధిల దాంపత్యం ఇతివృత్తం. వివాహం భగ్నం కావటానికి మూలం కారణం భార్యాభర్తల వ్యక్తిత్వాల మధ్య సహజమైన పొందిక ఏర్పడక పోవటం, అంటే అది వ్యక్తి మన స్తత్వానికి చెందిన సమగ్ర విషయమనీ, కేవలం లైంగిక ప్రవృత్తి ఒక్కదానికే సంబంధించింది కాదనీ పీతాంబరరావు, నిర్మల పాత్రల ద్వారా తేల్చుకున్నాడు గోపీచంద్. నిర్మల లేచిపోవటంతో భగ్నమైన వివాహం మళ్లీ కుదురుకునేందుకు ఆర్థికంగా సాంఘికంగా పరిస్థితులు అనుకూలించినా, నిర్మల దారీ పీతాంబరరావు దారీ వేరుకాక తప్పలేదు. కారణం : నిర్మలకు ఒంటరిగా జీవించటమే బాగుంటుంది. ఆమె వ్యక్తిత్వానికి దోహదంగా కావలసినవి లోకానుభవం, చదువు, సంఘంలో పైకివచ్చే అవకాశాలు మాత్రమే, వీటికోసమే ఆమె లేచి పోయింది, మళ్లీ పీతాంబరరావు మీద ఆధారపడింది కూడా.

"నాకు ఎవ్వరికీ భార్యగా ఉండాలనే అపేక్ష లేదు. ఒకవేళ ప్రయత్నించినా ఉండలేను కూడా.... నేను బ్రతికితే స్వతంత్రురాలిగానే బ్రతకగలను. ఆ స్వాతంత్ర్యం లేక పోయినవాడు నేను మరణిస్తాను. అది నా స్వభావం." అంటూ తన వ్యక్తిత్వాన్ని గూర్చి చెబుతుంది నిర్మల. ఆమెకు మరొక వ్యక్తి ఆలంబనంగా అవసరంలేదు. పీతాంబరరావు స్వభావం ఇందుకు భిన్నం, అతనికి మరొక వ్యక్తి అండకావాలి. ఆ స్థానం 'సీనా'కు సరిపోయింది. ఆమెకు తను గోముగా ప్రేమించుకునేందుకూ, 'పిచ్చి తండ్రి, పిచ్చినాన్న' అంటూ జాలీ అభిమానమూ గుప్పించేందుకూ ఒక వ్యక్తి కావాలి, పీతాంబరరావు అందుకు తగిన వాడు. ఇట్లా వాళ్లవాళ్ల వ్యక్తిత్వాల మధ్య పొందికను బట్టి స్త్రీ పురుష సంబంధాల్లో ఒక నిశ్చలత్వం ఏర్పడు తుందనీ, ఇది నైసర్గికమూ ధార్మికమూ కావడంతో, కృత్రిమమైన వివాహ వ్యవస్థ శిధిలమైన పరిస్థితుల్లో కూడా ఇటువంటి అనుబంధం ఏదో ప్రతి వ్యక్తి జీవితంలోనూ ఏర్పడక తప్పదనీ సూచిస్తూ కథ ముగించాడు గోపీచంద్. ఆర్థిక, సాంఘిక శక్తుల మీద ఆధారపడినంత మేర నేటి వివాహ వ్యవస్థ కృత్రిమము, వ్యక్తిత్వాల పొందిక మీద కాక నైతిక సూత్రాల మీద ఆధారపడినంత మేర స్థూలము. ఈ వ్యవస్థ క్రమంగా శిధిలమౌతూ దీని స్థానంలో నైసర్గికమూ వైయుక్తికమూ అయిన స్త్రీ పురుష అనుబంధాల సంకీర్ణతలో క్రొత్త సంఘం భవిష్యత్తుల ఏర్పడవచ్చు. కాని అందుకు మనుష్యుల్లో కొన్ని గుణాలు అవసరం. ఔదార్యము, క్షమ, ధైర్యము, ముందు చూపు. ఈ గుణాలు వ్యక్తుల్లో ఇప్పుడు లేవని కాదు, అయితే ఇదివరకు ప్రసరించని మార్గాల్లో, మనసులోని చీకటి గదుల్లో, ఈ గుణాలు తేజః ప్రసారం చెయ్యాలి— ముఖ్యంగా లైంగిక ప్రవర్తనలో స్వేచ్ఛ, పవిత్రత వంటి విషయాల్లో తీవ్ర దృక్పథం మారాలి. సామాన్య

ఆ నవలను గూర్చి విమర్శలు చేసిన విమర్శకులమీదే ఎక్కువగా లగ్నమై ఉండటంవల్ల, మధ్యలో ఆగి భార్యను ప్రశ్నిస్తాడు.....

"మీరు వ్రాసింది గొప్ప గ్రంథం. తెలుగు సాహిత్యంలో అటువంటి గ్రంథం యింతవరకు వెలువడలేదు. ఆ విషయం విజ్ఞులందరూ ఒప్పుకుంటున్నారు. ఇక సీమంతంలాంటి వాళ్ల మాటలను మీరు లెక్కచెయ్యటం ఎందుకు చెప్పండి ?" అన్నది సుజాత.

"అది నిజమేలే. అయినా తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. ఎంత చెడ్డా సీమంతం చిన్నప్పటి స్నేహితుడుగదా."

"మిమ్మల్ని గురించి అతనలా అనుకోడు."

"ఇంతకీ ఏమన్నా డేమిటి ?"

"ఏ స్త్రీనో మనస్సులో పెట్టుకుని మీరా గ్రంథం వ్రాశారని అన్నాడట."

సీమంతం అన్నమాటలు భర్తకు చెప్పకూడదని నిశ్చయించుకున్నది సుజాత. ఇప్పు డిక తప్పక చెప్పింది.

కాసేపు సీమంతాన్ని గురించి ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు కేశవమూర్తి. "అంటే నేనొక స్త్రీని ప్రేమించానని, అనుభవించానని తరువాత ఆమె తిరస్కరిస్తే కోపం పట్టలేక ఆమెను గురించి ఆ గ్రంథం వ్రాశానని అతని ఉద్దేశం" అని అడిగాడు—అప్పటి కప్పుడే అతని కంఠం రుద్ధం అయింది.

"అటువంటిదే" అన్నది సుజాత వీలై నంతవరకు తేల్చి వేయటానికి ప్రయత్నిస్తూ.

"ఎంత అన్యాయం ?"

"అన్యాయమే మరి."

"అలా అనుకోటానికి కారణం ఏం చెప్పాడు ?"

"అతని బొంద. అతను కారణం ఏమి చెపుతాడండీ, ఓర్పులేక అన్న మాటకు."

"ఓర్వలేనివాడై నా నేను ఓర్వలేక అంటున్నానని అనడు గదా సుజాతా ! అతనూ పైకి ఏదో ఒక కారణం చెపుతాడు. అదేమిటని అడుగుతున్నాను."

"రచననుబట్టి రచయిత స్వభావం కనిపెట్టవచ్చుట."

"అతను అలా కనిపెట్టా డన్నమాట."

"అవే అన్నాడుట."

"అంటే భగవంతుణ్ణి గురించి వ్రాసినవారు భక్తులూ, నైతిక విలువలను సమర్థించేవారు నీతిమంతులూ, శృంగారం వ్రాసేవారు వ్యభిచారులూ .... అలాగేనా కనిపెట్టడం ?"

"పోనిద్దురూ. ఆ ద్వేషభావంగల వ్యక్తి గొడవ యిప్పు డెందుకు ? అతని మాటలకు విలువ ఉన్నదని మెడమీద తల ఉన్నవాళ్లు ఎవరైనా అనుకుంటున్నారు గనుకనా ?"

"అయితే విమర్శననుబట్టి విమర్శకుని స్వభావం తెలుసుకోవచ్చుగా సుజాతా ?"

"ఎందుకు తెలుసుకోగూడదు ? అది అంట్ల తెప్పెల కన్న మకిలిది అని తెలుస్తూనే ఉందిగదా !" అన్నది సుజాత.

ఆమె మాటలకు కేశవమూర్తి చిరునవ్వు నవ్వాడు ....

ఈ సంభాషణను యింత సుదీర్ఘంగా ఉల్లేఖించటానికి కారణం—యిందులో నవల యితివృత్తమూ, పాత్రపోషణా, రచనాపద్ధతి, గోపీచంద్ మనఃస్థితి అన్నీ బీజప్రాయంగా, విశ్లేషించి చూపటానికి వీలుగా యిమిడిఉండటమే ! ఇతివృత్తము, కథానాయకుడైన రచయితపట్ల అతని 'స్నేహితులు' చూపిన ఈర్ష్యాసూయలు, వారి కుత్సిత ప్రవర్తన. దానివల్ల అతనిలో కలిగిన బాధ—తనమీద తనకే జాలి. చివరకు నైతికంగా, ఆధ్యాత్మికంగా, ఆర్థికంగా అతనికి విజయం చేకూరటం, 'స్నేహితుల' భంగపాటు.

పై సంభాషణలో కేశవమూర్తి భార్య, సీమంతం విమర్శ వల్ల గ్రంథానికి వచ్చిన లోటు లేదనీ, అతని మాటల్ని లెక్క చెయ్యటం అనవసరమనీ చెబుతున్నా కేశవమూర్తి ఆ విషయాన్ని సాగదీస్తాడు. స్నేహితుని కుళ్లు మాటల్ని, భార్య విపులంగా చెప్పటానికి నిరాకరిస్తే, తను విడమర్చి చెప్పుకొని దుఃఖిస్తాడు (కంఠం రుద్ధం కావటం). ఆపైన సంభాషణని సాగిస్తూ, భార్యద్వారా 'అది ఓర్వలేనితనమనీ', 'మెడమీద తల ఉన్నవాళ్లెవరూ ఆ మాటలకు విలువ యివ్వరనీ', సీమంతం స్వభావం 'అంట్ల తెప్పెలకన్న మకిలిది-అనీ' వ్యాఖ్యానమూ ఘాటుగా ప్రతి విమర్శా చేయిస్తాడు. అతను భార్యను అడిగేవి 'లీడింగ్' ప్రశ్నలు ( Leading Questions ) —కోర్టులో లాయర్‌లాగ. ఆమెచేత తను వినదలచిన మాటల్ని చెప్పించటంలో వినటంలో అతని తృప్తి మనకు కనిపిస్తూనే ఉంది—తనమీద తనకే జాలి, తను స్వయంగా ఏమీ తిట్టకుండా ఆ ప్రశ్న లడగటంలో ఏదో అర్భకత్వమూ, అమాయకత్వమూ స్ఫురింపజేసే ప్రయత్నం కూడా (అది పైవారి సానుభూతి రాబట్టుకోవటానికీ, తన సాధుత్వం నిరూపించుకోవటానికీ) దాచటానికి వీల్లేకుండా వ్యక్తమౌతూనే ఉన్నాయి! ఈ పద్ధతే, ఉద్దేశమే నవల మొత్తంలో కథాకథనం కొందరు పాత్రలచేత చెప్పించటంలోనూ కనిపిస్తోంది—వాళ్లు కేశవమూర్తిని ఆరాధించే స్త్రీ పాత్రలు ! కథానాయకుణ్ణి అతని

'స్నేహితుల్ని', వాళ్ల స్వభావాల్ని, సంబంధాల్ని యథాతథంగా వస్తుతః చిత్రించే ( Objective Portrayal ) ఉద్దేశమే గోపీచంద్‌కు ఉన్నట్లయితే ముఖ్యంగా సీతంతం మొదలైన వారి ద్వారా కూడా కథ చెప్పించి ఉండాలి. నవలలో 'స్నేహితుల' పాత్ర చిత్రణము కేవలం అక్కసు తీర్చుకునే వ్యంగ్య రచనగా ( Caricature ) రూపొందింది. పోతే కేశవమూర్తి పాత్రను అమాయకత్వంతో ముగ్గురు స్త్రీల ఆరాధ్యదైవంగా ("మహామేధావులు అనేది సుభాషిణి; కరుణా మూర్తులు అనేది కన్యాకామణి; పరమ లౌకికులు అనే దాన్ని నేను"—సుజాత), అరవిందుల 'అతీత మానవత్వం' పొందటానికి అర్హత గలిగి సిద్ధంగా ఉన్న విశేష వ్యక్తిగా తీర్చిదిద్దాలనుకున్న రచయిత ఉద్దేశం నెరవేరలేదు, వ్యత్కర్షగా తయారైంది.

కేశవమూర్తి పాత్రలో అసంతృప్తి కలిగించే విషయాలు: **1.** అతని అమాయకత్వం కృత్రిమంగా, వేషధారణలా, ఒక (**Pose**) గా స్ఫురిస్తూండటం. 2. స్నేహితులపట్ల అతని వైఖరిలో అరమరికలేని ప్రవర్తన ఎక్కడా కనిపించదు. సుభాషిణి విషయంలో అపోహపడ్డ సీతంతం కుండ బద్దలు కొట్టినట్లు చేసిన ఆరోపణకు .... "కేశవమూర్తి మనస్సు జుగుప్సాక్రాంతం అయింది .... ఇతరుల నోళ్ల మూయించటానికి రకరకాల టెక్నిక్ ఉపయోగించేవారికి ఏం చెప్పి ఏం ప్రయోజనం ?" అనుకుని ఊరుకున్నాడట. అంతకు మించి వివరించి సమాధానపడే ప్రయత్నం ఏమీ చెయ్యడు ! శారద్వతుడు గ్రంథపఠనం చేస్తాడు అంటూ ఎంతోసేపూ అతని పుస్తక పాండిత్యాన్ని కేశవమూర్తి 'పజ్జలు తిని పజ్జలు పెట్టే' పాండిత్యంగా హేళనదృష్టితోనే చూస్తాడు. అలాగే రాధారమణతో గాని, పురూరవునితో గాని కేశవమూర్తి అరమరిక లేకుండా మాట్లాడలేదు, ప్రవర్తించలేదు. వాళ్ల స్వభావాలతో తనకు పొత్తు కలవదని తెలిసిన తర్వాత కూడా వాళ్లతో స్నేహితుడిలా ఉండాలనుకోవటంలో కేశవమూర్తి మంచితనం, 'తన ధర్మం తాను నిర్వర్తించాలనే ఉద్దేశం' (ప. ప. శా. వీలునామా. పుట. 52) ఏమీ వ్యక్తంకాదు; వారి ముందు తన ఆధిక్యత నిరూపించుకోవాలనే 'దురాశ' మాత్రమే స్ఫురిస్తోంది ! 3. కేశవమూర్తిలో కొంతవరకు గోపీచంద్ తన సొంత గడుసుదనం, మరికొంత మేర తండ్రి రామస్వామి చౌదరిలో తను గమనించిన అమాయకత్వం 2 (ముఖ్యంగా సుజాత కథనంలో.... పుటలు 92, 93) రెండూ మిశ్రమం చెయ్యటంతో, ఆ పాత్ర సహజత్వాన్ని కోల్పోయింది.

'పరమేశ్వరశాస్త్రి వీలునామా' అరవిందుల 'అతీత మానసిక చైతన్యాన్ని' అభివ్యక్తంచేసే నవల కానేకాదు ! పదహారు పుటల్లో (228—243) అరవిందుల దర్శనాన్ని గూర్చి ఒక పాత్ర ఉపన్యాసం నవలలో నిక్షిప్తం చెయ్యబడటం తప్పితే నవలలో యితివృత్తం రీత్యా పాత్రపోషణ దృష్ట్యా నిరూపించబడిన తాత్త్విక దృక్పథం అంటూ ఒకటి లేదు. 'అసమర్థుని జీవయాత్ర' లో హేతువాదమూ, 'మెరుపుల మరకలు' లో అస్తిత్వవాదమూ నిరూపించబడిన విధానం ఇక్కడ ఒకసారి జ్ఞాపకం తెచ్చుకుంటే 'వీలునామా' సాహిత్యపు విలువ గోచరిస్తుంది. ఈ నవల గోపీచంద్ వ్యంగ్య రచన. తనకు బాధ కలిగించిన వారిమీద ఆయన విసరిన అస్త్రం! తద్వారా అతని మనస్సుకు కలిగిన ఉపశమనం, కొన్ని ప్రాత బంధాలనుంచి విముక్తి, ఎవరి 'వలయం' వారిదన్న స్పృహ, వ్యక్తి ఒంటరితనాన్ని గూర్చి వివేచన, ఆ ఒంటరితనం నుంచి సమన్వయ దృక్పథంతో, సాధనతో, సర్వమానవ లోకంతో తాదాత్మ్యం పొందాలనే ఆకాంక్ష—యివీ నవల వ్యక్తంచేస్తున్న విషయాలు.

'మెరుపుల మరకలు' ప్రచురణ తర్వాత ఆ నవలమీద వచ్చిన అభిప్రాయాలూ విమర్శలూ గోపీచంద్‌కు బాధ కలిగించటమే కాదు, జీవితంలో ఎప్పుడూ లేని ఒంటరితనాన్ని అనుభవించేలా చేశాయి. ఆ పరిస్థితిలో ఆయన తనమీద తనే చూపుకున్న జాలి 'వీలునామా' లో స్పష్టంగా కనిపిస్తోంది. ఆ మనఃస్థితిని అధిగమించేందుకు ఆయన చేసిన ప్రయత్నమూ అందులోనే వ్యక్తమౌతోంది—"మానవుడు ఒంటరిగాడని, అందువల్ల బాధగ్రస్తుడని పాశ్చాత్యదేశాలలోని అస్తిత్వవాదులు అంటూఉంటారు. 'ఆ ఒంటరితనాన్ని తప్పించుకోటానికే అనేక బాంధవ్యాలతో మానవుడు తన్ను తాను పెనవేసుకుంటాడు. అయినప్పటికీ అతను ఒంటరితనం అనే భయంకర గహ్వరం నుంచి తప్పుకోలేక పెనుగులాడుతూ ఉంటాడు. పెనుగులాడటం అతని నిత్య నైమిత్తికం' అని అంటారు..... అసలు ఒంటరితనం అంటే భయం ఎందుకు? 'భయం' అంటారు అస్తిత్వవాదానికి చెందిన పాశ్చాత్యులు. కారణం చెప్పరు. 'అది మనిషికి స్వభావసిద్ధంగా వచ్చే గుణం. దానికి కారణం ఏమిటి ?' అన్నట్లు మాట్లాడుతారు. మానవుడు బాధపడటానికే పుట్టాడు అని తేలుస్తారు ..... మన వేదాంతులు ఒంటరితనాన్ని విశిష్టంగా పరిశీలించి మానవాభ్యుదయానికి అది ముఖ్యావసరం అన్నారు. ఒంటరితనం యొక్క ప్రయోజనాన్నీ, అవసరాన్నీ భగవద్గీత అమోఘంగా నిర్వచించింది. 'ఇతరులకు రాత్రి యోగులకు పగలు, ఇతరులకు

---

2. ఈ లక్షణం "చీకటి గదులు" నవలలో కృష్ణస్వామి పాత్రలో గమనించవచ్చు.

పగలు యోగులకు రాత్రి' అన్నది. సాంఘిక జీవితంలో నిమగ్నులైనవారు బ్రతుకుబరువు మోస్తుంటారు. తాత్కాలిక భోగాలను పొందుతారు. ఒంటరితనంలో, ఏకాగ్రతలో మనస్సుని లగ్నం చేసినవారు, విశ్వంలో ఉన్న లయను సిద్ధింపచేసుకొని శాశ్వత సుఖాన్ని కరతలామలకం చేసుకుంటారు... అస్తిత్వవాదులకు ఆధ్యాత్మికస్పృహ తక్కువ. అందుకని ఒంటరితనం యొక్క ప్రథమదశను, శాశ్వతదశగా భావించి పొరపాటు చేశారు ...." (పుటలు 114–116) ఒంటరితనం అంటే భయం ఎందుకు ? ఒంటరితనం ద్వారానే 'విశ్వంలో ఉన్న లయను' సిద్ధింపజేసుకోవాలన్న నిశ్చయానికి వచ్చిన గోపీచంద్ పాత్రే అస్తిత్వవాదపు హద్దులను దాటి అద్వైతము వైపు దృష్టి సారించాడు.

"తప్పు చెయ్యటం కంటె తప్పును క్షమించలేకపోవటం పెద్ద తప్పని నేను గ్రహించాను" అన్న గోపీచంద్, స్నేహితుల కృపణత్వాన్ని, విమర్శలను 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' లో క్షమించలేకపోయాడు ! కాని, ఆ నవల వ్రాయటమే ఒక విముక్తి. కోపతాపాలను ఆ నవలలో గుమ్మరించటంతో మనస్సు తేలికపడటమే కాదు, ఆత్మవిశ్వాసము దృఢమై తను త్రొక్కుతున్న దారీ చూస్తున్న లక్ష్యమూ తన ఒక్కడివే కావు, తనతోటివా రందరివీ కూడా అనిపించింది గోపీచంద్‌కు. 'పరమేశ్వరశాస్త్రి వీలునామా' కథాసంవిధానంలో, ముగింపులో, ధ్వనిస్తున్న అర్థం యిదే. మరణశయ్యమీద ఉన్న పరమేశ్వరశాస్త్రి వైదిక సంప్రదాయము. సంస్కృత కళాశాల పేరిట ఆయన చుట్టూ చేరిన సీమంతం మొదలైన వారు ఛాందసులు. కులంలేని సుజాతకూ, పాశ్చాత్య వాసనల్గల కేశవమూర్తికీ ఆయన ఆస్తి దక్కకుండా వాళ్లు చేసే ప్రయత్నాలు విఫలమై, పరమేశ్వరశాస్త్రి కేశవమూర్తినే తన వారసుడిగా వరిస్తూ వీలునామా వ్రాస్తాడు. శిథిలావస్థలో ఉన్న సంప్రదాయం మరణించినాడు భారతదేశంలో వైదికసంప్రదాయానికి నిజమైన వారసుడు ప్రాచ్య ప్రతీచీ భేదాలు పాటించక వ్యక్తిగతమైన సాధన ద్వారా సనాతన ధర్మంవైపు నడిపించే మానవుడు అని ధ్వని ! కాని యీ సత్యం యిప్పుడే బయటపడదు ! సంప్రదాయం వ్రాసే వీలునామా కాలం అన్న సీల్డు కవర్‌లో భద్రపరచబడి ఉంది!

ఈ ఆత్మవిశ్వాసంతోనే గోపీచంద్ తన జీవితచరిత్ర అది స్పృశించినంత మేర ఆంధ్రదేశ రాజకీయ చరిత్రా ఒక పెద్ద నవలలో సమస్యల దృక్పథంనుంచి వ్రాయటానికి పూనుకున్నాడు. అదే "చీకటిగదులు" అనే అసంపూర్ణ రచన. ఈ రచన చూస్తుంటే యిది కూడా 'వీలునామా' లాగే, మనస్సును తేలికపరచుకోటానికీ, కొన్ని ప్రాత బంధాలను మానసికంగా వదిలించుకోటానికీ, తన మనస్సులోని చీకటి గదుల్లో తేజః ప్రసారం చేసుకునేందుకూ గోపీచంద్ ప్రారంభించిన ప్రయత్నంగా, సాధనగా మాత్రమే తోస్తుంది. సాహిత్యపరంగా ఎన్నదగింది కాదు.

అతీతమానవుడు (Superman) 'అతీత మానసిక చైతన్యమూ (Supramental Consciousness) లక్ష్యాలుగా సాధన కుపక్రమించిన గోపీచంద్ సామాన్య మానవుని దైనందిన జీవితాన్నీ, అతని ఆర్థిక సమస్యల్నీ మరచి పోలేదు. ఈ లోకంలో తను ప్రేమించిన సామాన్యునికి అతని స్థాయిలో అతని సమస్యలను గూర్చి చర్చిస్తూ, ఆత్మవిశ్వాసాన్నీ, జీవితంమీద ఆకాంక్షనీ ప్రోదిచేసే సందేశాన్ని—తన వీడ్కోలు సందేశంగా—గోపీచంద్ నిక్షిప్తం చేసిన నవల 'యమపాశం'. 'అసమర్థుని జీవయాత్ర', 'మెరుపుల మరకలు' నవలల తర్వాత ఎన్నదగిన నవల 'యమపాశం'.

చేస్తున్న ఉద్యోగం, కట్టుకున్న భార్య, అనుకోకుండా పుట్టుకొచ్చిన గంపెడు పిల్లలు—యీ వలయంలో చిక్కుకున్న సామాన్య మానవుడు నారాయణరావు. వలయంలో గానుగెద్దులా తిరుగుతున్న వ్యక్తికి ఆత్మవిశ్వాసం, జీవితంమీద ఆకాంక్ష రానురాను తరుగుతుంది గాని ఎలా పెరుగుతుంది ? సాంప్రదాయికమైన జీవన విధానం శిథిలమైంది, నైతిక ప్రమాణాలు ఎగిరిపోతున్నాయి, సాంఘిక—ఆర్థిక వ్యవస్థల్లో మార్పు వస్తుందనీ క్రొత్త జీవితం ప్రారంభమౌతుందనీ రోజుకురోజూ పెంచుకున్న ఆశలు ఫలించకుండానే వయస్సు పైబడి ముసలితనం తరుముకువస్తోంది. యౌవనంలో నిర్మించుకున్న ఆదర్శాల సౌధాలు పగటి కలలుగా మిగిలి పోతున్నాయి. జీవితం యమపాశంలా కంఠం చుట్టూ బిగుస్తూ ఉంటే సామాన్య మానవుడు మృత్యుస్పర్శని అనుభవిస్తూ మృత్యువునే ఆహ్వానించా లనుకుంటాడు. ఈ నిస్పృహనుంచి తేరుకోవడ మెలాగ ? విముక్తిమార్గ మేమిటి ?

"జీవితాన్ని కృత్రిమంగా విభజించి, ఏదో ఒక ముక్కను పట్టుకొని అదే సర్వస్వం అనుకోవటంవల్ల మానవుడు ఒక ఘనీభవించిన పదార్థం అయ్యాడు .... తనకంటె ఘనపదార్థంగా ముడుచుకుపోయింది తన భార్య. తా మిద్దరూ జీవితం అనే గోడకు కొట్టబడి ఎండిపోయిన రెండు పిడకలు ...."
..."కట్టుబాట్లు పెట్టుకు కూర్చున్నవాళ్లు చాదస్తులుగా తయారవుతున్నారు. అలా కాకుండా జీవితాన్ని ఎడాపెడా కొట్టేవాళ్లే విశాల దృక్పథం గడించుకోగలుగుతున్నారు. వాళ్ల

జీవితాన్ని బహుముఖాలుగా అనుభవిస్తున్నారు. అందువల్ల బహుముఖాలుగా పరిశీలించవలసిన అవసరం కలిగి వారి దృక్పథం విశాలపడుతూ ఉంది.'' .... ''నేటి మన నైతిక విలువలు వట్టి నిషేధాజ్ఞలే..... నిషేధ బుద్ధితో జీవితాన్ని చూచిన ఏ వ్యక్తి వికసించడు. వికసించని ఏ వ్యక్తికీ విముక్తి లేదు. జీవితాన్ని బహుభంగుల అనుభవించిన వ్యక్తే సంపూర్ణత ను పొందగలుగుతాడు'' .... ''డబ్బు వ్యసనమైతే, భోగాలు ముళ్ళకుళ్లైతే, ఇంద్రియాలు గుర్రాలైతే, మనస్సాక్షి ముళ్ల కిరీటమైతే ఇక జీవితానికి అర్థం ఏమిటి ? విముక్తి.'' సంప్రదాయమనీ, నైతిక విలువలనీ, ఆదర్శమనీ మానసికంగా పునీభవించిపోయి, జీవితాన్ని నిరాకరించటం ద్వారా జీవిత రహస్యం అవగతంకాదు, విముక్తి లభించదు. జీవితాన్ని యథాతథంగా అంగీకరించి అనుభవించాలి. ''జీవితానికి పెడగా నిలుచున్నవానికంటె అన్నివిధాలా జీవితాన్ని అనుభవించేవా రంటేనే నాకు ఇష్టం. ఒక్క ఇష్టమే కాదు, నమ్మకం కూడాను'' అంటాడు గోపీచంద్.

''పరిస్థితులు మారిపోతున్నాయి. విలువలు మారిపో తున్నాయి. జీవితం మహావేగంగా ప్రవహిస్తూ ముందుకు ఉరకలెత్తుతూ ఉంది. ఆ వేగం ఒరిపిడికి విస్మాతమైన అందచందాలు అనేకం బహిర్గతమయి కనులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. అవి క్రొత్తవి గనుక, బహుశా మనకు అందుబాటులో లేవు గనుక, వాటిని నిరసించడం జరుగుతూ ఉంది'' అలా కాకుండా జీవితదృశ్యాన్ని సరిక్రొత్తగా ఉత్సాహంతో అవలోకిస్తూ ఉన్ముఖుడు కావాలి మానవుడు అంటాడు గోపీచంద్. మానసికంగా ఒక రకపు విలువలకు అంటిపెట్టుకొని, పరిస్థితుల ప్రభావం అనుల్లంఘనీయమై ''అడుసు తొక్కవలసి వచ్చినప్పుడు ఏడుస్తూ తొక్కి .... కాళ్లు కడగవలసి వచ్చినప్పుడు అంతకంటె ఏడుస్తూ కడుక్కునే'' మనస్తత్వాన్ని వదలిపెట్టుకొమ్మంటాడు గోపీచంద్. విలువలు సాపేక్షము ( Relative ): ''ప్రతి మానవుడూ జీవితానికి తన పరిస్థితికి అనుకూలమైన అర్థం చెపుతాడు.'' జీవితాన్ని జీవించటమే ప్రధానమైన విలువ. అందుకు అను బంధమైన విలువలు : మారటం, ముందుకు పోవటం, రిస్క్ ( Risk ) తీసుకోవటం అని పేర్కొన్నాడు గోపీచంద్.

కథానాయకుడైన నారాయణరావు ఆలోచన క్రమంగా పై చెప్పిన రీతిగా రూపొందుతుంది. కాని, గతంలో తెగ తెంపులు చేసుకునే శక్తి తనలో ఉందా ? అని సందేహిస్తాడు. అతని కొమార్తె అరుంధతి సమాధాన మిస్తుంది : ''ఎందుకు కాదు నాన్నా ? కదలదలచుకొన్నవాళ్లు ఎప్పుడైనా కదలవచ్చు. కాటికి కాళ్లు చాచుకున్న వాళ్లు కూడా కదలవచ్చు.... 'పరి స్థితుల ప్రభావం' అంటున్నారు గాని .... మానవుడు పెరిగిన కొద్దీ పరిస్థితుల ప్రభావం క్షీణిస్తుంది .... మన సంకల్పంలో ఏదో లోపం ఉండి, దీటికీ మాటికీ పరిస్థితులను సాకుగా, డాలుగా వాడుకుంటున్నామేమో ననిపిస్తూవుంది నాకు.'' అతని భార్య రాజమ్మ అంటుంది : ''నా మనస్సుకి ఒక కొత్త నడక స్ఫురిస్తూ ఉంది. ఆ నడకను అందుకోగలిగితే ఎవ్వరికీ ఇబ్బంది ఉండదని అనిపిస్తూ ఉంది. నడక తప్పి మనం బాధపడు తున్నాం గాని, నిజానికి బాధపడవలసిన అవసరం ఈనాడు నాకేమీ కనపడటంలేదు. మనకంటె బీదవాళ్లూ, దురదృష్ట వంతులూ ఎంతమంది లేరు ? వాళ్లకు లేని వేదన మనకు ఎందుకు ఉండాలి ? ఎవరి బ్రతుకు వారిది. ఒకరితో పోల్చు కుని వ్యథ పడటం ఎందుకు ? మనం చూడగలగాలే గాని ఏ నడకలో ఉన్న మాధుర్యం ఆ నడకలో ఉంది. అడుగు తప్ప కుండా పడితే సరి.'' ఇదే గోపీచంద్ సందేశం.

సాహిత్య వ్యవసాయమూ, సత్యాన్వేషణమూ జీవితంలో ఒకటైన రచయిత గోపీచంద్. ఆయన దృక్పథం 'హేతు వాదపు' గట్లు త్రెంచుకొని విస్తరిస్తూ 'అతీత మానసిక చైతన్య' సాగరంగా రూపొందింది. సమకాలీన భావ సంచలనంతో హేతువాదానికీ, అస్తిత్వవాదానికీ సాహిత్యంలో చక్కని రూపు రేఖలు దిద్దిన ఖ్యాతి గోపీచంద్‌ది. తద్వారా తెలుగు నవల క్రొత్తదారులు తొక్కటం జరిగింది. సంఘ సంస్కరణ, జాతి పునరుజ్జీవనం, సాహిత్యంలో నవ్యత—యీ మూడింటి దృష్ట్యా గోపీచంద దృక్పథం ఒక క్రమ పరిణామానికి లోనై సమస్య యాన్ని సమగ్రతమా సాధించింది. నవ్యతను అన్వేషించటం జీవ లక్షణమని గోపీచంద్ ప్రగాఢ విశ్వాసం. ''ఎప్పటి కప్పుడు ప్రమాదాలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడే కదా మాన వుడు క్రొత్త క్రొత్త విషయాలను కనిపెట్టేది. మానవునిలో ఉన్న సృజనశక్తి విజృంభించేది. మానవుడు దేవుడయ్యేది.... భౌతికజీవితం మానసిక జీవితాభివృద్ధికి ఉపాధిగా మాత్రమే వ్యవహరించాలి .... మానసిక జీవితం నూతన శక్తులనూ, నూతన విలువలనూ తెచ్చిపెడుతుంది ..... ఈ స్థితిలో మానవుడు ఏ పరిస్థితుల్లోనైనా, ఏ ప్రభావంలోనైనా తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోగలుగుతాడు. అన్ని ప్రభావాలనూ, అన్ని పరిస్థితు లనూ తనలోనే పొందగలుగుతాడు. దివ్య జీవనాన్ని సృష్టించ గలుగుతాడు.'' గోపీచంద్ విచికిత్సకూ విశ్వాసానికీ అతీతమైన సృజనాత్మక దృక్పథాన్నీ అందుకున్నాడు.

# నువ్వు లేవు నీ పాట వుంది

## శ్రీ బాలగంగాధర తిలక్

నువ్వు లేవు నీ పాట వుంది. ఇంటిముందు జూకామల్లె తీగల్లో అల్లుకొని
లాంతరు సన్నని వెలుతురులో క్రమ్ముకొని నా గుండెల్లో చుట్టుకొని
గాలిలో ఆకాశంలో నక్షత్రం చివరి మెరుపులో దాక్కొని నీరవంగా
నిజంగా వుంది. జాలిగా హాయిగా వినపడుతూ వుంది. శిశిరవసంతాల
మధ్యవచ్చే మార్పుని గుర్తుకి తెస్తోంది. యిన్నేళ్ళ తర్వాత వేడిగాలి
చల్లదనానికి తిరిగే ఒకానొక గ్రీష్మ దివసావసాన సమయాన డాబామీద
సిగ్గిలిన సోగకళ్ళతో మల్లెపూల వాల్జడతో నువ్వు పాడినపాట
నా గుండెల దగ్గర తడబడుతూ ఏదో కొత్తభావలో చెప్పి

ఒక అందమైన రహస్యం విప్పి పరువానికి వస్తూన్న నా వయస్సులో
చటుక్కున పరిమళపు తుపానుల్ని రేపి మహారణ్యాల సౌందర్యాన్ని
చూపి సముద్రపు కెరటాలబలంతో మధ్యగా మౌనంగా ఉన్న
ద్వీపాల్ని ఊపి

ప్రపంచం యొక్క అవధుల్ని దూరంగా సాచి నన్ను దిగంతాలకి
విసిరేసినవేళ.

ఇజాలూ రాజకీయాలూ వాదాలూ హత్యలూ యుద్ధాలూ ఇంకా
యిటువంటి చెత్తా చెదారం మనస్సులలో పేరుకోక ముందు పండిన
మొగలి పొత్తివంటి పరిమళం గల ప్రారంభయౌవనపు నిండైన
ఆరోగ్యపు వాకిళ్ళ ముందు విసిరిన నందివర్ధనం పువ్వుల మధ్య
నువ్వూ నేనూ కూర్చొని అలాగ ఒకరొకరు చూసుకుంటూ

ఆకాశానికీ భూమికీ మధ్యపడిన చిరుచీకటి పలకమీద
రేడియమ్ అక్షరాల్ని వ్రాసుకుంటూ

కాలాన్ని కదలకుండా నిలబెట్టి కమ్మని ఊహల పూలతోటల మధ్య
పరుగులెత్తి సాహసపు మంచు కొండల అంచుల మీద
స్కేటింగ్ చేసి

అకలుషితమైన యౌవనోల్బణంతో బలంతో అమాయకత్వంతో
ఆనాశల ఆశల మేలు చాందినీలు కట్టి

నీనా సామీప్యమే స్వర్గంగా, స్వర్గంగా స్రవంతిగా జీవిత
పరమార్థంగా ఎంచి

నలుపు చారలు లేని తెల్లని సూర్యకాంతిపడిన పాలరాతిగచ్చులా
ప్రతిఫలించి

నీ వొడిలో నా తల పెట్టుకొని అభ్యంగనా విష్కృత త్వదీయ
వినీల శిరోజ తమస్సముద్రాలు పొంగి నీ బుజాలుదాటి నా
ముఖాన్ని కప్పి ఒక్కటే ఒక్క స్వప్నాన్ని కంటున్న వేళ
చంద్రికాస్నపిత సంగీతాన్ని వింటున్న వేళ

ఆకుపచ్చని భూమికీ గిరులకీ ఝరులకీ సమస్త సృష్టికీ
ఒకే ఒక అర్థం కనుక్కున్న వేళ

నీ పాట హాయిగా గాలిలో తేలి మునిమాపు జేగురులతో కలసి
దిక్కులను చుట్టి నీ మృదు చలాంగుళిచ్ఛవిలో కరగి నా
వొంటిని నిమిరి నన్ను నిశ్చిద్ర నిద్రలో పడవేసి నీ ఎర్రని
పెదాలునా నొసటి మీద ఆనందపు నెలవంకల్ని చిత్రించి నన్ను
మంత్రించిన ఆ రోజులింక

రావు యిపుడు నువ్వు లేవు నీ పాట వుంది నాలోపల లోపల్లోపల

ఆరిన కుంపటిలా రగులుతూన్న ఒకే ఒక స్మృత్యగ్ని కణంలాగ
క్రమక్రమ జరారు జాగ్రస్తమైన వయస్సనే పాడింటి మూలగదిలో
కుండీలో యింకా వాడకుండా నిల్చిన పువ్వుల గుత్తిలాగ

గడుసుదనం మోసం పరువూ ప్రతిష్టలనే గాడిదల మీద
బ్రతుకు పాతబట్టల మూటల్ని వేసి తోలుతూన్న వేళ

నా ఏడుపు నాకు తప్ప లోకానికి వినిపించనివేళ

నే కూరుకు పోతూన్న చాతకానితనపు వానాకాలపు బురదమధ్య

నీ పాట ఒక్కటే నిజంలాగ నిర్మలమైన గాలిలాగ నిశ్శబ్ద నదీతీరాన్ని
పలకరించే శుక్తిగత మౌక్తికంలాగ

ఇంటిముందు జాకామల్లె తీగల్లో అల్లుకొని లాంతరు వెలుతుర్లో
క్రమ్ముకొని నా గుండెల్లో చుట్టుకొని గాలిలో ఆకాశంలో
నక్షత్రం చివరి మెరుపులో దాక్కుని నీరవంగా నిజంగా వుంది
జాలిగా హాయిగా వినబడుతూ వుంది

శిశిరవసంతాల మధ్య వచ్చే విచిత్ర మధురమైన మార్పుని
గుర్తుకి తెస్తోంది. యిన్నేళ్ళ తర్వాత.........

---

# గురజాడకు మార్గదర్శి వేమన

## శ్రీ నూతలపాటి గంగాధరం

తనకు గురజాడ అప్పారావుగారే మార్గదర్శకులని వ్యాసాలలో నైతేనేమి, ఉపన్యాసాలలో నైతేనేమి— శ్రీ శ్రీ తానే స్వయంగా అనేకచోట్ల చెప్పుకున్నాడు.

శ్రీ శ్రీ— కవితావరణంలో పద్యాల పాదకోళ్లతో, సంస్కృత సమాసాల మేజోళ్ళతోనే అడుగుపెట్టాడు, ప్రప్రథమంలో. 'ప్రభవ' అనే ప్రథమ కవితాసంపుటిలో— పూరిపాక చుట్టూ ఆకాశాన్నంటే ప్రహరీగోడ బలంగా నిర్మించుకున్నాడు. లోన కూర్చుని చుట్టూ చూస్తే ప్రహరీ తప్ప మరేమీ కాన రాకుండా పోయింది. గాలి లేకుండా ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

ఆ సమయంలో గురజాడ సాక్షాత్కరించాడు. కవితా సౌధం ఎల్లా నిర్మించుకోవాలో గురజాడవద్ద అంచనాలు తీసు కున్నాడు. 'ఎఱుగవే నన్ను లోక భీకర మహోగ్ర, ఫణి విస్ఫూర్జిత మృత్యురూపిణిగ నీవు ?'— అని అందకుండా ఎక్కడో ఎగిరి పోతూ అన్న జిహ్వతోనే— 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చా' నని, 'గగనమంతా నిండి పొగలాగు క్రమ్మ —బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టు నన్ను'— అనీ సాటి మానవుడుగా భూమ్మీద నిలుచుని అన్నాడు.

'ఆమలోదాత్త మనీష నే నుభయకావ్య ప్రౌఢిఁ బాటింపు శిల్పమునం బారగుఁడ' నని మిడిమిడి జ్ఞానంతో చెప్పుకున్న తిక్కన్న, జ్ఞానవృద్ధుడైన పిమ్మట 'నా నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికి' నని చల్లగా జారుకున్నట్లు— శ్రీ శ్రీ కూడా కవిత్వ తత్త్వం క్షుణ్ణంగా ఎరిగిన పిమ్మట నిర్జీవ బంధాలన్నీ వదులుకుని, నిసర్గ రమణీయానికి మోక రిల్లాడు.

నిజానికి శ్రీశ్రీకి గురజాడ మార్గదర్శి అయినా, సంస్కృత సమాసములమీదా, శబ్ద చిత్రాలమీదా మోజు వదులుకోలేక పోయాడు శ్రీ శ్రీ. 'శ్రీ శ్రీ కవిత్వంలో శబ్దాలం కారాలని ఉంటవి. ఒకదానిపేరు వృత్త్యనుప్రాసము. ఈ వృత్త్యను ప్రాసము యొక్క ప్రాబల్యమే శ్రీ శ్రీ కవిత్వంలోని మొదటి పొగను. అంత్యప్రాస గూడా ఒక శబ్దాలంకారం.'— అని విశ్వ నాథగారి మాటలు. 'మస్తిష్క కులాయం'— 'మనోవల్మీకం'— 'బాధాసర్పదష్టులు' వంటి రూపకాలూ, 'ప్రదీప్తకీలా ప్రవాళ మాలా ప్రపంచవేళా ....' అని ఆగి ఆగి లాగడాలూ, 'జాతి జాతి నిర్ఘాతపాత సంఘాతాలై ఉన్నై, కాలకేతువై ....' అని కొండ మీది నుంచి గుండ్రాళ్ళు దొర్లించినట్టు లకారాలను దొర్లిం చడం వంటివి మిక్కుటంగా కనిపిస్తాయి, శ్రీ శ్రీ కవిత్వంలో.

నిఘంటువులు శ్మశానా లయ్యాయి. వ్యాకరణాలు సంకె ళ్లయ్యాయి. ఛందస్సు సర్ప పరిష్వంగం అయింది. కానీ, ఛందస్సుకు ముఖ్యం— లయ ! అంటే మధురవాద్య సదృశ మైన శబ్దముల నడక. అది శ్రీ శ్రీ కవిత్వంలో కావలసినంత ఉంది. భావ తీవ్రతతోపాటు ఈ లయ మిళితమైతే ఇంక ఛందస్సులతో నిమిత్త మెందుకు ? రామరాజభూషణుని తర్వాత అంతటి శబ్దచిత్రాలు నిర్మించడంలో నైపుణ్యం కనబరచిన వాళ్లలో శ్రీ శ్రీ ఒక్కడని చెప్పాలి. ఆ శబ్దచిత్రాలు భావ తీవ్ర తకు అనుగుణ్యంగా పరుగెత్తడమే శ్రీ శ్రీ కలంలో ఉన్న అత్యు న్నతమైన శిల్పకళా వైచిత్ర్యం. రమణీయమైన శబ్దాలూ, సమాసాలూ అంటే శ్రీనాథునికి ప్రాణం. వాటిని వదులుకో లేడు. 'గమి కర్మీకృత నైకనీవృతా'— 'నటపత్పంకజయు కోచ రోదరీ' అనే మనోహర శబ్దకల్పనలు రెండూ సంస్కృతంలో ఒకే శ్లోకంలోనివైనా, వాటిమీద మోజుచేత— ఒక్కొక్క సమా సానికి ఒక్కొక్క మత్తేభాన్ని ఖర్చుపెట్టి అలాగే ఆ సమాసాల్ని తెలుగులోకి దించాడు. తెలుగు కవులకు సంస్కృతశబ్దా లంటే ఎంత ప్రాణం వదులుతారో దీనివల్ల వ్యక్తమవుతోంది.

శ్రీ శ్రీ కవిత్వంలోని వైవిధ్యాన్ని ఆతర్వాత అనేకమంది అనుకరించడానికి ప్రయత్నించారు. కానీ, శ్రీ శ్రీ అంతటి ప్రతి

తను కనబరచినవాటు అరుదు. ఎంతోమంది యువ కవులను ఆకర్షించిన శ్రీ శ్రీ కి మార్గదర్శి గురజాడ. 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' వంటి వేదవాక్కులను పలికిన మహనీయుడు, గురజాడకు మార్గదర్శి— ఎవరు? అదే ఈ వ్యాసంయొక్క ఉద్దేశం.

వేమన్నయొక్క కవితామందిర కవాటాలను నెట్టుకుని లోపలికి అడుగు పెట్టబోతే— గురజాడ మనల్ని ప్రక్కకు తొలగించి బయటకు వస్తూంటాడు. 'గాంధీజీ అహింసా సిద్ధాంతానికి బుద్ధుడెలా ప్రాతిపదికలు వేశాడో అప్పారావుగారి కవితా రీతులకు వేమన అలానే పాదులు వేశాడనడంలో అతిశయోక్తి లేదు.' వేమనలోని గుణాలు గురజాడలో అనేకం అచ్చుగుద్దినట్లు కనిపిస్తాయి.

'ఒకే ఒక్క ఛందస్సులో వేమన్న తన సందేశాన్ని వినిపించాడు. అలాగే గురజాడ కూడా 'ముత్యాలసరం' లో తన భావాల్నిటిని ప్రచారం చేశాడు. ('పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' ఛందస్సు మాత్రం ఈ సామాన్య సూత్రానికి అపవాదంగా నిలుస్తుంది.) ఆటవెలది ఛందస్సును స్వయంగా సృష్టించక పోయినా వేమన్న దానిని తన సొంతం చేసుకున్నట్టే, గురజాడ కూడా జానపద జీవితంలో ఒదిగిఉన్న ముత్యాలసరాన్ని తనది చేసుకున్నాడు'— అని వేమన్నకీ, గురజాడకీ గల బాహ్య సామ్యాన్ని మాత్రం శ్రీ శ్రీ నిర్వచించాడు.

గడచిన ఆంధ్రసారస్వతంలో పాత (ప్రసిద్ధ) ఇతివృత్తాన్ని పెంచడం, పాండిత్య బలంతో గర్భ బంధ చిత్ర ఆశు కవిత్వాలంటూ 'ఫీట్లు' తీయడం, లేనిపోనివి వూహించి వర్ణించడం, వృత్త శకటాలను తమ ఇష్టం వచ్చినట్లు లాగడం తప్ప అనుభవాలను స్ఫురింపజేసే శక్తివంతమైన రచనలూ, సంఘం కుళ్ళును కడిగివేసే బలమైన రచనలూ, పండితులకే గాక ప్రజాసామాన్యానికి గూడా పనికివచ్చే భావోద్రేక రచనలూ— ఏవీ రాకపోవడం మొట్టమొదట కనుగొన్నవాడు, వేమన్న.

అంతకుముందు తెలుగులో కొంతమంది ప్రతిభావంతులైన కవులు సంప్రదాయాలను వదలలేక పూర్వ కావ్య లక్షణ సూత్రాలకు కట్టుబడి 'పాత చింతకాయ పచ్చడి' వంటి ప్రసిద్ధ ఇతివృత్తాలను స్వీకరించి కావ్యం నిర్మించినా, ఆ కథ అందరికీ తెలిసిందే అయినా, అందులోని పాత్రలయందు అక్కడక్కడా మెరుపుల్లాగా తళుక్కుమని మెరిసే— కవి యొక్క స్వీయ అనుభవాలు మాత్రమే పాఠకులను పట్టి నిలిపేవి. కావ్యకళలోని ఈ రహస్యాన్ని వేమన్న పసికట్టాడు.

ఇతివృత్తమే ప్రధానం కాదు. అనుభవాలు వేటికవి వాటి కాళ్ళమీద నిలబడి ప్రకాశించగలవని— హాలుని గాథా సప్తశతి వల్ల, అనుభవములవల్ల, తెలుగులోని అనేక శతకాలవల్ల, శ్రీనాథుడు మొదలైన మహాకవుల చాటువులవల్ల— తెలుసుకున్నాడు, వేమన్న! అందువల్లే తన కవితాకన్యమీద లేనిపోని శాస్త్ర లేపనాలన్నీ రుద్దలేదు. మధురమైన చిన్ని ఆటవెలది ఛందస్సుని స్వీకరించాడు. తన దేశ సంచారంలో తన్ను ఏ అనుభవం కదిలిస్తే దానిమీద ఒక పద్యం, ఏ విషయం ఆకర్షిస్తే దానిమీద ఒక పద్యం చెప్పుకుంటూ పోయాడు. అతని కవిత్వమంతా ఇలాగే సాగింది. అందుకని పని గట్టుకుని— కట్టమంచివారన్నట్లు, కావ్యలక్షణ శాస్త్రాల కొలతల ప్రకారం కత్తిరించి నిర్మించిన కవిత్వం కాదు, వేమనది. అందుకే ప్రతి పండితుణ్ణీ, పామరుణ్ణీ కూడా పట్టి నిలవేస్తుంది, అతని పద్యం. అనుభవాల కంత ప్రాబల్యం ఉంది. 'గీతాంజలి' కూడా అనుభవాలను కదిలించేదే! నిత్య జీవితంలోని అనుభవాల సందడికి కవి హృదయం పులకించి వికసించిన మల్లెపూలరాశి— 'గీతాంజలి'! పాండిత్యం దానిముందు పనిచెయ్యదు.

వేమన్నలోని ఈ రహస్యాన్ని గురజాడ క్షుణ్ణంగా పరిశీలించాడు. ఆమాటే అంటాడు 'పుస్తకంబులలోని మాటలు విస్తరించుచు ననుభవమ్ముల తత్త్వ మెరుగక' వ్రాసేది గూడా ఒక కవిత్వమేనా అని ఈసడించుకుంటాడు, గురజాడ.

జనసామాన్యం మంచి నుడులను, జాతీయాలను, లోకోక్తులను ఏరుకోవడం వేమన్న, పాల్కురికి సోమనాథుని దగ్గర నేర్చుకున్నాడు. దేశి రచనా, ప్రజాసాహిత్యమూ శివకవుల మార్గం. 'గద్య పద్యాది ప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠ రచన, మానుగా సర్వ సామాన్యంబు గాదు, జాను తెనుగు విశేష ప్రసన్నతకు' నాలవాలమై, సర్వ సామాన్యమని ఎరిగినవాళ్ళు శివకవులు. వాళ్ళ మార్గం పట్టేడు వేమన్న. అందుకే— 'శివకవులకు, నవకవులకు, శివభక్తికి తత్త్వమునకు ..... శరణు పేరుర వేమా' అన్నాడు.

తర్వాత 'అలతి యలతి తునియలు గావల సంధించిన విధంబు' పదాలను పద్యాలలో పొదగడం తిక్కన్న దగ్గర నేర్చాడు. ఈ విద్యలో వేమన్న ఆరితేరినవాడు.

'ఔనటంచు నొక్క దాటిన మాటకు
కాదటంచు బలుక క్షణము పట్టు
దాని విలువ దీయ ధాతలు దిగవలె' అని అంటాడు వేమన్న. తాను ఒక పదాన్ని పద్యంలో ప్రయోగించాడంటే— పతకంలో పొదిగిన మాణిక్యంలాగా పదిదిక్కులకూ కాంతి విరజిమ్మవలసిందే!

'పాతవడ్డ మాట' అని తిక్కన్న అంటే, దాన్నే 'పుస్తకంబులలోని మాట' అని గురజాడ అంటాడు. నిఘంటువులలో

# గురజాడకు మార్గదర్శి వేమన

నిశ్చలంగా ఉండే పదాలకన్నా, నిత్యం జనవ్యవహారం నాలుకల మీద కదలాడే నుడుల సొగసును గుర్తించాడు వేమన్న. అతని నుండి ఆ విద్యను అభ్యసించాడు, గురజాడ !

వేమన్న చిన్ని చిన్ని మాటలతో, రమ్యమైన జాతీయాలతో గుండె లోతులను తవ్వి పోస్తాడు. మాటలు— నిత్యం మనం వ్యవహరించేవే అయినా, వాటి ఉత్కృష్టతను ఎరిగి గంభీర అర్థాన్ని ఇచ్చేటట్టు వాక్యంలో పొదిగి, వాటికి ఎన్నడూ మనం ఎరుగని వింత సోయగాన్ని చేకూర్చి అఖండశిల్పాన్ని సాధించడం మహాకవి లక్షణాలలో— ఒకటి !

ఆ లక్షణం తిక్కన్న తర్వాత వేమన్నలో మనకు కొట్టవచ్చినట్టు కానవస్తుంది. గురజాడ దాన్ని గ్రహించాడు. నారాయణరెడ్డిగారు ఈ విషయాన్నే అంటారు. 'ప్రాచీన కవుల్లో తిక్కన్న, వేమన్న ఈ (శిల్ప) రచనా పద్ధతికి ఒజ్జబంతులు. గురజాడవారు వారినే ఒరవడిగా తీసుకుని పైపెచ్చుగా వాడుకమాటలను కూర్చి వారికి మించిన ఘనత సాధించారు.

నన్నయ దగ్గర నుంచి వచ్చిన ప్రాచీనాంధ్ర కవులంతా ఏదో ఒక రాజస్థానంలో ఉండినవారే ! అందువల్ల తమ స్వంత అభిరుచులు, అభిప్రాయాలు ఎంత బలవత్తరమైనవైనా బ్రతుకుతెరువుకోసం వాటికి స్వస్తి చెప్పుకుని, రాజుల అభిరుచుల మేరకు— కావ్యాలు చెప్పారు. ఆత్మసంతృప్తికి కాక, జనసామాన్యానికి కాక ప్రభువు మెప్పుకోసం, రాజాస్థానపు తదితర పండితుల మెప్పుకోసమే కవిత్వ మల్లారు, వాళ్లు. ఈ రాజస్థానపు సంకెళ్లనుండి బయటపడ్డవారు పోతన్న ఆ తర్వాత వేమన్న ! పోతన్న ప్రధానంగా ఆత్మసంతృప్తికోసం, కైవల్యం కోసం కవిత్వాన్ని చెప్పాడు. వేమన్న ఆత్మసంతృప్తినీ, ప్రజాభ్యుదయాన్నీ రెంటినీ ప్రధానంగా ఉంచుకొన్నాడు.

వేమన్న ఒకరి మెప్పుకోసం కవిత్వాన్ని చెప్పలేదు. అందువల్లే అతను ఏది చెప్పదలచుకున్నా కుండ బద్దలు కొట్టినట్టు చెప్పారు. ఈ స్వేచ్ఛాగుణం గురజాడలో అచ్చుగుద్దినట్టు కనిపిస్తుంది. విజయనగర సంస్థానంలో ఉన్నా గురజాడ, సంస్థానాధీశుల కోసం తన ఆదర్శాలకు స్వస్తి చెప్పుకోలేదు. ప్రజోద్యమమే అతని ధ్యేయం. దాన్ని ముందుకు తీసుకు వెళ్లడానికే సర్వ శక్తులా ఉపయోగించాడు. 'నాది ప్రజోద్యమం. ఎవరినీ సంతృప్తి పరచడానికోసం దాన్ని వదలుకోలేను' అని ధీమాగా పలికాడంటే—, విజయనగరం మహారాజా వారి ఆంతరంగిక కార్యదర్శి అనదగిన మాటలేనా, ఇవి !

ఇరవయ్యో శతాబ్ద్యారంభంలో గాంధీ మొదలగువార్లు అంటరానితన ముండరాదని ఘోషించారు. కానీ, అది నేటికీ అన్నిచోట్లా ఆచరణలోకి రాకుండా ఉంది. ఈ విషయాన్ని వేమన్న పదిహేడవ శతాబ్దిలోనే చెప్పాడు.

'మాలయంటు ననుచు మరి నీళ్ల మునిగిరి
మాల కర్మచేత మాలడాయె
నేల తెలియలేరొ ? ఈ నర పశువులు' అని.

జరగబోయే విషయాలను ముందుగానే చెప్పడం మహాకవులకు చెల్లిన విషయం.

'కవీ, తత్త్వవేత్తా తమ కాలం కంటే ముందు ఉంటారు' అని 'మాటా మంతీ' లో అన్న గురజాడ మాటలు వేమన్నను బాగా 'స్టడీ' చేసిన తర్వాత అన్నవేనని నా అభిప్రాయం. వేమనలో కవీ, తత్త్వవేత్తా ఇద్దరూ సమపాళ్లలో ఇమిడిఉన్నారు.

'మలిన దేహుల మాల లనుచును
మలినచిత్తుల కధిక కులముల' నెలవొసంగటం

తప్పని అన్న గురజాడ మాటలు పై వేమన పద్యానికి ప్రతిబింబాలుగా ఉన్నాయి.

వేమన వ్యవహారంలోని పదాలను స్వీకరించి వానికి గ్రాంథికతా ముద్ర వేశాడు. గురజాడ వ్యావహారికభాషను అలాగే వాడుకున్నాడు. వేమన పద్యంలో మొనదేలు హాస్యం కనబడుతుంది. ఆ వెంటే బాణంలాగా 'విమర్శ' తరుముకొని హృదయానికి సూటిగా వచ్చి నాటుకుంటుంది. గురజాడ సంఘంలోని కుళ్లును ఖండికలలో సూటిగా చెప్పేస్తాడు. నాటకాలలోనూ, వ్యాసాలలోనూ వ్యంగ్యధోరణిలో నిశిత విమర్శ ఉంటుంది. విమర్శకు హాస్యాన్ని పూతపెట్టి చేదుమాత్రలా అందించే సాహిత్య పద్ధతికి— వేమన్నే ఆద్యుడు.

గురజాడలో నసలు తొడిగిన ప్రతి గుణమూ వేమనలో వేరు తన్నినదే ! గురజాడ అంతటి మహాకవి వేమన అనుసారా? అని ఆశ్చర్యపో నక్కరలేదు. ఎంత బలవంతుడైనా, ఎన్ని మంచి ఆయుధాలున్నా దారిలేని అడవి నడిభాగంలో చిక్కుకున్నవానికి ఏ దిక్కున నడిచే తన ఉన్నత గమ్యస్థానం చేరుకోగలడో సూచనప్రాయంగానైనా తెలిస్తే గదా— తన వైవిధ్యంలో దారి చీల్చుకుని వెళ్లడానికి !

గాంధీ తన దారిని బుద్ధుని బోధల్లో వెదుక్కున్నాడు. గురజాడ వేమన్నలో వెదుక్కున్నాడు. మహాత్ముల కర్తవ్యమే— అది ! మంచి ఎక్కడున్నా గ్రహించి— తాము దానికి మెరుగులు దిద్దుతూ లోకానికి ఆదర్శప్రాయు లవుతారు.

గురజాడ మహనీయుడు, మహా మేధావి, మహాకవి ! అందువల్లే మంచి ఎక్కడున్నా స్వీకరించటానికి జంకలేదు.

'బంకించంద్రుని నవలా రచన' అనే వ్యాసంలో ఈ విషయమే చెబుతాడు. 'ప్రక్కనున్నవారిని చూచి నేర్చుకొనుట నేర్పుయు నను మనకు లేదాయెను. ఇకనైనను మనలో బుద్ధిమంతులు బంగాళీభాష నేర్చి దానిగల మంచిని తెనుగునకు కూర్తురు గాక!' అని. ఒకరికి చెప్పినవాడు తను ఆచరించకుండా ఉంటాడా? తా ననుసరించేగదా ఒకరికి బోధిస్తారు, మహనీయులు! వేమనలో తన మార్గాన్ని స్థిరీకరించుకొన్న పిదప 'కథావస్తువు' ఎల్లాంటిదై ఉండాలో Words worth ద్వారా తెలుసుకొన్నాడు. తన ఖండికల్లోని కథానాయకులంతా ఏ రాజకుమార్తెలో, అప్సరసలో కారు. మధ్య తరగతి జాతికి చెందినవారే!

జాతిని మేల్కొల్పడానికి సాహిత్యంకన్న మహత్తరమైన సాధనం మరొక్కటి లేదు. వేమన్న, గురజాడల కిద్దరికీ సాహిత్యం సాధనం మాత్రమే! వాళ్ల దృష్టి అంతా ప్రబోధనం, జాతిని మేల్కొల్పడం.

ఇద్దరూ వాస్తవికతావాదులు, మానవతావాదులు, కర్మయోగులు!

ఒక భవనం నిర్మించాలంటే మొదట అంచనా ప్రకారం పునాది (Foundation) వేస్తాము. పిమ్మట అందు కనుకూలంగా గోడలు కట్టుతాము. ఆపైన సిమెంటు పూత పూయటం, వివిధ రంగులతో నగిషీలు గూడా చిత్రిస్తాము.

అల్లాగే కవి కూడా కావ్యనిర్మాణోన్ముఖు డవుటకు పూర్వం వస్తువును ఎన్నుకుంటాడు. అపిమ్మట భావాన్ని కూర్చుకుంటాడు. ఆపైన రసపోషణ కావిస్తాడు. అయితే ఇక్కడ భావమూ, రసమూ వేరువేరుగా విభజించడానికి వీల్లేదు. అన్యోన్యాశ్రితాలు. ప్రకృతికీ, పరమాత్మకీ ఎల్లాంటి సంబంధ మున్నదో—భావానికీ, రసానికీ గూడా అల్లాంటి సంబంధమే ఉందన్నారు, పెద్దలు.

కావ్యానికి—వస్తువు, మేడకు పునాది వంటిది. అంటే పునాది ఎంత లోతుగా, బలంగా ఉంటే మేడ కూడా అంత బలంగా ఉంటుందని కదా అర్థం!

ఇక్కడ ఒక ప్రశ్న అడగవచ్చు. 'వస్తువు, కావ్యం యొక్క ముఖ్యాంగాలలో ఒకటి అంటున్నావుగదా! ప్రాచీన కావ్యాలలో అయితే వస్తువు ఉంది. ఆధునికమైన ఖండకావ్యాలనే చిన్ని చిన్ని ఖండికలలో కేవలం భావోద్దీపకత్వం తప్ప వస్తువు ఎక్కడ ఉంది?'—అని. ఈ ప్రశ్న ప్రకారం ఆధునికులలోనే కాదు, వేమన కవిత్వంలో గూడా వస్తువు లేదనే వినాలి. కాని, వారిలో గూడా వస్తువు ఉందనే అంటున్నాను.

పౌరాణికము, కల్పితము, మిశ్రమము, చారిత్రకము, అనుభవము—అని వస్తువు అయిదు విధములు.

ఆద్య సత్కథలు పుట్టు రత్నములనీ, కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములనీ, సత్కవి కల్పనా విభూషితమై పూర్వ వృత్తములు సానదీరిన జాతి రత్నములనీ రామరాజభూషణుడు తర్కించి—చివరకు 'మిశ్రకథే' ఉత్కృష్టమైనదని తేల్చాడు. ఇది మూడు శతాబ్దాల వెనకటి అభిప్రాయం. ప్రస్తుత చర్చనీయాంశం 'అనుభవం'. తదితరములు సుస్పష్టాలు. కావున అనుభవాన్ని గూర్చి చర్చించుకుందాము.

'అనుభవం' అంటే నిత్య జీవితంలో తటస్థించే ఒకానొక సమస్య కావచ్చు, అనుభూతి కావచ్చు. మరేదైనా కావచ్చు. ఆ అనుభవాన్ని స్వీకరించి దానిని భావభరితంగా కావ్యం అల్లడమే నూతనత్వం.

మరలా ఆ 'అనుభవం' రెండువిధము లవుతుంది. (1) మానసికము, (2) భౌతికము.

(1) 'మానసిక'—మంటే మనస్సు (ఆత్మ) తో మాత్రమే అనుభవింప సాధ్యమైన ఒకానొక సాత్త్వికానుభూతి. ఇందులో మిక్కుటంగా విరహము, భక్తి మొదలైన చిత్త శోష్య, సౌందర్యాది ఆధ్యాత్మికానుభూతుల విషయమే ఉంటుంది. ప్రేయసీప్రియుల— జీవాత్మ పరమాత్మల సంబంధమైనవి. దీన్నే 'భావ కవిత్వం' అంటారు.

(2) 'భౌతిక ము'—అంటే హేతువుతో కూడుకొన్న వస్తుతత్త్వము. అనగా, కేవలం అనుమానానుభూతులే ఆలంబనాలు కాక 'సైంటిఫిక్' గా రుజువుచేయడానికి వీలైనది. ఇంకా చెప్పాలంటే—కొందరికే గాక అందరికీ అనుభవంలో వచ్చే అన్ని విధములైన సాంఘిక జీవన సమస్యలు. దీన్నే 'అభ్యుదయ' కవిత్వ మంటారు.

అనుభవం గూడా ఒక కవితావస్తువేనా అని కొందరు ప్రశ్నింపవచ్చు. అనుభవం కవితావస్తువు కాదంటే గురజాడది కవిత్వం కాదు. శ్రీ శ్రీ ది కవిత్వం కాదు. ఇంతెందుకు వేమనది కూడా కవిత్వంకాదు. ఈ సరసనే చెప్పుకుంటే మన పూర్వం శతకాలలోను— కవిత్వం లేదనే చెప్పాలి. ఇంకా నోబెల్ బహుమతి పొందిన 'గీతాంజలి' గాని, కాళిదాసు తర్వాతివాడని ప్రసిద్ధి గాంచిన కృష్ణశాస్త్రి కవిత్వంగాని—ఇలాగే అనుభవజ్ఞులైన చాలామంది మహాకవుల కవిత్వమంతా పై ప్రశ్నకు బలి అయిపోతుంది.

ఇంతమంది కవుల్ని ఒక్కసారిగా ఏ ఒక్కరూ కొట్టి పారెయ్యలేరు కాబట్టి అనుభవం గూడా ఒక కవితావస్తువే నని అంగీకరించి తీరవలసిందే!

# గురజాడకు మార్గదర్శి వేమన

'గొడ్డుటావు పితుకకుండ గొంపోయిన

పాల నీదు పండ్లు రాలదన్ను' ఇందులో వస్తువు లేదంటారా ? ఉన్నది. ఎట్లాంటి వస్తువు ? నిత్యం మనం చూస్తున్న, చేస్తున్న అనుభవంలోనిది. ఇందులోని భావాన్ని విడమరచి చెప్పడానికి ఏ లక్షణ శాస్త్రాలకుగానీ, నిఘంటువులకు గానీ శక్తి చాలదు. నిత్య జీవితానికి దర్పణం, ఈ భావం. దీని లోని లోతులు త్రవ్వాలంటే అనుభవమే మూలం.

'ముదిత నడవినుంచి మునులేడి వెన్నంటె

రామచంద్రుడు కంటె రసికుడేడి ?' అని— అవతార పురుషుడైన శ్రీరామచంద్రుని మీదికి తన బాణం విసిరాడు, కవి ! ఈ రెండు పాదాలలోని భావం సంపూర్ణంగా అర్థం కావాలంటే రామాయణ కథ పూర్తిగా తెలిసిఉండాలి. పై పద్యంలో వస్తువు లేదనేవాళ్లు ఈ పద్యంలో గూడా లేదనే చెప్పాలి. పై పద్యానికి జీవితంలోని ఒక సంఘటన ప్రమాణమైతే, ఈ పద్యానికి రామాయణంలోని ఒక ఘట్టం ప్రమాణ మవుతుంది.

ఈ పద్యంలోని విషయం రామాయణంలోదైనా 'పాలువు తొలగువేళ బుద్ధు లిట్లుండురా' అని సమర్థన పరంగా అనుభవంతో మేళవించి చెబుతాడు. ఇక్కడ అను భవమే ప్రధానంకాని, రామాయణం కాదు. అనుభవాన్ని చెప్పడం కోసం, అందరికీ తెలిసిఉన్న ప్రసిద్ధ ఇతివృత్తాన్ని సామ్యంగా తీసుకోవడం వేమన్నలోని ఒక అలవాటు !

'సాహిత్యంయొక్క ప్రయోజనం ఆనందాన్నివ్వడమే కదా ! కని, విని ఎరుగని లోకోత్తర విషయాలను సాహిత్యంలో సృష్టిస్తే ఆనందమిస్తుంది. కాని— నిత్యం మనం చూస్తున్న, చేస్తున్న విషయాలే మరలా సాహిత్యంలో ఉటంకిస్తే ఎవడు ఆనందిస్తాడు ? జీవన సమస్యలలో వేగలేక విసిగిపోయినప్పుడే కదా కావ్యాన్ని చేబూనుతాము. అక్కడా ఇవే సమస్యలు ఎదు రైతే— మరి చిరాకెత్తకుండా ఉంటుందా ?' అనే ప్రశ్న కలగవచ్చు.

ఆనంద మివ్వటమే సాహిత్య ప్రయోజనమనే విషయంలో విప్రతిపత్తి ఏమీలేదు. 'అనుభవం' సాహిత్యంలో ఆనంద మివ్వదనే కదా— ప్రశ్న ! ఇస్తుందనే అంటాను. ఎట్లా— అంటారా ?

ప్రకృతిదృశ్యాన్ని మనం నిత్యం చూస్తూనే ఉన్నాము కానీ, దాన్నే గొప్ప చిత్రకారుడు సజీవంగా చిత్రిస్తే— నిజంగా చూసేదానికన్నా చిత్రంలో మరింత ఆనందిస్తున్నాము. కారణ మేమిటి ? రసాస్వాదనకు 'అలౌకికం' ముఖ్యం అని తేలింది, దీనివల్ల ! నిత్యం మనం చూస్తున్న మేడమీది దాబాలోని— పూలతీగ, తీగచుట్టూ రంగురంగుల పూలగుత్తులూ, ఆ గుత్తుల చుట్టూ రాగాలుతీస్తూ భ్రమిస్తున్న భ్రమరాలూ— 'లౌకికం.' ఎన్నో ఆటంకా లున్నాయి, ఇక్కడ. దగ్గరికి వెడితే తుమ్మెదలు కుట్టుతాయనే భయమూ, సాయంకాలానికల్లా ఇంత అందమైన పూవులన్నీ వాడిపోతాయి కదా— అనే బెంగా ఉండనే ఉంటుంది. అదే తీగా, పూలూ, తుమ్మెదలూ చిత్రంలో అయితే 'అలౌకికం' గా రూపు దాలుస్తాయి. చిత్రంలోని తుమ్మెదలకు కుట్టే గుణంగాని, పూలకు వాడే గుణం కానీ లేదుకదా !

'వస్తువ' సాహిత్యం కూడా సద్యః పర నిర్వృతి నిస్తుం దనే విషయంలో ఇప్పుడు సందేహమేమీ లేదు. 'ప్రాచీన కవిత్వం గూడా ఇల్లాంటి ఆనందమే ఇస్తుందికదా ! మరి ప్రాచీన కవిత్వానికన్నా ఆధునిక కవిత్వంలో ఉన్న గొప్ప ఏమిటి ?'— గొప్ప ఏమిటంటే దానికన్నా దీనిలో ఉత్కృష్ట మైన మరొక ప్రయోజనం ఉంది. ఏమిటంటారా ?

ఆధునిక సాహిత్యంలో నేటి సాంఘిక సమస్యలను చిత్రించడంవల్ల 'కవిః క్రాంతదర్శి' కావున— సమస్యలను చిత్రించేటప్పుడు సమస్యాపరిష్కారానికి మార్గాలు గూడా చెప్పక పోడు. కావున, వస్తువ సాహిత్యం ఆనందాన్నివ్వడమే కాక సమస్యా పరిష్కారానికి గూడ మార్గం చూపుతోంది.

ఇంతదూరం ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, గుర జాడ సాహిత్యం ఈ జాతికి చెందిందే ! గురజాడ దృష్టి ఈ ఒక సాహిత్యరంగానికే పరిమితం చెయ్యబడింది కాదు. ఆయనకు అభిరుచి, అభినివేశం లేని విషయమంటూ ఏదీ లేదు. అలా అభిరుచి, అభినివేశం గలిగిన సముదాయంలో సాహిత్యం ఒక అంగం మాత్రమే! గురజాడ చరిత్ర పరిశోధనలందు చేదోడుగా, వాదోడుగ ఉండి, వారి వ్యక్తిత్వాన్నెరిగిన మల్లం పల్లి సోమశేఖరశర్మగారు— ఆతనిని గురించి ఇలా అంటున్నారు. 'శ్రీ గురజాడ అప్పారావుగారు శిల్ప, చిత్రకళలలో, సంగీత సాహిత్య నాట్యములలో అభిమానముతో అభిరుచి అభినివేశము కలవారు. ఈ రంగములం దాయన ఆసక్తి అపారము ..... సాహిత్యంమీదనే ఆయనకు ప్రత్యేకాసక్తి ఉన్నప్పటికి ఆయన తన దృష్టిని దానికే పరిమితం చెయ్యలేదు.'

గురజాడ సాహిత్యాన్ని చేబూనటంలో రెండు ప్రయోజ నాలను ఆశించాడు. (1) జాతిని వీర్యవంతం చెయ్యడం, (2) వ్యవహారికభాషను కావ్యభాషగా చేయటం.

'కన్ను కానని వస్తుతత్వము' ను గూర్చి వూహించి వ్రాయడం అంటే గురజాడకు గిట్టదు. కానీ, ప్రాచీనాంధ్ర

సాహిత్యమంతా ఈ దృష్టితోనే కాలం గడిపింది. వాస్తవికత చెప్పాలి. అనుభవం చెప్పాలి. సమకాలీన సాంఘిక సమస్యలను సాహిత్యంలో ప్రతిఫలింపజేయాలి. ఆ సమస్యలకు పరిష్కార మార్గం చూపాలి. ఇదే సాహిత్యం. జాతిని ముందుకు నడిపించడమే సాహిత్యం యొక్క ప్రయోజనం—అని విశ్వసించాడు గురజాడ.

అన్నింటికన్నా ఆయన చెప్పదలచుకున్న ప్రధాన విషయం— 'యెల్ల లోకము ఒక్క యిల్లై, వర్ణభేదము లెల్ల కల్లై, వేల నెరుగని ప్రేమబంధము, వేడుకలు కురియా' అనేదే!

ఇదే దృష్టితోనే ఇంతకుముందే వేమన్న సాహిత్యంలో మైలురాళ్లు నాటిఉన్నాడు. వేమన్న దృష్టికీ, తన దృష్టికి చాలా సామ్యం ఉన్నట్లు గుర్తించాడు గురజాడ! అవెంటనే— వేమన్న తన భావాలను సామాన్య ప్రజానీకపు హృదయాలలో నాటడానికి ఏ పద్ధతి అవలంబించాడనే విషయాన్ని గూర్చి గురజాడ బాగా పరిశీలించాడు.

ఆ పరిశీలనలో వేమనలోని రహస్యాన్ని గురజాడ ఇలా అర్థం చేసుకున్నాడు.

సంస్కృత వృత్తాలనే గుత్తకు తెచ్చుకుని, మరింత క్లిష్టబంధాలను వానికి తగిలించి, ఆ ఛందస్సులోనే జోరుగా కావ్య రచనలు సాగుతున్న—ఆ కాలంలో వేమన వాటి జోలికి పోక తన భావాల కనుకూలంగా ఉండే చిన్ని జాతి ఛందస్సుని స్వీకరించాడు. అంటే, ప్రజా బాహుళ్యానికి బలమైన ఛందస్సు పనికి రాదని నిర్ణయించాడు.

సంస్కృత ప్రయోగాలు తమ కవిత్వంలో ఉంటేనే కవి—అనే మూఢ నమ్మకం ఆనాడు ఆంధ్రదేశంలో నలు దిక్కులా బాగా వ్యాపించిఉంది. అందుకని ఆనాటి తెలుగు కవులు పద్యమంతా ఒక్క సంస్కృత సమాసంతో నింపేసి, చివర ఒక తెలుగు ప్రత్యయంలో దానికి తెలుగు పద్య'మనే ముద్రవేసేవారు. తమ పాండిత్యాన్నంతా ఇలాగే పద్య పారధ్యానికి, అలంకార బాహుళ్యానికే వెచ్చించేవారు. ఎంత సంస్కృత పద జటిల సమాస గుంభనలతో పద్యం చెబితే అంత గొప్ప కవిగా ఆనాటి పండిత మూక భావించేది. నిర్జీవమైన సమాసాల కంపతో నిండిన కవిత్వం సామాన్య ప్రజానీకానికి పనికి రాదనుకున్నాడు వేమన్న. వెంటనే తన శకటాన్ని ఆవేపు నించి మరోవేపుకి మళ్లించాడు.

పాలుపాత్రలో పోసుకుని తాగుతాము. భావం, భాషని ఆధారంగా చేసుకుని ఆనందిస్తాం. పాత్ర తేలిగ్గా ఉంటే బాలుడు గూడా సులభంగా పాలు తాగ గలుగుతాడు. భాష సులభమైనదైతే పాండిత్యంలో బాలుడైనవాడు గూడా భావాన్ని అందుకో గలుగుతాడు. పాలు ఎంత మంచివైతే శరీరానికి అంత శ్రేష్ఠం. కాని పాత్ర బరువైనదైతే ప్రయాసతప్ప మరేమైనా ప్రయోజనం ఉందా?—అనుకున్నాడు వేమన్న.

మనసుకు ఇంపితం కూర్చేటందుకు పాత్ర నాజూకుగా కూడా ఉండాలి. అందుకని మృదువైన భాషలో లలితమూ, మనోహరత్వమూ చూపించాడు.

'కుండ కుంభమన్న, కొండ పర్వతమన్న
ఉప్పు లవణమన్న నొకటిగాదె!
భాష లిట్లె వేరు పరతత్త్వ మొక్కటే' అంటాడు వేమన్న.

ఇక్కడ పరతత్త్వమంటే రసమని అర్థం: 'బ్రహ్మానంద సబ్రహ్మచారీ రసః' అని కదా రసజ్ఞుల ఉవాచ. సంస్కృతమే భాష అని ఉట్టి గట్టుకుని వూరేగే పండిత ప్రకాండుల మీద తిరుగులేని కొరడా చురక—ఇది! 'తీయ తీయనైన తెలుగు భాష'లో గూడ సంస్కృత భాషలోకంటె మిన్నగా రసాన్ని ప్రతిపాదించవచ్చుని—వేమన్న అభిమతం. అందులోనూ తన భావాలను సామాన్య ప్రజానీకానికి అందివ్వాలనేదే ఆతని గాఢాభిలాష. కావున భాష బరువైనదికాక తేలికగా లలితంగా, వ్యవహారానికి దగ్గరగా ఉండేదిగా ఉండాలి—అని నిర్ణయించుకున్నాడు. అందువల్లే నిత్య వ్యవహారంలోని జాతీయాలూ, లోకోక్తులూ సందర్భోచితంగా, రమ్యంగా అడుగడుగునా ప్రయోగిస్తాడు.

'వెంటి తెట్టు మండు పరికింప నెయ్య'గనీ, 'పంట చేను విడచి పరిగ ఏరినయట్లు' అనీ మానవ దౌర్బల్యాన్ని ఎత్తి చూపేనీ—'బుద్ధి చెప్పువాడు గుద్దితే నేమయా' అని పద్దిచెప్పడమూ—'తాడు ద్రొక్కి పాము దలచిన చందమౌ' నని చిత్త భ్రాంతిని తెల్పడమూ—'వానరాకడ మరి ప్రాణము పోకడ' అని నిత్యాన్ని అనిత్యతో చెప్పడమూ—'పంది మురుగు మెచ్చు పన్నీరు మెచ్చునా?' అని నీచ ప్రవృత్తి నెత్తి చూపడమూ—'బొగ్గు పాల గడుగ పోవునా మైల్యం'అని సత్యం చాటడమూవంటివి మిక్కుటంగా ప్రయోగించి—ఎక్కడి కక్కడే గడ్డపారతో భూమిలో పాతుకుపోయిన ముళ్లపొదలను కబళించివేస్తాడు.

మన జేబులోని కత్తి తీసి మన శరీరంలోని కురుపును కోసి ఎత్తేసినట్లు—మనం నిత్యం వాడుకునే సూక్తులతోనే మన కళ్లను కడిగి వేస్తాడు. మూఢ నమ్మకాలను ఎత్తి చూపించి, పరిహసించి—కనువిప్పు కలిగిస్తాడు వేమన్న!

ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది—ఇంతటి చాతుర్యం, ప్రతిభ కలిగిన కవి మరి ఏ కాలంలోనూ ఉండడు, ఉండబోడని!

అతను చెప్పిన ఉపమానాలూ, ఉదాహరణప్రాయ మైనవీ, నిత్య జీవితానికి ఎంత దగ్గరైనవో గమనిస్తే వేమన్న నిశితదృష్టి ఎంతటిదో కదా అని మనకు అబ్బురం కలిగించ కుండా పోదు.

'కుండ చిల్లిపడిన గుడ్డ దోపడం, గడ్డివేయు పొట్ల గొడ్డు కొమ్మాడించడం, పుట్టలోన చెదలు, కుక్కతోక, మేడిపండు, కాకి—కోకిల, పంది—చందనం, ఉప్పు—కప్పురం, కంచు—కనకం, కొండ—అద్దమూ' వంటివే!

ఇంతవరకు తేలిందేమిటంటే—గురజాడ వేమననుంచి తన పరిశీలనలో నాలుగు విషయాలు గుర్తించాడు. (1) ప్రజా బాహుళ్య ప్రయోజనా సాహిత్యానికి—సంస్కృత వృత్తాలవంటి బలమైన ఛందస్సు పనికిరాదు. (2) భాష—నిత్య వ్యవహారంలో మెదిలేదై ఉండాలి. (3) ఉపమానాలూ, ఉదాహరణలూ నిత్య జీవితానికి దగ్గరివై ఉండాలి. (4) వ్యవహారంలో ఉన్న జాతీయాలూ, లోకోక్తులూ సందర్భోచితంగా ఉపయోగించుకోవాలి. (ఇవి కవి భావాలను పాఠకులకు ఇట్టే అందించేవై ఉండాలి)

ఈ విషయాలను గురజాడ గ్రహించాడు. గ్రహించి అనుసరించాడు. అనుసరించి వేమన్నకంటే గూడా ఛందస్సు విషయంలోను, భాషా విషయంలోను మరో అడుగు ముందుకు వేశాడు.

వేమన్న కావ్యాలలో దొర్లుతున్న తేలిక ఛందస్సుని స్వీకరిస్తే, గురజాడ ప్రజా హృదయాల్లో దాగివున్న జానపద సాహిత్యంలోని ఒక విధమైన మాత్రా ఛందస్సుని స్వీకరించి దానికి 'ముత్యాలసరం' అనే పేరు పెట్టాడు. 'ఒక జాతి పార్శీ గజలుయొక్క నడక ముత్యాల సరాల్లో తెచ్చేందుకు నేను ప్రయత్నించా'నని చెప్పుకున్నాడు గురజాడ. కానీ వేమన్న యొక్క ఆట వెలది పాదములు ముత్యాల సరాల్లో చాలాచోట్ల వచ్చి చోటు చేసుకున్నాయి. (ఆట వెలదిలోని రెండు, నాలుగు పాదాలలోని మాత్రలకు ముత్యాలసరంలోని పాదాలకు ఒక మాత్రయే తేడా)

రెండో విషయం. వేమన్న వ్యావహారిక భాషకు గ్రాంధికతా ముద్రవేసి ప్రయోగించాడని అన్నాను. గురజాడ నాటకాల్లోనూ, వ్యాసాలలోనూ, కథానికలలోనూ వ్యావహారిక భాషను అల్లాగే ఉపయోగించాడు. కానీ, సాధారణంగా ముత్యాలసరాలలో మాత్రం వేమన్నలాగా వ్యావహారికానికి గ్రాంధికతా ముద్ర వేశాడు. 'పూర్ణమ్మ'—'మిణుగురులు' మొదలైన ఖండికలలో మాత్రం వ్యావహారికమే ఎక్కువగా చోటు చేసుకుంది.

ఇల్లా వ్యావహారిక పదాలతో కూడిన తన భాషకు గురజాడ 'తేటైన మాటలు' అని చెప్పుకున్నాడు. వ్యావహారికానికి గ్రాంధికతా ముద్రవేయటం గూడా ఆయన చెప్పిన 'క్రొత్త పాతల మేలు కలయిక' లో ఒక భాగమే నని నా అభిప్రాయం.

గిడుగు రామమూర్తి పంతులుగారి సాహచర్యంవల్లే గురజాడకి వ్యావహారికంమీద ఇంత బలమైన అభిమానం ఏర్పడి ఉండవచ్చునని నా అభిప్రాయం. ఈ భాషా ఉద్యమంలో గిడుగువారికి గురజాడ కుడిభుజంగా నిలిచాడు. ఆ ఉద్యమం తనదిగానే భావించి నాటకాలు మొదలైన వాటిలో అచ్చు వ్యావహారికాన్నే ఉపయోగించి, వ్యావహారిక భాష కూడా కావ్యానికి ఉపకరిస్తుందని, దానితోనే కావలసినంత శిల్పాన్ని, రసాన్ని పోషించవచ్చునని ఆచరణ పూర్వకంగా రసిక లోకానికి సత్యాన్ని చాటాడు.

కవిత్వంలో నవ్యత, ఉపదేశాలమీదే తన దృష్టి కేంద్రీకరింపబడినట్టు కనిపిస్తాడు గురజాడ. భావంలోనూ, భాషలోనూ నవ్యత సాధించాడు. ఉపదేశమే చాలా ఉద్ధృతంగా కనిపిస్తుంది. అందువల్లే అతని ఖండికలలో ఎక్కడికక్కడే ఉపదేశ వాక్యాలు కథా కథనం గూడా మరచిపోయి— భూమిని తొలచుకునివచ్చే వెదురు మొలకల్లా చాలా తీవ్రంగా పెల్లుబికి వచ్చేస్తాయి. భాషలో నవ్యతకోసం వ్యావహారికాన్నయితే స్వీకరించాడుగాని, కవిత్వ విషయంలో అతని భాష ఎల్లా ఉంటుందంటే—ఎంత ఈత వచ్చిన మొనగాడైనా ప్రవాహంలో దూకి ఎదురీదినట్టూ, పసిపాప తప్పటడుగుల్లాగా ఉంటుంది.

ఇందుకు కారణమేమిటంటే—గురజాడ భాషయొక్క ఆయువుపట్లు పూర్తిగా ఎరక్కపోవడం—ఒకటి! క్రొత్త పాతలను మేళవించి ఎవ్వరూ తొక్కని ఒక నూతన పంథాకు దారితీయడం—మరొకటి!!

ఇకపోతే మూడో విషయం. ఎంత అలంకారాలను దూరంగా విసిరెయ్యాలనుకున్నా—కవిత్వం కాబట్టి నైసర్గికాలైన ఉపమాద్యలంకారాలు అప్రయత్నంగా వచ్చి చోటు చేసుకుంటూనే ఉంటాయి. ఎంత నవ్యత సాధించాలనుకున్నా 'కలువల కన్నులు', 'ముఖ కమలము', 'మోము చందురుడు'వంటి ప్రాచీన సాంప్రదాయాలుమాత్రం దొర్లడం మానలేదు, గురజాడ కవిత్వంలో. 'ముందు చూపే ప్రధానంగా కలిగిన మీలో ఇదేమిటి అపశృతిలాగా ఈ వెనుకచూపు?' అని ప్రశ్నిస్తే—'క్రొత్త పాతల' యందు 'పాత' అంటే ఇదే—నని సమాధానం చెప్పవచ్చు—గురజాడ.

గురజాడ ఉపమానాలలో ముఖ్యం చంద్రుడూ, కలువలే ఎక్కువగా కనిపిస్తుంటాయి. ఇవి ప్రాచీన కవిత్వానికి గూడా పడికట్టువంటివే అయినా, నిత్యం మనం చూస్తున్నవేకదా! కాబట్టి అనుభవ పరిధిని దాటినవనటానికి వీల్లేదు.

'చంద్రభీత ఘనధ్వాంత సంచయమున, కలయ మొసంగి వేణీభరంబను నెపమున దనవెనుక వేసికొన్నది తరుణి మొగము చంద్రుని గైకొనమి కిదియు సాక్షి గాదె' అని ఒకరూ, అలరుల 'తేనియ నానిచి మొలక గట్టి, శర్కరా

తీజములు మధుశారదభావాని, భావజాదు విత్త మొలచిన పైరు నేటిపై, రద విలాసంబు పూబోడి పెదవి పదవి' అని పలికొకరూ, '(శవణ పుట కూప వినిపాత పాథ్వమున నిగిడి యువ్వని కట్టు పోక నిల్చెనగాక, యుధిక చపల వృత్తా వంబులైన యుట్టి, దీని కన్నులు దలమట్ట దిరిగిరావె?' అని వేరొకరూ—ఇల్లా ఆకాశానికి నిచ్చెన వేసినట్టు కళ్ల ముందు స్పష్టంగా కనిపించే వస్తువును అందని వానితో ముడివెట్టి పాఠకులకు సూటిగా, సుందరంగా చెబుతున్నా నినే భ్రమతో—తమ తిక్క కాస్తా పాఠకులకు గూడా ఎక్కించారు. ఆలోచనా తీవ్రతేగాని, భావతీవ్రత బొత్తిగా వదుర బోతున్నట్టుంటుంది, ప్రబంధాలంకార వర్ణనలలో.

గురజాడ ఖండికలలో అలంకారాలు అంతా వెదికితే ఏ ఏడో—ఎనిమిదో కన్నా ఎక్కువ ఉండవు. వాటిల్లోనూ ఉపమానాలే ఎక్కువ. అవి గూడా సమంజసంగానూ 'కథార్థంబు ఘటిత పూర్వాపరమై' ఉంటాయి.

'మోమున నిండిన చింత......పండు వెన్నెల కుసుమ వనిపై నిండు గమ్మిన నీడ కైవడి' ఉంటవి, 'వన్నెగాంచిన నగరి సుందరు'లలోకెల్లా 'కన్నె' 'చుక్కల నడుమ చందురు నట్లు వెలిగెడు'నని 'నళుల సారను కనుల వనములకు నళుల ప్రేమయె పే వెలు'గని, 'దేశమనియెడి దొడ్డ వృక్షం ప్రేమలను పూలెత్తవలెనో'నని, 'నాటి కోర్కెలు నేడు......తీవ విరిగిన చెరకువలె—బెండై' ఉన్నవని—సామాన్యంగా నిత్య సంభాషణా క్రమంలో మన మధ్య దొరికే ఉదాహరణలనే స్వీకరిస్తాడు.

నాలుగో విషయం ఏమిటంటే—వేమన్నలాగా గురజాడ కూడా వ్యావహారికంలోవున్న నుడులనూ, జాతీయాలనూ, లోకోక్తులనూ అక్కడక్కడా ప్రయోగిస్తాడు.

'కోటి విద్యలు......పొట్ట కూటికే'నని హేతువాదాన్ని చాటడం, 'కట్టుకున్నది ఏమికాని. పెట్టి పొయ్యకపోతేపోనీ, కాంచి పెంచిన తల్లి దండ్రులనైన కనవలదో', అని ధర్మ పక్షాన్ని స్వీకరించడం, 'కత్తి చంపును—మాటవాతలు మానవే వాడు' అని సత్యాన్ని నిరూపించడం, 'దైవమే గతి' యని అనదలందరి మానవ స్వభావాన్నెత్తి బయట పెట్టడం, 'పట్నమేలే రాజు అయితే, రాజునేలే దైవముండడా?' అని తత్వాన్ని తెలియ జెప్పడం 'తప్పు ఒక యెడ దండ మొక యెడ' అని అధికారాన్ని దుయ్యబట్టడం వంటివి చాలా కనిపిస్తాయి, గురజాడ కవిత్వంలో

వేమనలో యుక్తి, రక్తి మొదలైన ఇహ మార్గాన్వేషణ ఎంత ఉందో అంతకుమించిన భక్తి, ముక్తి మొదలైన పరతత్త్వ మార్గాన్వేషణా ఉంది. గురజాడ కవిత్వమంతా సమకాలీన సాంఘిక జీవితాన్ని చిత్రించడంలోనే కాలం గడిపినా, పరతత్త్వాన్ని నిర్వచించేది గూడా కొద్దో గొప్పో లేకపోలేదు. అదే 'మనిషి' అనే గేయం. అది మానవుని యొక్క అంతరాత్మ లక్ష్యమేమిటో నిర్వచిస్తోంది. ఈ తత్త్వంలో గూడా వేమనకీ, గురజాడకీ ఏకత్వమేకాని భిన్నత్వం ఏ కోశానాలేదు.

'రాతి బొమ్మకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుండు' అని,

'రాయి దేవుడైన రాసులు ప్రింగదా' అని— వేమన్న విగ్రహారాధన నిరసిస్తే—

'మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టం!' అని పై వేమన్న భావాన్నే గురజాడ ధ్రువపరుస్తాడు.

'గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూర మృగ మొకండు తారసిలిన
ముక్తి మార్గ మదియె ముందుగా జూపురా'

అని వేమన్న తన సహజ సుందరమైన వ్యంగ్య ధోరణిలో అంటే, దాన్నే—

'దేవు డెకడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడేవేలా?' అని వాచ్యం చేసి, సూటిగా—ఘాటుగా అనేస్తాడు గురజాడ.

'తనదు నాత్మయందు దైవంబు గలుగంగ
తీర్థయాత్రల కిల తిరుగు నరుడు
గంధపు తనకలను గాడ్దె మోసిన యట్లు'

అని వేమన్న అంటే—

'కన్ను తెరచిన కాన బడడో?
మనిషి మాత్రుడి యందు లేడో
ఎరిగి కోరిన కరిగి ఈడో—ముక్తి!' అల గురజాడ అంటాడు.

పై ఉదాహృతులందు శరీరాలలో కించిత్తు భేదం కనిపిస్తున్నా, ఆత్మలుమాత్రం ఏకమే ననటంలో ఎవరికీ ఏవి ప్రతిపత్తి లేదనుకుంటాను.

# హిందువులు ఉర్దూ సారస్వతము

శ్రీ సదాశివ

ఉర్దూ ముసల్మానుల భాష అని కొందరి అభిప్రాయం ఈ అభిప్రాయం భ్రాంతి మూలకం.

మరి ఇలాటి అభిప్రాయం ఏర్పడటానికి కారణ మేమిటి? ఈ ప్రశ్న సహజం—

స్థూలంగా దీనికి మూడు జవాబులు చెప్పవచ్చు.

ఒకటి : ముసల్మానులే ఉర్దూ మాటలాడతారు.

ఉత్తరాదివారైన హిందువులూ ఉర్దూనే మాట లాడతారు. ఆయా ప్రాంతాల ముసల్మానులు ఆ యా ప్రాంతీయ భాషల్నే మాట్లాడతారు—అన్య దేశాల ముసల్మానులు అన్య దేశాల భాషల్నే మాట్లాడతారు.

కనుక ముసల్మానులే ఉర్దూ మాట్లాడతారనటం సరి కాదు.

రెండు : ఉర్దూ సారస్వతంలో ఇస్లాం మత ప్రసక్తి, ముస్లిం సంప్రదాయాలు వస్తువులు.

కొందరు ముస్లిం రచయితల రచనల్లో, అవీ మత సంబంధమైన రచనల్లో ఇస్లాం మత ప్రసక్తి ఉన్నమాట వాస్తవం. తెలుగులోనూ, క్రైస్తవ మతానికి, ఇస్లాం మతానికి సంబంధించిన పుస్తకా లున్నవి కొన్ని.

ఇక సమయ సంప్రదాయాలు చాలావరకు పర్షియాకు చెందినవి. అవి కేవలం ముసల్మానుల వసటానికి వీల్లేదు. అలా కేవలం పారసీకవుల సమయ సంప్రదాయాల్నే ఉపయోగించటం సరసమైన పద్ధతి కాదని హాలీ, ఆజాదులవంటి విద్వత్కవులు విమర్శించారు. కులీ కుతుబ్షా, నీదా, నజీర్, హస్రత్ మొదలగు మహా కవులు హైందవ సంప్రదాయాల్ని అక్కడక్కడ గ్రహించారు.

కనుక ఉర్దూ సారస్వతంలో ఇస్లామిక వస్తుత్వం కలదనటం సరికాదు.

మూడు : ఉర్దూ సారస్వతం ముసల్మానుల సృష్టి.

ఆదిలో సారస్వత పోషకులయిన ప్రభువులు ముస ల్మానులు. కనుక ముస్లిములే అధికంగా కావ్య రచన చేశారు. అప్పట్లో—అయినా హిందువులు చూస్తూ ఊరుకున్నవారు కారు. ఆనాటి కవుల చరిత్రల్లో లాలా టేక్ చంద్ బహార్ సంతోష్‌రాయ్, బేతాబ్, బింద్రాబన్‌రాఖిమ్, కువర్ సుఖీరాజ్ బహదూర్ రహ్మత్, ఘాసీరామ్ ఖుష్దిల్ మొదలు గాగల హిందూ కవుల పేర్లు ఉల్లేఖింపబడి ఉన్నాయి— వారి పద్యాలు నాలుగైదు ఉదాహరించబడి ఉన్నాయి. కాని వారి కావ్యాలు ప్రచారంలో లేవు.

ఢిల్లీనగరమూ, లఖ్నో నగరమూ ఉర్దూ భాషాభి వృద్ధికి కేంద్రాలు. ఈ రెండు నగరాల భాషకు ప్రత్యేక విశిష్టత లున్నవి. ఈ భాష కేవలం ముస్లిములదికాదు. అందరిదీ.

కనుక ఉర్దూ సారస్వతం ముసల్మానుల సృష్టి అనటం సరికాదు. ఉర్దూ ముసల్మానుల భాష అనే అభిప్రాయం భ్రాంతి మూలకమని సారాంశం.

ఉర్దూ భారతీయ భాష—హిందు ముస్లిముల ఐక్యతకు నిదర్శనమైన భాష. దాని ఉత్పత్తి వికాసాలకు హిందువులు ముస్లిములు కలిసి కృషి చేశారు. అది నశించి పోగూడదని, రమణీయమైన దాని సారస్వతం నష్టపడి పోగూడదని హిందూ వులు ముస్లిములు ఆరాటపడుతున్నారు.

భాష సరస్వతీ స్వరూపం— దానికి కుల మతాలు లేవు.

ప్రాచీన కవుల చరిత్రల్లో పేర్కొనబడిన హిందూ కవుల కావ్యాలు ప్రచారంలో లేవన్నాను పైన— వారి రచ నలు ప్రజాదరణ పొందలేదన్నది స్పష్టం—

ప్రశంసలు పొంది ప్రఖ్యాతుడైన ప్రథమ హిందూ కవి పండిత దయాశంకర్ కౌల్ 'నసీమ్'. అతడు ఖాజా హైదరలీ 'ఆతిష్' శిష్యుడు.

అందరివలె గజల్లే కాక అతడు 'గుల్జారెనసీమ్' అను పేర మస్నవీ వ్రాశాడు. గుల్‌బకావలీ కథ దానికి ఇతివృత్తం అంతకు ముందే మీర్‌హసన్ 'సహరుల్‌బయాన్' అనే మస్నవీ వ్రాశాడు. అద్యులయిన మహాకవులు వ్రాసిన మస్నవీలన్నీ తెరచాటుకు పోయాయి. ఆ మస్నవీ అవతరించాక.

అంతటి మస్నవీ తర్వాత ఇంకొకటి వ్రాయటం సాహసమే. వ్రాసి అవుననిపించుకోవటం ఆశ్చర్యకరమే.

అతని సతీర్థ్యుడు మిర్జా షౌక్ కూడా 'జహరె ఇష్క్' అనే మస్నవీ వ్రాశాడు. అదీ అద్భుత రచనే—కాని 'గుల్జారె—నసీమ్' తర్వాతే దానికి స్థానం.

మస్నవీ అంటే మన ప్రబంధంవంటి కథా కావ్యం· ద్విపదల సముదాయం.

ఉర్దూలో రెండే రెండు శ్రేష్ఠ ప్రబంధాలు— ఒకటి మీర్ హసన్ వ్రాసినది. రెండవది నసీమ్ వ్రాసినది.

ఉన్న రెంటిలో ఒకటి హిందువుది!

మత పక్షపాతంగలవారికి మత్సరం కలిగింది— నిజాని కది 'ఆతిష్' రచన అని ఒక వాదం బయల్దేరింది ఆ నడుమ— ఆతిష్ రచనకూ నసీమ్ రచనకూ గురు శిష్య సంబంధమైనా లేదు. సహృదయులైన సమీక్షకులు, హిందువులూ ముస్లిములు, ఆ వాదాన్ని అణచివేశారు.

లఖ్నోనుండి 'అవధ్—పంచ్' అనే పత్రిక వెలువడేది— అబ్దుల్ హలీమ్ షరర్ అనే ప్రఖ్యాత రచయిత ఆ పత్రికలో 'గుల్జారె నసీమ్'ను విమర్శించాడు.

పండిత బ్రిజ్ నారాయణ్ చక్బస్త్ అనే ప్రఖ్యాత కవి ఆ పత్రికలోనే అతని విమర్శను ఖండించాడు. పండితులు కొందరీ పక్షము, కొందరా పక్షముచేరి ఇద్దరినీ సమర్థించారు. ఆ సారస్వత సమరం ముదిరి ముదిరి వ్యక్తిత్వాల మీదికి వెళ్లింది.

ఉన్నతులైన విద్వాంసులు కలుగజేసికొని ఆ సమరాన్ని శాంతింపజేశారు. అలా చేసిన వారు హిందువులూ, ముసల్మానులూ.

చివరికి చక్బస్త్ వాదమే నెగ్గింది.

ఆ పత్రికాధిపతులు ఆ సాహిత్య సమరాన్ని 'మారకె— షరర్ వచక్బస్త్' అనే పేర పుస్తక రూపంలో ప్రచురించారు.

దయాశంకర్ నసీమ్ క్రీ. శ. 1811 లో జన్మించి 1843 లో మరణించాడు.

కవుల చరిత్రలు వ్రాసిన వారిలో రాయ్ లక్ష్మీ నారాయణ్ ప్రసిద్ధుడు. అతడు ఉర్దూ ఫారసీ భాషల్లో ఉద్దండకవి. "చమనిస్తానె షొ అరా" అనే పేర అతడు పారసీలో వ్రాసిన ఉర్దూ కవుల చరిత్ర ప్రామాణికమయింది.

ఉర్దూ కవుల చరిత్ర లన్నిటిలో సమగ్రమైనది లాలా శ్రీరామ్ ఎం. ఏ. వ్రాసిన 'ఖుమ్‌ఖానయే—జావేద్' దాన్ని వ్రాయటానికి అతడు లక్షలు వెచ్చించి ముద్రితాముద్రిత గ్రంథాలు సంపాదించాడు. అతని గ్రంథాలయం అసమానమైంది. అదంతా అతని తర్వాత అతని ఇష్టానుసారం కాశీ విశ్వ విద్యాలయానికి అర్పింపబడింది.

అయితే అతడా గ్రంథాన్ని సమాప్తం చేయలేక పోయాడు. నాలుగు భాగాలు వ్రాసిన తర్వాత మరణించాడు.

పండిత బ్రజమోహన దత్తాత్రేయ కైఫీ దాన్ని పూరించాడు. కైఫీ సంస్కృతాంగ్ల భాషల్లో పండితుడు. ఉర్దూ పారసీ భాషల్లో 'ఉల్లామా'. అతని రచనలు శతాధికాలు—ఏ సాహిత్య సభకైనా అతడే అధ్యక్షుడు—ఈ నడుమనే దివంగతుడైనా డతడు.

ప్రామాణికమైన ఉర్దూ సాహిత్య చరిత్ర వ్రాసిన వాడు రాంబాబూ సక్సేనా.

ఫోర్ట్ విలియం కాలేజీ కొన్ని ఉర్దూ వచన గ్రంథాలు వ్రాయించింది. అవన్నీ తర్జుమాలే.

ఆ కాలేజీకొరకు నిహాల్ చంద్ లాహోరీ పారసీలోని గుల్‌బకావలీ కథను క్రీ. శ. 1804 లో 'మజ్హబే—ఇష్క్' అనే పేర ఉర్దూలో అనువదించాడు. 'గుల్జారె— నసీమ్'కు మూలమదే..

బేణీనారాయణ్ జహా ఒక కథను, ఒక కవుల చరిత్రనూ వ్రాశాడు.

లాలా లల్లూలాల్ హిందీ గద్య రచనకు జన్మదాత. అతడు ఉర్దూలో 'సింహాసన్ బత్తీసీ' వ్రాశాడు. అది సింహాసన ద్వాత్రింశతికకు అనువాదం. హిందీలోను దాన్నే వ్రాశాడతడు.

క్రీ. శ. 1846 నుంచి 1902 వరకు జీవించిన పండిత రతన్‌నాథ్ షర్షార్ ఒక అద్భుత రచన చేశాడు ఆది "ఫసానయే—ఆజాద్" అనే నవల. కొన్ని వేల పుటల్లో విస్తృతమైన వ్యంగ్య రచన అది. ఇప్పటికీ ఆసక్తితో చదువుతారా నవలను అందరూను. అందలి ఇతివృత్తంలో ప్రత్యేకత లేకున్నా, భాష చాల విశిష్టమైంది. షర్షార్ ఇంకా పెక్కు నవలలు వ్రాశాడు. కవిత్వమూ చెప్పాడు.

బ్రజనారాయణ చక్బస్త్ ప్రతిభావంతుడైన మహాకవి. రామాయణంలోని ఒక దృశ్యాన్ని అతి మనోహరంగా చిత్రించా డతడు. అకాల మరణం పాలయ్యాడుకాని లేకపోతే రామాయణమంతా ఆ చేతిమీదుగా అనువాదం పొంది ఉంటే ఉర్దూ సాహిత్యం ఇతోధికంగా సుసంపన్నం అయి ఉండేది.

అనుకుంటారు విద్వాంసులు. జాతీయ భావాల్ని కలిగించే కమ్మని కవిత లత లెన్నో చెప్పాడు.

దుర్గా సహాయ్ సురూర్ అలాటివాడే. అతడూ అకాల మరణం పాలయ్యాడు. జామె—సురూర్, ఖుమ్‌ఖానెయే—సురూర్ అనేవి రెండు అతని కావ్య సంగ్రహాలు.

నాటి హైదరాబాద్ సంస్థాన దివానులు రాజా చందూలాల్ షాదాన్, మహారాజా కిషన్ ప్రసాద్ షాద్‌ల సారస్వత పోషణ ఎవరెరుగనిది? వారిరువురు మహా కవులు.

సర్ తేజ బహాదుర్ సప్రూ ఉర్దూ సాహిత్యాభిమాని.

జ్వాలా ప్రసాద్ బర్క్ బద్లీ పదని విశ్వసిస్తూ అనల్పమైన గద్య పద్య వాఙ్మయాన్ని నిర్మించాడు.

నౌబత్‌రాయ్ నజర్, అమర్‌నాథ్ సాహిర్, త్రిలోక చంద మహరూమ్, దయానారాయణ్ నిగమ్, హరిచంద్ అఖ్తర్, గోపీనాథ అమన్, విశ్వేశ్వరప్రసాద మునవ్వర్ మొదలైనవారు సుప్రసిద్ధులైన విద్వత్కవులు.

ఆనంద నారాయణ ముల్లా సారస్వత నిర్మాతే కాక సారస్వత పోషకుడు.

హైదరాబాద్ నివాసి రాఘవేంద్రరావు 'జజ్బ్' పండిత ప్రశంసలందిన పరిణత కవి.

పండితలబ్భూరామ్ జోష్ మలిస్యానీ శాస్త్ర మర్యాదలూ సాహిత్య రహస్యాలూ క్షుణ్ణంగా ఎరిగిన మహాకవి. అతడు 'దాగ్' శిష్యుడు—ఎనభై మూడేళ్ల వయసులోవున్నా ఇప్పటికీ పత్రికల్లో తన కవిత ప్రచురిస్తూనే ఉంటాడు. 'గాలిబ్' వ్యాఖ్యాతగా అతనికి గొప్ప కీర్తి ఉన్నది.

అతని కొడుకు బాలముకుంద్ అర్ష్ మలిస్యానీ 'ఆజ్‌కల్' పత్రిక సంపాదకుడు. అతని కవిత నిసర్గ సుందరము. తాత్త్విక దృక్పథం అతని భావాల్ని గంభీరములు గావించినది.

నరేష్‌కుమార్ షాద్ కమ్మని కవిత అల్లగల యువ కవి. అతని పలుకులోని మార్దవ మాధుర్యాలు ఇతరుల కవితల్లో కన్పించవు.

జగన్నాథ్ ఆజాద్ ఉర్దూ భాషాభిమానం కల మహా కవి.

సుప్రసిద్ధుడైన ఇంకొక వృద్ధకవి పేరు చెప్పలేదు నేనింకా. అతడు ప్రొఫెసర్ రఘుపతి సహాయ్ ఫిరాఖ్ గోరఖ్‌పూరీ— అలహాబాదు విశ్వ విద్యాలయంలో ఆంగ్ల భాషోపాధ్యాయుడుగా పని చేశా డతడు. ఏబదేళ్లనుండి ఉర్దూ కవితా వ్యాసంగం చేస్తున్నాడు. అతని కావ్య సంకలనం 'గులె—నగ్మ'కు భారత ప్రభుత్వం బహుమతి ఇచ్చింది. 'రూప్' అను పేర సంస్కృత సంప్రదాయాల్ని పాటిస్తూ కొన్ని శృంగార ముక్తకాలు వ్రాసి ప్రచురించాడు. ఈనాటి విద్వత్కవుల్లో అగ్రగణ్యు డతడే. అతని ఆధిక్యాన్ని హిందువులూ, మహమ్మదీయులూ అంగీకరించారు.

ఇక నవలా రచనలో మున్షీ ప్రేమ్‌చంద్, కృష్ణ చంద్‌లకున్న పేరు ప్రఖ్యాతుల్ని గురించి వేరుగా చెప్పాలెనా? వారిద్దరూ అతిరథులు. కన్హయ్యాలాల్ కపూర్ వ్యంగ్య రచనలో అద్వితీయుడు. రాజేంద్రసింగ్ బేడీ, ప్రకాశ్ పండిత్, యశ్‌పాల్, ఉపేంద్రనాథ అష్క్ మొదలైనవారు విఖ్యాత రచయితలు.

కొత్తరాహుల్లోనూ, హైదరాబాదీయుల్లోనూ అనేకు లున్నారు గొప్పగా వ్రాసినవారూ, వ్రాయగలవారూ. అందరినీ స్మరించటం ఈ వ్యాసంలో సంభవంకాదు. ప్రత్యేక గ్రంథం వ్రాయవలసిన విషయ మిది.



# అతిథి

## శ్రీ ఆదివిష్ణు

(గతసంచిక తరువాయి)

విలే : (నవ్వేడు) బాగుంది. అంటే, సినిమాల్లో చేరాలనే తాపత్రయం ఎంత కాలం నుంచో ఉన్నదన్నమాట.

సుబ్బు : తాపత్రయం ఒక్కటే గాదు. దానికి సరిపడ్డ కృషీ చేశాను.

విలే : ఎంతవరకూ చదువుకున్నారు?

సుబ్బు : ఈ వూరి కాలేజీలో బి. ఎ. పాసయ్యాను.

విలే : చదువుకునే రోజుల్లో నాటకాలూ గట్రా......

సుబ్బు : బ్రహ్మాండంగా. ఆ రోజుల్లో ముఖ్యమైన హాబీ అదేను. వరుసగా రెండు సంవత్సరాలు ఉత్తమ నటుడి బహుమతిని తీసుకున్నాను. ఒక విధంగా చెప్పాలంటే ఈనాటి సుబ్బరాజు ఉత్సాహానికి ఆనాటి నాటకాలే కారణం. కానీ నటుడిగా పరిచయ మవ్వాల్సింది, దర్శకుడిగా తయారైయ్యాను.

విలే:—అవుతే—సినిమాల్లో నటించాలనే కోరిక ఏమైనా ఉందా మీకు?

సుబ్బు : రేపు మా నాలుగో చిత్రంలో ఆ అదృష్టం కలగొచ్చు. ఆ చిత్రం కూడా ప్రయోగాలతో తయారవుతోంది. కథనం యావత్తూ రెండున్నర గంటల్లో జరుగుతుంది. సినిమా కూడా సరిగ్గా రెండున్నర గంటలే ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే సినిమా చూస్తూ మీ వాచీని దిద్దుకోవచ్చు.

విలే: కొత్తం ఎలిమెంటు ప్రవేశపెడుతున్నారన్న మాట.

సుబ్బు : కథ కూడా ప్రయోగాత్మకంగానే ఉంటుంది. ముగ్గురు కుర్రాళ్లూ, ఒక ఆడకూతురూ, ఈ నాలుగే పాత్రలు. ఈ నలుగురితోనైనా బ్రహ్మాండమైన ఎక్స్పెరిమెంట్ చేయాలని సంకల్పం.

విలే : (ఉత్సాహం చూపించేడు) దాని తాలూకు ప్రయత్నా లెంతవరకూ వచ్చాయో చెప్పగలరా?

సుబ్బు : నటుల ఎన్నిక జరగలేదు. కథని ఎన్నుకోడమైందిగానీ ఇంకా మార్పులూ చేర్పుల్లోనే ఉంది.

విలే : ఈ చిత్రం కూడా శత దినోత్సవం చేసుకుంటుందని మేం ఆశిస్తాం.

(మంగపతి లేచి లోపలి గదిలోకి వెళ్లబోయేడు)

సుబ్బు : ఆగరా మంగా! (ఆగేడు) వీడు మంగపతని నా క్లాసు మేటు. మే మిద్దరం ఈ వూళ్లోనే చదువుకున్నాం. మీరు వచ్చేముందు మా చిన్ననాటి ముచ్చట్లని నెమరేసుకుంటున్నాం. ఆనాటి ఆనందం ఆనాటి ఈ ఊరు, ఈ రోడ్లూ, మా పంతాలూ, మా అల్లర్లూ, నిజం మేష్టారూ! ఈ రోజు నేనెంత ఆనందించానో మాటల్లో చెప్పలేను. స్టూడియోలూ, కార్లూ, యాక్టర్లూ కాల్ షీట్లూ, గల్లంతూ అదంతా ఓ మాయలోకం! దాంట్లో నలిగి పోతున్న నాకు మా మంగపతి దేవుడిలా ఈ వూళ్లో కలిశాడు. అయిదేళ్ల తర్వాత కలుసుకున్నాం. స్వర్గాన్ని వెంట బెట్టుకొచ్చిన మంగపతికి నేను చాలా ఋణపడి ఉన్నాను.

విలే : (సంతోషించేడు) ఇంత చెప్పిం తర్వాత మీ స్నేహ హృదయాన్నీ, మిమ్మల్నీ అభినందించాల్సిందే. సుబ్బరాజు గారూ! ఓ స్థితి కెదిగిన మీరు చిన్ననాటి మిత్రులూ వాళ్ల స్నేహాలూ ఇంకా గుర్తుంచి వాటి ద్వారా ఆనందాన్ని పొందుతున్నారంటే— నిజంగా మంగపతిగారు అదృష్టవంతులు. సార్ మంగపతిగారూ! మరోమాటు సుబ్బరాజుగారి పక్కన కూర్చుంటారా? మీ ఇద్దరి ఫోటోని మా పత్రికలో ప్రచురించే అవకాశాన్ని మా కిప్పించండి.

సుబ్బు : రారా మంగా! వచ్చి కూర్చో.

మంగ : (అతని ముఖంలో వెయ్యి దీపాలు వెలిగినట్టయింది. వచ్చి సుబ్బరాజు పక్కన కూర్చున్నాడు.) మీ హడావిడి చూస్తూంటే నా గుండె గొంతులో చేరినట్టయింది.

అలనాడు కృష్ణపరమాత్మని కలుసుకునేందుకు కుచేలుడు వెళ్ళాడు. ఆ పరమాత్మ సన్నిధిలో కుచేలు డెంత ఆనందాన్ని అనుభవించాడో నా కిప్పుడు తెలుస్తోంది.

(సుబ్బరాజు మంగపతి భుజంమీద చేయి వేశాడు. విలేఖరి కెమెరాని రెడీ చేస్తూ అన్నాడు.)

విలే : మీ స్నేహం చూస్తుంటే అమోఘంగా ఉంది. సృష్టిలో తియ్యని దేమిటో మీరు నిరూపించేరు. (అంటూనే కెమేరా క్లిక్ చేశాడు. ఫ్లాష్ వెలిగింది.) థేంక్యూ సార్ (కెమేరా సర్దుకున్నాడు.) మీతో యింత మాటాడిన తర్వాత నా కెంతో ఆనందంగా ఉంది. ఈ అవకాశం కలిగించిన మీకు నా ధన్యవాదాలు. సెలవ్. వొస్తాను.

(సుబ్బరాజా, మంగపతీ లేచి నించున్నారు. ఇద్దరితోనూ కరచాలనంచేసి విలేఖరి వెళ్ళిపోయేడు. సుబ్బరాజు సోఫాలో కూర్చున్నాడు. మంగపతి విలేఖరితోపాటు గుమ్మం వరకూ వెళ్ళి వొచ్చి—)

మంగ : నా పేరూ, నా బొమ్మ పేపర్లో వేస్తున్నార్ట. ఏనుగెక్కించావురా రాజా. అతను మన బొమ్మ కింద మన స్నేహితం గురించి నాలుగు ముక్కలు గొప్పగా రాస్తాడు. అది డిస్ట్రిబ్యూటరు నాపమురిది తప్పకుండా చదువుతాడు. చదివి (మెల్లిగా ప్రారంభమైన నవ్వు తారస్థాయి నందుకున్నది) చదివి.... ఒరే రాజా వాడది చదివి గుడ్లు తేలేస్తాడు. ఇంత ఎండ్రిన్ తాగి చస్తాడు. అలా చావక పోతే ప్రతిరోజూ కొంచెం కొంచెంగా నేనే వాడిని చంపుతాను. నే నాశించినదానికంటె వెయ్యి రెట్లు ఆదరం చూపించావురా రాజా ! రేపు నీకు జరుగ బోయే సన్మానం, ఈనాడు నాకు జరిగిన సన్మానం ముందు గుడ్డి దీపంరా. నాకింత గౌరవాన్నిచ్చి నన్ను ఉక్కిరిబిక్కిరి చేసిన మొదటి ఘనుడివి నువ్వు. నీ చేతిని నా కళ్ళ కద్దుకోనివ్వు రాజా !

విలే : (తన చేతిని లాక్కున్నాడు) ఏమిట్రా యిది ? నీకేమైనా పిచ్చా ?

మంగ : కాదు. కృతజ్ఞత. నువ్విప్పుడు నన్నేం చేయమన్నా చేసేస్తాను. చెప్పు—విషం తాగి చావమంటావా ?

సుబ్బ : ఒరేయ్ మంగా ! నువ్వెప్పుడైనా తాగావ్రా ?

మంగ : (గుర్తు తెచ్చుకున్నాడు) ఆ .... తాగేను. రెండుసార్లు మన కాలేజీరోజుల్లో మిస్సమ్మ సినిమాకెళ్లి తిరిగొస్తుండగా మీ ఫ్రెండెవడో 'తెల్ల గుర్రం' సీసాతో మన రూముకు కొచ్చాడు. మనల్నిద్దర్నీ బలవంతంమీద తాగించేడు. అప్పుడు నేను నోటికొచ్చిన పాటేదో పాడినట్టు గుర్తు. రెండోది—విశాఖపట్నంలో నా ఉద్యోగము పూడిన రాత్రి తాగేను. అప్పుడు సగాత్రం గుండె లవిసేలా ఏడ్చినట్టు జ్ఞాపకం.

సుబ్బ : ఇప్పుడు తాగాలని ఉందా ?

మంగ : నీ దగ్గర మందున్నదా ?

సుబ్బ : యస్. తాగుదామని ఉంటే చెప్పు. తాగేద్దాం.

మంగ : ఈరోజు నా జన్మకిక తిరిగి రాదు. ఏదీ పట్రా. నీచేత్తో నా కొంచెం పోయి. అమృతప్రాయంగా తాగేస్తాను. జీవితంలో గుర్తుండిపోయే సాహసాలు కావాలి నాకు. లేకపోతే నాకు ఖాళీ దొరికినప్పుడు నెమరేసుకోడానికి మేత ఉండదు. పట్రా రాజా. తొరగా పట్రా.

(సుబ్బరాజు లోపలికెళ్లి 'సీసా' పట్టుకొచ్చేడు. ఆలోగా మంగపతి బల్ల సర్ది గ్లాసులు అమర్చేడు.)—

సుబ్బ : (సీసా బల్లమీదుంచేడు) జాగ్రత్తరా మంగా. అతిగా తాగకు.

మంగ : ఏదీ ఈ గ్లాసులో అమృతాన్నింపు. (సుబ్బరాజు రెండు గ్లాసుల్లోనూ 'మందు' వొంచేడు. ఓ గ్లాసు తాను పుచ్చుకున్నాడు. రెండోది మంగపతి కిచ్చేడు. మంగపతి దాన్ని పూర్తిచేసి మళ్ళా గ్లాసుని సీసా దగ్గర పెట్టి అడిగేడు—) ఇంకొంచెంరా రాజా—ఆ చేత్తోనే ఓ సిగరెట్టూ యివ్వు. (సుబ్బరాజు మరికాస్త వొంచి. సిగరెట్టూ యిచ్చేడు. సిగరెట్టు ముట్టించి గ్లాసుని పూర్తిచేశాడు మంగపతి. ఈతడవ స్వయంగా తనే గ్లాసులో వొంచుకొని, గ్లాసు నోటి దగ్గరకు చేర్చుకొని అన్నాడు) గుడ్ బై టూ ఆలోఫ్ మై సర్రోస్, గుడ్ బై టూ ఆలోఫ్ మై షేడోస్, గుడ్ బై టూ మై ట్రాజెడి ఎండ్ గుడ్ బై టూ మై టియర్స్— వోరే రాజా— (మరో గుటక వేశాడు.) నవ్వేద్దురా నువ్వు. నువ్వుతే నేను చచ్చినంత వొట్టు. విశాఖపట్నంలో నే తాగి ఏడ్చినరోజు నా యెదటెవడూ లేడు. ఉంటే నన్నోదార్చ లేక వాడు చచ్చేవాడు. ఇంత ఆనందంలో నేను తాగి ఆనందిస్తున్న రోజున నువ్వున్నావ్; నువ్వున్నావ్రా రాజా ! నా ఆనందానికి నువ్వే మొదటి సాక్షివి. డైరీలో రాసుకోవి.— ఈ వేళ మంగగారు గుర్రాన్నెక్కి కళ్ళెం వొదిలి విహారయాత్ర ఝూంమ్మంటూ చేసేశాడు. అని రాసుకో. ఓపికుంటే దానికొంచెం గోల్డ్ మలాం చేయించు. ఈ ఛాన్సు మళ్ళా నీ జన్మలో చిక్కదురోయ్ !

(తలుపు దగ్గర చప్పుడైంది.)

సుబ్బు : ఒరేయ్ మంగా ! ఎవరో వచ్చినట్టున్నారా ?

మంగ : మీకేం ఫర్వాలేదు. నేనే లోపలి కెడతాను. నువ్వు మాటాడు. (సీసా, గ్లాసులూ, తీసుకుని మంగులు లోపలి కెళ్ళిపోయేడు. అటువెళ్ళిన కాసేపటికి లక్ష్మి టేప్ రికార్డరు తీసుకుని వొచ్చింది. ఆ అమ్మాయి అందంగా ఉంది. ఆమెను చూడగానే సుబ్బరాజు అన్నాడు—)

సుబ్బు : హల్లో ! రండి రండి. మీకోసమే ఎదురుచూస్తున్నాను.

లక్ష్మి : (నవ్వుతూ నవ్వింది. ఆ నవ్వు చిత్రంగా ఉంది. టేప్ రికార్డర్ బల్లమీద ఉంచి అన్నది) లేటయింది కాబోలు క్షమించాలి.

సుబ్బు : నో లేట్, నో క్షమించడం. ముందు కూర్చోండి. (కాలింగ్ బెల్ ఒత్తేడు. వెయిటర్ వొచ్చేడు.) రెండు డ్రింక్స్ (వెయిటర్ వెళ్ళిపోయేడు) ఊఁ చెప్పండి విషయాలు. అన్నట్టు మనం కలుసుకుని ఆర్నెల్లయిందనుకుంటాను.

లక్ష్మి : సరిగ్గా అంతే. నేను మదరాసులో ఉన్న ఆ నాలుగు రోజులూ ఎప్పటికీ మరిచిపోలేను. సామర్లకోటలో రైలెక్కిన మొదటి క్షణం మీ గురించి ఆలోచించి భయపడ్డాను. నా గొంతు మీకు నచ్చుతుందో లేక నా మొహం ముందే 'అమ్మాయీ ! నువ్వు మా సినిమాలో పాడేందుకు పనికిరావు గనక మళ్లీ కాకినాడకే వెళ్ళిపోమ్మా' అని సలహా యిస్తారో అని దిగులుపడిపోయేను. సెంట్రల్ స్టేషన్లో రైలెక్కినప్పుడు గుండెల్నిండా ఆనందం నింపుకున్నాను. మీరు నమ్ముతారో లేదో గనీ నేను మీ ద్వారా ఆంధ్ర ప్రేక్షకులకి ఒకానొక గాయకురాలిగా పరిచయం కాబోతున్నానని అనుకోడమే గొప్ప. హేపీగా ఉంది నాకు.

సుబ్బు : (తేలిగ్గా నవ్వేడు. డ్రింకులొచ్చేయి. ఇద్దరూ తీసుకున్నారు) ఉదయం నుంచి తాగుతూనే ఉన్నాను. గాభరా పడకండి. కేవలం కూల్ డ్రింక్స్. (మళ్ళా హాయిగా నవ్వేశాడు.)

లక్ష్మి : నే నెందుకు గాభరా పడాలిట ?

సుబ్బు : మరేంలేదు— తాగుతూనే ఉన్నానంటే మీరు మరోలా అర్థం చేసుకుని— (ఆగిపోయేడు)

లక్ష్మి : (అతను చెప్పబోయేదేమిటో లక్ష్మికి అర్థమైంది. అర్థమైనా దాన్ని అతి తేలిగ్గా తీసుకుంది) అపార్థం చేసుకున్నా నేను గాభరాపడను. ఎంచేతంటారేమో— తాగడమనేది నా ఉద్దేశంలో పెద్ద కార్యం కాదు. మతి పోగొట్టుకుని పదిమందిలోనూ అసభ్యంగా ప్రవర్తించనంత వరకూ, ఆ మోతాదు మించనంతవరకూ తాగడం పాపం కాదేమో. అయినా మీలాంటివారి కిది నొక్కిచెప్పడమూ అవసరం లేదేమో. ఏమంటారు ?

సుబ్బు : (అతను కొంచెం ఆశ్చర్యపోయేడు. క్షణానికిగాని తెప్పరిల్లలేదు) అంతే. అంతే (లక్ష్మి డ్రింకు తాగడం ప్రారంభించింది) మీరేవూ రెప్పుడొచ్చారు ?

లక్ష్మి : వొచ్చి రెండురోజులైంది. చిన్నాన్న గారమ్మాయి పెళ్ళి కోసం వొచ్చేను. నిన్ననే వెళ్ళిపోవాల్సింది. కానీ మీ రొస్తున్నారని తెలిసి ఆగిపోయేను.

సుబ్బు : థాంక్స్.

లక్ష్మి : అబ్బ ... ఏం పెళ్లిలెండి. నా ప్రాణం తినేశారు. పెళ్ళొచ్చిన ఆడపిల్లని ఎదటివాళ్ళు పాడమని అడిగినప్పుడు, ఆపిల్ల బెట్టుచేయడం చాలామంది పట్ల నిజం కావొచ్చుగానీ, అందరూ అలాగే ఉంటారంటే నే నొప్పుకో నసలు. గర్వం కాదనుకుంటే ఒకటి చెప్పాలని ఉంది.

సుబ్బు : మీకు గర్వమని నే నెప్పుడూ అనుకోను. ఆత్మవిశ్వాసాన్ని అర్థంచేసుకోలేని వారెవరో గర్వమనుకుంటారు. చెప్పండి లక్ష్మి !

లక్ష్మి : చిన్నతనం నుంచీ నేనో రకమైన పద్ధతిలో పెరిగేను. ప్రతి చిన్న విషయానికీ సిగ్గూ, బిడియమంటూ వొదుగుతూ కూర్చోడం నా అలవాటు లేదు. అల్లాగే మనసులోని మాట దాచుకుని పైకో విధంగా మాట్లాడ్డమూ చాత కాదు. మా నాన్నగారు మమ్మల్ని అలాగ పెంచారు. మాకై మేము ఆలోచించి నిర్ణయాలు తీసుకునేపాటి స్వేచ్ఛనీ యిచ్చేరు. గనక అర్థంలేని సిగ్గూ, భయం, గర్వం అనే పదాలకి నేను దూరంగా ఉంటూ వొచ్చేను. చర్చిలో మా చెల్లికి పెళ్లయింది. ఆ సాయంత్రం పార్టీ యిచ్చేరు చిన్నాన్న. ఆ పార్టీలో పాడమని నన్నడిగేరు. నా మూడ్సు బాగోలేదు. పాడటానికి మనసూ వొప్పుకో లేదు. పాడలేనన్నాను. అక్కడ్నుంచి ప్రారంభమైంది యుద్ధం. నాకు గర్వమన్నారు కొందరు. పాపం, సిగ్గేమో అనుకున్నారు మరికొందరు. నే నవేమీ పట్టించుకో లేదు. కానీ మా సిస్టర్ కళ్లల్లో నీళ్లు తిరగడం గమనించిన తర్వాత పాడాలనిపించింది. పిచ్చిది ! దాని సంతోషం కొరకు మా ప్రార్థనగీతం పాడేను.

సుబ్బు : (మధ్యలో కలగజేసుకున్నాడు) నాకూ వినాలని ఉంది. పాడరూ ?

లక్ష్మి : వొద్దులెండి. పాడటానికి వేరే చాలా పాటలున్నాయి.

సుబ్బు : కాదు. ఆ ప్రార్థన గీతమేదో పాడి వినిపించాల్సిందే.

లిల్లీ : (గోముగా అన్నది) ఊహూ .... పాడను.

సుబ్బు : (అతను లేచేడు. లిల్లీ దగ్గరగా వెళ్ళాడు) మీ ప్రార్థన గీతాలంటే నాకు చాలా ఇష్టం. జేడ్ అని నా స్నేహితుడు వాటిని చాలా చక్కగా పాడే వాడు. కోరి మరీ వినే వాడిని.

లిల్లీ : (అతని పారవశ్యాన్ని గమనించినట్టు నటించి అన్నది) నేనో కథ చెప్తాను గానీ, మీ రక్కడ కూర్చోండి ముందు.

సుబ్బు : (ఆమె కాస్త దూరంగా కూర్చోక తప్పిందికాదు.)

లిల్లీ : మీ సంగతేమో గానీ మా క్లాసులో జనార్దనరావని ఓకుర్ర వాడుండే వాడు. పాపం—నా పాటంటే చెవి కోసుకొనే వాడు. మా కాలేజీలో అప్పుడప్పుడూ నే పాడుతూండే దాన్ని. అతను ముందు వరుసలో కూర్చుని తలూపు తుండేవాడు. లేటెస్ట్ హిందీ సినిమాల్లోని బాగున్న మంచి పాటలు నానుంచి వినాలని అతని కోరిక. అతను తరచూ మాయింటి కొస్తుండేవాడు. వొచ్చిన ప్రతి సారీ యీ కోరికనే కోరేవాడు. ఎందుకో అతన్ని ఏడి పించాలనిపించేది. అత నెన్నిసార్లు కోరినా పాడేదాన్ని కాదు. ఒకసారి అతను ఎంతో ప్రాధేయపడి అడిగేడు— పాడేను. ఏం పాడేనో తెలుసాండి? మా ప్రార్థన గీతం. (నవ్వింది) అతను మొహం చిట్లించుకొని అడిగేడు 'లిల్లీ ! నామీద నీ కెందుకింత పగ ?'' అని. పైన ఇయర్లో అతను వాళ్ళింటికి వెళ్ళిపోతూ కనీసం ఒక చక్కటి తెలుగు పాటైనా వినిపించమని కోరేడు. జాలి వేసింది. అతని కోరిక తీర్చేను. ఇప్పటికీ అతను ఉత్తరాలు రాస్తూనే ఉంటాడు. ఆ పాట యింకా అతని చెవుల్లో రింగుమంటూనే ఉంటుందిట.

సుబ్బు : (కుతూహలం పెరిగింది) ఏం పాటది ?

లిల్లీ : వింటారా ?

సుబ్బు : యస్.

లిల్లీ : రికార్డు చేసుకొన్నాను. వినండి (ఆమె లేచింది. రికార్డర్ని అమర్చింది. ఆన్ చేసింది. ఆమె చెప్పినట్టే అందమైన తెలుగుపాట ఒకటి వినిపిస్తోంది. ఆవేళకి మంగపతి కుంటుకుంటూ వొచ్చేడు. పాటయ్యేంతవరకూ గుమ్మందగ్గరే నించున్నాడు. పూర్తయిన తర్వాత ఉత్సాహంగా చప్పట్లు చరిచేడు. లిల్లీ ఉలిక్కిపడి అతనివేపు చూసింది. రికార్డర్ని ఆఫ్ చేసింది. సుబ్బు [illegible] అలాగే ఉన్నాడు) [illegible]

మంగ : వెల్ .... నైస్ సాంగ్. బ్యూటిఫుల్. పాడింది మీరేనా మిస్ . . . . .

సుబ్బు : మిస్ లిల్లీ ! చాలా చక్కగా పాడగలరు.

మంగ : గ్లాడ్ టు సీ యూ మిస్ లిల్లీ! ఐ లైక్ దట్ సాంగ్ ఎండ్ ఐ లవ్ దట్ వాయిస్. ఎస్. ఇటీజ్ ట్రూత్.

(సుబ్బరాజు కేంచేయాలో తోచలేదు. గబగబా మంగపతి పక్కనే వొచ్చి నిలబడ్డాడు. ముందు తత్తరపాటు చెందినా తర్వాత సర్దుకున్నాడు.)

సుబ్బు : మంగపతి నా క్లాసుమేటు. గొప్ప జీనియస్. ఆ రోజుల్లో కవిత్వం రాసేవాడు. పిటీ ఏమిటంటే ఓ చిన్న షాకు తగిలింది—

మంగ : (ముందుకు పోతూనే ఉన్నాడు) వొంటికి తగిలితే నేను లెక్కచేసేవాడినే కాదు. మిస్ లిల్లీ, అది నా మనస్సుకి తగిలింది. గొప్ప ట్రాజెడీ.

సుబ్బు : (లిల్లీని సముదాయించబోయేడు) మీరేం భయపడొద్దు. మావాడు భావకవని చెబితినే, అంచేత మాటలు కొంచెం ముద్దుగా కనిపిస్తాయి.

లిల్లీ : (ధైర్యంగానే అనేసింది) ముద్దొచ్చే మాటలన్నా, మృదువైన మాటలన్నా నా కిష్టం. రండి మంగపతిగారూ! కూర్చోండి.

మంగ : (కూర్చోలేదు) థాంక్యూ. మీ పాటలో గొప్ప గ్లామరుంది. అతిత్వరలో పైకొచ్చేస్తారు. అయిదేళ్ల క్రితం సుబ్బరా జెవడు ? ఆఫ్టరాల్ నా మిత్రుడు. వాడి జాతకం మారి యిప్పుడు గొప్పవాడై వెలిగిపోతున్నాడు. మంగపతి అయిదేళ్ల క్రితం గొప్ప కవి. ఇప్పుడు మతిపోయి రోడ్లుచుట్టు కున్నాడని అంటుంది లోకం. కానీ, మిస్ లిల్లీ ! ఏదో నో రోజు యీ మంగపతి ఒక అద్భుతం చేసిపారేస్తాడు.

లిల్లీ : ముందు కూర్చోండి ప్లీజ్.

మంగ : నో ప్లీజ్. నేను నించునే మాటాడుతాను. (తన ఒంటి కాలు చూసుకున్నాడు) నేను కుంటివాడనని దిగులుపడ కండి మిస్ లిల్లీ—నా బతుకే కుంటి. రైల్లోంచి దూకి చచ్చిపోదామని అనుకున్నవాడు ఒక కాలు రైలు పెట్టెలో ఇరుక్కుపోవడం మూలంగా కుంటివాడి నయ్యాను.

లిల్లీ : (ఆశ్చర్యపోయింది) ఆత్మహత్యకి పూనుకున్నారా ?

మంగ : యస్. హత్య చేయడం చాతకాని వెధవేం చేస్తాడు? ఓవేళ హత్యచేయాలని ఉన్నా ఎంతమందిని చేస్తాను ? నా బతుకుని తిన్న పాపాత్ము లెంతమందిని చంపేది?

సుబ్బు : (గాభరాపడిపోయేడు. ఏం చెప్పాలో వెంటనే తోచక ఆపే శాడు) బాగా ఉన్న కుటుంబంలో పుట్టేడు. ఆస్తి అన్యాయంగా పరులపాలై పోయింది.

మంగ : పోరా ! పెద్ద చెప్పొచ్చావ్. నేను ఆస్తికోసం కాదురా ఏడుస్తు. (గబగబా వొచ్చి లిల్లీ పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు) మిస్ లిల్లీ ! మీ రెవర్నయినా ప్రేమించేరా?

లిల్లీ : లేదు.

మంగ : మన బుధులేం చెప్పారు ? కవిత్వం రాసేవాడు ప్రేమి స్తాడు. కవిత్వం రాసి ప్రేమించేవాడు ప్రేమలో ఫెయిలవుతాడని కదూ ! కవిత్వం రాశాను. నాలుగైదు సన్మానాలు జరిగేయి. ఇప్పుడు ఈనాడు సుబ్బరాజుకి సన్మానం జరుగుతుందంటే నేను ఆశ్చర్యపడను. ఇది నాకో లెక్క కాదు. చదువుకునే రోజుల్లోనే పెరిగి పోయేను. నన్ను ఆకాశాని కెత్తేశారు. (అకస్మాత్తుగా అతని కళ్లల్లో నీళ్లు తిరిగేయి) కానీ .... మిస్ లిల్లీ ... జనం చేస్తున్నది తమాషా అని నా కప్పుడు తెలిసింది కాదు. తెలిసొచ్చిన తర్వాత తలుచుకుని ఏడవడం మాత్రం తెలుస్తోంది.

సుబ్బు : పోనీలే మంగా ! రాత్రంతా రాసుకోడంలోనే గడిపేవు. ఇంక పోయి నిద్రపో.

మంగ : (సుబ్బరాజువేపు అమాయకంగా చూసేడు) ఒరే రాజా, అమాటనడానికి నీకు నోరెల్లా వొచ్చిందిరా? నన్ను నిద్రపొమ్మంటున్నావ్ ? మన బుధులేం చెప్పారు, నిరంతరం వ్యథలో కుస్తీలుపట్టే జాతకుడికి నిద్ర రాదు. వొస్తే అది 'చావు' అని కదూ చెప్తే.

లిల్లీ : చూడండి మంగపతిగారూ ! మీరిలా కృంగిపోతే లాభం లేదు. ముందు మీకు మంచిరోజు లున్నాయి. వాటి కోసమైనా మీరు ఆశని పెంచుకోవాలి.

సుబ్బు : అదేనండీ నేనూ చెప్తున్నది.

మంగ : వీడు .... వీడేం చేశాడో తెలుసాండి ! వీడు తీయబోయే సినిమాకి నన్ను కథ రాసిపెట్టమన్నాడు.

సుబ్బు : (భయంవేసింది) మంగా ! ఇప్పు డవన్నీ ఎందుకులేరా.

మంగ: తప్పేముందిరా ! మన మధ్య జరిగినవన్నీ చెప్పేస్తాను. పైగా లిల్లీగారు పరాయివారు కాదాయె. మిస్ లిల్లీ, ముందు నన్ను క్షమించాలి. రాత్రి పగలూ అనే వ్యత్యాసం లేకుండా కష్టపడి ఓ మహోత్తరమైన నవల రాస్తున్నాను. ఇప్పుడే, మీ రొచ్చేముందు— కొంచెంగా—యువ్.... వెరీ లిటిల్ క్వాంటిటీ ఆఫ్ ...

లిల్లీ : (నవ్వేసింది) నా కేం అభ్యంతరం లేదు. ఇంతకు ముందు సుబ్బరాజుగారితోనూ అదే అన్నాను.

మంగ : దట్స్ గుడ్. నేను రాస్తున్న నవలని సినిమాకి ఉపయోగిస్తా నంటాడు సుబ్బరాజు. అది నా కిష్టం లేదు. నేను రాసేది నిర్మొహమాటంగా, ముక్కు మీద కొట్టినట్టుగా ఉంటుంది. వాస్తవికానికి ప్రాణం పోస్తానని గర్వం నాకు. ఇలాంటి కథని సినిమాలో ఇమిడ్చడం సాహసం. అథవా చిత్రుడనే గొంపం కొద్దీ ఆ సాహసం సుబ్బరాజు చేయగలిగితే, మీకు చెప్పేదేముంది—ఉన్న పేరు కాస్తా ఊడిపోతుంది. 'ఇటీజ్ డ్యూ టూ యూ వోన్లీ మిస్టర్ మంగా' అని నన్ను సుబ్బరాజు మాటనేస్తాడు. అది సహించలేను.

(మంగపతి ఉత్సాహం చంపడానికి ఇష్టంలేకా, అతన్లో కలుగుతున్న ఈ వింత పంచేనాన్ని గమ నించాలనే కుతూహలంకొద్దీ సుబ్బరాజు మౌనం వహించేడు. నోమాలంగా కూర్చుని వేళ్లు లెక్కపెట్టుకుంటున్నాడు. లిల్లీకి మంగపతి మాటలు నచ్చేయి. అతను చెప్పేది నిజమనే భావిం చింది. పైగా ఓ పక్క సుబ్బరాజు అతన్ని సమర్థించడంతో ఆమె మంగపతిని పూర్తిగా నమ్మింది. అందుచేతనే అన్నది.)

లిల్లీ : మీ రింతగా చెబుతూంటే మీ నవల్లోని కథవినాలని పిస్తోంది. చెబుతారా ?

మం : మన బుధులేం చెప్పారు మిస్ లిల్లీ ! వాక్యం రసాత్మకం కావ్యం అని కదూ— నా నవల్లోని ప్రతి వాక్యమూ ఒక కావ్యము. నే నేదో గొప్పలు చెబుతున్నానని అభి ప్రాయపడకండి.—నిజమే చెప్తున్నాను. నా రచనల్లో గొప్ప అనుభవం కళ్లకు కట్టినట్టు కనిపిస్తుంది. ఓ చిన్న ఉదాహరణ చెప్పేదాండి; నాలుగేళ్ల క్రితం ఓ రచన ప్రారంభించేను. దాదాపు నాలుగొందల పేజీల రచనని తొంబయ్యోపేజీలో స్వస్తి చెప్పేను!

(లిల్లీ సుబ్బరాజూ ఇద్దరూ నిశ్చేష్టులైపోయేరు. మంగపతి ఇంత అందంగా అబద్ధం చెప్పగలడనే విషయం సుబ్బరాజుకిప్పుడే తెలుస్తోంది. మంగపతి సంగతి అర్థంకాని లిల్లీ నేలా సముదాయించాలో కూడా మరిచి మంగ పతి చెప్పే అందమైన అబద్ధానికి చెవి ఒప్పగించేడు.)

మంగ : అప్పుడే మీ రిద్దరూ ఆశ్చర్యపోతున్నారు. (నవ్వేడు. పేల వంగా నవ్వగా) ఆ రచనలో ఒక అబ్బాయికి జీవితం

మీద విరక్తి కలిగి ఉత్తర దేశయాత్ర సాగిస్తాడు. కథ కిది అప్రధానమైన మలుపు! నే నెప్పుడూ ఆ దేశం చూడలేను. చూడనిదాన్ని గురించి ఊహిస్తే రాయను. అందుచేత డెబ్బయి మూడో పేజీతో ఆ రచనని ఆపేను.

లిల్లీ : వండర్‌ఫుల్ ! మీలాటివారితో నాకు పరిచయం కలిగినందుకు సంతోషంగా ఉంది.

మంగ : (చేతులు రెంటినీ ముఖం మీదికి చేర్చుకున్నాడు) వొద్దు లిల్లీ ! వద్దు. నే నుత్త అభాగ్యుణ్ని. నాతో పరిచయం దారుణం. పరిచయమున్న చాలామంది ఈ రిమార్కే పాస్ చేశారు !

(లిల్లీ సుబ్బరాజు వేపు చూచింది. సుబ్బరాజు దిగులుగా నోరు చప్పరించేడు. అంతలో వెయిటర్ వచ్చేడు.)

వెయి : సార్! మీ కోసం డిస్ట్రిబ్యూటరుగారట, ఆయ వొచ్చారు సార్ !

సుబ్బు : (ఉలిక్కిపడి లేచేడు) రమ్మను. కిందున్నారా ?

మంగ : (డిస్ట్రిబ్యూటర్ పేరు వినగానే అతని కోపం కళ్లల్లో తొణికిసలాడింది) ఆగు. వా డెక్కడున్నాడో చెప్పు. ఉహూ— అది కాదు. వాడితో 'నిన్ను మంగపతిగారు చూడాలనుకుంటున్నారు' అని, రమ్మను. నన్ను ఏద్దేనా చేయిస్తాడూ !

లిల్లీ : (భయపడింది) మంగపతిగారూ !

మంగ : మీకు తెలీదు మిస్ లిల్లీ ! దయచేసి మీరు మాటాడకుండా కూర్చోండి.

సుబ్బు : నోరేయ్ మంగా ! నువ్వు లిల్లీగారితో మాటాడుతూండు. నేనే వారిని తీసుకొస్తాను. సరేనా ? (వెయిటర్‌తో) పదవోయ్ నేనూ వొస్తున్నాను.

(ఇద్దరూ కలిసి వెళ్లిపోయేరు.)

మంగ : ఈ డిస్ట్రిబ్యూట రున్నాడు చూశారా ! నొట్టి ఫూల్. అధికారాన్ని వాడి బావమరిది కిచ్చేడు. వాడొక రాస్కెల్ ఏమిటో మా రాజుకి వీళ్లంటే లగని గౌరవం, భయంనూ. ఎందుకో నా కర్థం కావడంలేదు మిస్‌లిల్లీ!

లిల్లీ : డిస్ట్రిబ్యూటరు మిమ్మల్నేం అవమానపరిచారని మీకింత కోపం !

మంగ : (కాసేపు ఆలోచించేడు.) వొద్దులెండి. మీరది వినలేరు.

లిల్లీ : కాదు చెప్పండి.

మంగ : నామీద అధికారం చేయడం సుబ్బరాజుకే చాతకాదు. కానీ .... మీ రెందుచేతనో నన్ను ఆకర్షించేరు. పరిచయమైన పది నిమిషాల్లో నాకు ఆత్మీయులై పోయారు. నేను చెప్పున్నది చస్తే చెప్పను. 'మీరు' చెప్పమని అడిగేరు గనుక చెప్తేస్తున్నాను. ఈ విషయం మీ మనసులో దాచుకోండి మిస్ లిల్లీ ! నేనా మధ్య ఒక కథ రాశాను. అదే కథని యీ డిస్ట్రిబ్యూటరు బావమరిది రాసే ప్రయత్నంలో ఉన్నట్టు తెలిసింది. స్నేహితం నటించి యింత మోసం చేయబోతున్నాడంటే నాకెలా ఉంటుందో ఊహించండి. సుబ్బరాజుకి చీమ కుట్టినంతైనా చింతలేదు. వాళ్లిప్పుడు రాయబారాలూ, క్షమాపణల్లోకి దిగేరు. అంతమాత్రానికే క్షమించేయడమేనా ? నాన్‌సెన్స్. ఈ లోకంలో నమ్మదగ్గ వ్యక్తి (వేలుతో చూపించేడు) ఒక్కటూ కనిపించడంలేదు. (మళ్లా ఆ వేలుని చేత్తో మూసేడు.) ఎక్కడ చూసినా దగా, మోసం. నా కిప్పుడు ఏమనిపిస్తుందో తెలుసా మిస్ లిల్లీ !

లిల్లీ : చెప్పండి. మీరేం చెప్పినా వింటాను.

మంగ : నా మనసు నర్థంచేసుకుని, ఆదరణ చూపించి, నన్ను ఓదార్చి నాకో నవోత్సాహాన్ని ప్రసాదించే స్నేహం కావాలి. దాని వెనక స్వార్థం కూడదు. నన్ను పెంచి వాళ్లు బాగుపడాలనే ఉద్దేశం కూడదు. అలాటి స్నేహం యీ జన్మకి దూరం కాకూడదు. చెప్పండి లిల్లీ ! ఆ నేస్తం నా కెక్కడ దొరుకుతారు ? (అతని గొంతు రుద్ధమైంది) అందరూ ఉన్నా ఎవరూ లేని వాడిని, అన్నీ ఉన్నా ఏమీ లేని వాడిని. పైగా (కాలు చాచుకున్నాడు) కుంటివాడిని. నన్నాదరించేవాళ్లెవరు? ఎవరు.

లిల్లీ : (కరిగిపోయింది) మీకేం లోటు ? యువకులు, భావకవులూ—

మంగ : (అతను అల్లిన కథని కాసేపు మరిచి, నిజ జీవితం లోని లోటు చెప్పాలని ప్రయత్నించేడు.) రోజూ దిగులుతో చస్తున్నాను. నా గోడు నాకే అర్థంకాదు. జీవితంలో ఏదో పోగొట్టుకున్నాను. నా కేదో కావాలి ఐ వాంట్ సంథింగ్. అదేమిటో సరిగ్గా చెప్పలేను. మీరైనా .... ప్లీజ్ లిల్లీ ! మీరైనా చెప్పగలరా ?

లిల్లీ : (తన చేత్తో మెల్లిగా అతని భుజాన్ని తట్టింది. అతను తలెత్తి లిల్లీ కళ్లల్లోకి చూసేడు) భయపడకండి. మీకు మంచిరోజులొస్తాయి.

మంగ : నిజం చెప్పేస్తున్నాను లిల్లీ—మీ కళ్లని చూస్తూ వాటి హెచ్చరికని భరిస్తూ అబద్ధం చెప్పలేను. నాకు

తాగడం అలవాటు లేదు. విశాఖపట్టణంలో తాగి ఏడ్చేను. ఈనాడు సుబ్బరాజుని కలుసుకుందామని వొచ్చి తాగేను. మళ్లీ ఏడుపొచ్చేస్తోంది. మీతో ఏమి టేమిటో చెప్పానని ....

లిల్లీ : ప్లీజ్ ! నాగురించైనా మీరు మనసు పాడుచేసుకోవద్దు. (అతని చేతులు పుచ్చుకుంది.) ఇంతకుముందు మీరు ఉత్సాహంగా మాటాడేరు. ఇప్పుడూ అలాగే మాటాడండి.

మంగ : మీ చల్లని చేతి స్పర్శ ! అమృతంలాంటి మీ మాట నన్నేదో లోకానికి తీసుకుపోతున్నాయి. ఇప్పుడు నాకు తెలిసొచ్చింది. నా జీవితంలో ముఖ్యమైన లోటేమిటో మీ రిప్పుడే చెప్పారు. ట్రూత్ లిల్లీ !

లిల్లీ : థేంక్యూ.

మంగ : కానీ, కాసేపటికి మీరు వెళ్లిపోతారు. రేపు సుబ్బరాజుకి సన్మానం జరిగిన తర్వాత, అతనూ మదరాసులో ఉంటాడు. మిగిలేది నే నొక్కణ్ణి. ఈ ఒక్కడిపైనా దయలేని మనుష్యుల దాడులు. నలిగిపోతున్నాను. విసుగు పుట్టుకొస్తోంది. (సడన్‌గా అతన్లో మార్పేదో కలిగింది) అబ్బ .... నా తల తిరిగిపోతోంది. నన్నా గది లోకి తీసుకెళ్లరూ .... నిద్రలాటి మత్తు. నడిచే ఓపిక లేదు. కుంటివాడిని. కొంచెం సాయం చేయరూ మిస్ లిల్లీ—

లిల్లీ : (లేచింది) రండి. (అతన్ని పట్టుకు నడిపించింది) మెల్లిగా నడవండి.

(అతన్ని లోపలి గదిలోకి తీసుకెళ్లింది. ఆవొక్కర్తె వచ్చి, టేప్ రికార్డర్ను తీసుకుని, లైటాఫ్ చేసి వెళ్లిపోయింది. నిశ్శబ్దంగా ఉండిపోయింది కాసేపు. ఠాణాలో ఆరు గంటలు మోగింది. అది ఉదయం. మెల్లిగా ఆగదిలోకి వెలుతురొచ్చింది. బైటనుంచి సుబ్బరాజు వచ్చేడు. అతనొచ్చేవేళకి మంగపతి కళ్లు నులుపుకుంటూ రావే వొచ్చేడు. సుబ్బరాజుని చూచి ఆగి పోయేడు. ఇద్దరి మధ్యా కాసేపటి వరకూ మాటలు లేవు. చివ రికి నసుగుతూ మంగపతే అన్నాడు.)

మంగ : క్షమించరా రాజూ ! అల్పుడ్ని. మాటల్లో పెరిగి పెద్ద వడన్నై .... పెద్దరికాని కొచ్చే గర్వంతో .... ఛీ .... తాగకుండా ఉన్నా పోయేది. రాత్రంతా హంగామాలో హడలుకొట్టేను. కదూ ! నీ మనసూ నొప్పించెను. అవునా ? (సుబ్బరాజు మాటాడలేదు. అలాగే నించుండి పోయేడు) పాపిష్ఠివాడిని — ఉచ్చమూ, నీచము తెలీక పిచ్చిగా వాగేశాను. ఒరేయ్ .... నేనంత తాగి కూడా నేనేం మాటాడుతున్నానో గుర్తుపడుతూనే ఉన్నాను .... కానీ .... కంట్రోలు చేసుకోలేక పోయేనురా. పాపం లిల్లీగారు నాగురించేమనుకున్నారో. మత్తులో ఉన్న నన్ను ఆ గదిలోకి తెచ్చి, పడుకోబెట్టి వెళ్లి పోయేరు. నా మూలంగా నీకూ అప్రతిష్ఠ. క్షమించరా రాజూ. (సుబ్బరాజు శిలావిగ్రహంలా నించునే ఉన్నాడు. చూపు ఎక్కడో నిలిపేడు. నోరు విప్పనూ లేదు. నించున్నచోట నుంచి కదలనూ లేదు. అతని వాలకం చూచి మంగపతి ఖంగారుపడ్డాడు.) తలొంచు కుని అన్నాడు) ఒరేయ్ .... మాటాడరా .... ప్లీజ్ .... నువ్వు నాకే సాయమూ చేయకు. డిస్ట్రిబ్యూటరు బావమరిదిని అవమానించను. సరేనా .... మాటాడు. 'ఒరే మంగా ! నువ్వెత్తు ఖోలువిరా. నువ్వంటే నాకు జాలిరా' అని అను. చాలది. అనరా రాజూ. అను. (కోపం వచ్చింది. గట్టిగా అరిచాడు) ఏంరా మాటాడవు. మాళ్ళా మందేమైనా పుచ్చుకున్నావా ? లేక మతేమైనా పోయిందా ? ఏమిట్రా యిది. (ఆ కోపానికి తనే సిగ్గుపడి పోయేడు. రెండుసార్లు గదిఅంతా తిరిగేడు. మెల్లిగా అన్నాడు.) నిజమే— నే చేసింది తప్పే. ఒప్పు కున్నాను. కానీ, దీన్లో నీ తప్పేముంది. 'తాగాలని ఉంద్రా మంగా, అవుతే తాగు' అని నా చేత ఎందుకు తాగించేవ్. సరి. తాగాను. పిచ్చిగా మాటాడుతూంటే నా నోరెందుకు మూయించలేదు. మంగినపూడిరేవులో నా తలని నీట్లో ముంచగలిగినవాడికిదేం బ్రహ్మవిద్య కాదే! పైగా—అప్రతిష్ఠ్యంలో కృంగిపోతున్న నా ఎదుట ఆకాశమంత నిచ్చెన పెట్టావ్. వొళ్లు మరిచి గబగబా ఎక్కేను. ఇది నా తప్పా ? (రాజుని పట్టుకు కుదిపేడు) చెప్పరా. చెప్పు. (తర్వాత ఏం చేయాలో తోచలేదు. వచ్చి సోఫాలో కూర్చున్నాడు. మొహాన్ని చేతుల్తో రుద్దుకున్నాడు. మళ్లా లేచేడు. రాజుకి దగ్గరగా వెళ్లేడు) ప్లీజ్ .... ఇప్పుడు నీ మనసేమీ బాగోలేదు కాబోలు. నీ సన్మానం పూర్తయిన తర్వాత, నన్ను క్షమించాలన్న దయ కలిగితే ఒకసారి నన్ను చూచి పో... (గొంతు రుద్ధమైంది) అవసరాలవారి వీధిలో కన కమ్మ గారిల్లు తెలుసుగా, వారింట్లో మకాం పెట్టాను. తీరుబడైన తర్వాత వచ్చి వెళ్లు. నేను నీ మిత్రుడ్ని. నీ నీడలాటి మనిషిని. రాత్రి జరిగింది మరిచిపో. పార్డన్ మీ ! నీ మెర్సీ కోసం కాదురా ప్రాధేయపడుత !

నన్ను అసహ్యించుకోవద్దనీ, నన్ను మంగపతిలానే చూడమని. (వెళ్ళిపోతూ అన్నాడు) చాలామంది నన్ను అల్లరి పెట్టేరు. దూరం చేశారు. నువ్వు మాత్రం అలా చేయకు. చిరకాలమిత్రుడ్ని కలుసుకుని వాడిచాత 'వెధవ' అనే ముద్ర వేయించుకునే దౌర్భాగ్యం నాకు వొద్దురా రాజా! వొద్దు. శెలవు. (రెండు చేతులూ జోడించిమరీ వెళ్ళిపోయేడు.)

(క్షణం తర్వాత సుబ్బరాజు కదిలేడు. గుమ్మం వరకూ వెళ్ళి వచ్చేడు. సిగరెట్టు ముట్టించేడు. రెండు దమ్ములు పీల్చి కాలి కింద పెట్టి నలిపేడు. అప్పటిగ్గాని అతని నోటినుంచి మాట పెగల్లేదు. అదీ ఆరోజు జరుగబోయే నాటకోత్సవాలకు హాజరైన ప్రేక్షకుల్ని ఉద్దేశింపబడిందేను.)

సుబ్బు : నేను వూరొచ్చింతర్వాత చాలామంది మేము తీయబోయే మా నాలుగో చిత్రం గురించి వివరాలడిగేరు. ఎవరికీ పూర్తి వివరాలు చెప్పనే లేదు. కథ కొత్తదనీ, నటుల ఎన్నిక ఇంకా జరగలేదనీ మాత్రమే చెప్పేను. ఇప్పుడు ఇక్కడ ఇంతమంది మహాశయుల సమక్షంలో మా చిత్రం తాలూకు ముఖ్యమైన విషయం ఒకదాన్ని చెప్తున్నాను. రాత్రి హోటల్లో నా గదిలో జరిగిన సంఘటన నన్ను ఉత్తేజ పరిచింది. దాన్ని మా కొత్త చిత్రంలో ఓ మహత్తరమైన సన్నివేశంగా తయారు చేయగలనని నమ్ముతున్నాను. ఈ చిత్రంలో కథ నాయకుడు కుంటివాడు. ఆశ్చర్య పడక్కర్లేదు. అతను నిజజీవితంలో గూడా కుంటి వాడే. అతను మునుపెన్నడూ ఏ సినిమాలోనూ నటించ లేదు. అతను నా ప్రాణమిత్రుడు. నన్ను కలుసుకునే నిమిత్తం రాత్రి నా గదికి వచ్చేడు. ఆతిథ్యం ఇచ్చాను. నా అతిథి పైన ఓ చిన్న ప్రయోగమూ చేశాను. దాని ఫలితం నన్ను గొప్పగా ఇన్స్పైర్ చేసింది. (ఫోన్ మోగడంతో అతను చెప్పబోయే దానికి ఆటంకం కలిగించింది. మూడ్ చెడిపోయింది. క్షణంపాటు విసుగ్గా మొహం పెట్టేడు. తర్వాత ఫోన్ అందుకున్నాడు—)ఎ యామ్ సుబ్బరాజు.... హలో మిస్. లిల్లీ! గుడ్‌మార్నింగ్. వెరీ గుడ్‌మార్నింగ్. యస్. ఇప్పుడే వెళ్ళిపోయేడు......అతని గురించా.......ఓకె..... అంతా చెప్పేస్తాను. కానీ కొంచెం ఓపిక పట్టండి. సాయంత్రం కలుసుకుందాం గదా. యస్.....దట్సాల్‌రైట్. ఓకె (ఫోన్ పెట్టేడు. సిగరెట్టు ముట్టించి సోఫాలో చేరగిల బడి తలని అందంగా ఊపుకుంటూ, ముచ్చటగా అన్నాడు) లిల్లీ!......రి యల్లీ ఎ స్వీట్ నేమ్......



# సైరంధ్రి*

## శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

* విమర్శను కోరుతూ గ్రంథములు పంపినప్పుడు విమర్శ కొంత అనుకూలంగాను ఉండవచ్చు. కొంత ప్రతికూలంగాను ఉండవచ్చు. దీనికి గ్రంథకర్తలు సహజంగా సిద్ధపడి ఉండాలి. అందువల్ల గ్రంథ విమర్శల ప్రతి విమర్శలను ప్రచురించ సాధ్యముకాదు. విమర్శలో గ్రంథములోని విషయాలను తప్పుగా పేర్కొనుట జరిగిన, వాటిని గ్రంథకర్త చూపవచ్చును; వాటిని ప్రచురించగలము.

దీనికి అనుగుణంగా లేకపోయినా "సైరంధ్రి" పైన విమర్శలను విమర్శిస్తూ శ్రీ కొత్త సత్యనారాయణచౌదరిగారు వ్రాసినది, దానికి శ్రీ శాక్యసింహగారు వ్రాసిన సమాధానము ప్రచురిస్తున్నాము. కారణాన్ని పాఠకులు సులభంగా గ్రహించుకొనగలరు.

—సంపాదకుడు.

ఈ నవంబరు 'భారతి'లో నా వ్రాసిన 'సైరంధ్రిని' గూర్చి 'శాక్యసింహ' నామధేయుని వ్రాతలు చదివితిని. విద్యా విధానమునుగూర్చి 'శాక్యసింహ' చేసిన శాఖా చంక్రమణమును గూర్చి తరువాత చూతము.

'సైరంధ్రి'లో దుర్యోధనునిగూర్చి నేను చూపిన భావములు మూలకథకు అతుకవనియు, దుర్యోధనుని పొగడిన ధర్మజుని క్రిందు పఱచిన మెచ్చుకొనువారికొఱకు వ్రాసిన వ్రాతలనియు 'శాక్యసింహ' తీర్పు చెప్పెను. ఈ దుర్యోధనుని పరిపాలనా ప్రస్తావము, తిక్కయజ్వ కవితా రీతిని విడంబించుటకు ఆటంకమగునని ఈ విమర్శకుని భావము. కథా విధానములో అచ్చముగా నేను తిక్కయజ్వ త్రోవలో నడచితినని ఈ 'శాక్యసింహ' కెవరు చెప్పిరి! పాత్రౌచిత్య—రసపోషణము—కవితా వైఖరి ఇత్యాద్యంశములలోనే తిక్కయజ్వను అనుసరించినంతమాత్రాన, కథా కథనములో ప్రాచీన కవులు గైకొన్న ఇతివృత్తమును గ్రహించినంతమాత్రాన ఈ రచనకు 'శిల్పదోష'ము ఎట్లగునో నా కర్థము కాలేదు.

అది యొక దోషమనియు ఆ దోషము ఈ వ్రాతలో ఉండరాదనియు శాసించుటకు ఈ 'శాక్యసింహ'కు ఏయాలంకారికుడు అధికారమిచ్చెనో తెలిసికొనవలసి యున్నది. దుర్యోధనుని తెగడి ధర్మజుని పొగడినవారి పొగడ్త కోసమే ఇట్టి వ్రాత 'శాక్యసింహ' వ్రాసెనని చెప్పవచ్చునా! దుర్యోధనుని పరిపాలనగూర్చి భాసునివంటి దృశ్య కావ్యకర్తలుగాని 'భారవి' వంటి శ్రవ్య కావ్య కర్తలుగాని సంస్కృతములో, తెలుగులో ఎందరో వ్రాసియుండుట రవ్వంత మూచూచియున్నను ఈ విమర్శకుడు ఈ వ్రాతకు ఉపక్రమించడు. తిక్కన శిల్పమునే తీసికొని, సంస్కృతాంధ్ర కావ్యములలోని భారత గాథలో వర్ణించిన అంశములను యథోచితముగ విభావించుచు 'సైరంధ్రిని' చిత్రించుటయే నా సంకల్పము. అరణ్యవాసములో వార్తాహరులవలన దుర్యోధనుని పరిపాలనముగూర్చి విని ధర్మజుడెంత బాధపడెనో ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథములను, తెలుగులో ప్రసిద్ధ విమర్శకుల విమర్శనములు చదివినవారికి అర్థమగును. కథలో, విమర్శకునకు తెలియని అంశము లున్నంతమాత్రాన 'సైరంధ్రికి' శిల్పదోషము అంటగట్టుటలో అర్థములేదు.

దయచేసి ఇట్టి రచనలు విమర్శించు ఘట్టములో పూర్వాపరములు పరిశీలించి ప్రాచీన సంస్కృతాంధ్ర కవుల బాటలను పరికించి విమర్శమునకు ఉపక్రమింపవలయుననియు ఈ త్రోవలో భారతి సంపాదకులును పుస్తక విమర్శలలో రచయితలకు న్యాయము చూపింపవలెననియు ఈ రూపముగ కోరుచున్నాను.

# సమాధానము

"మూలకథ కతుకని భావము లివి. దుర్యోధనుని పొగడిన ధర్మజుని క్రిందు పఱచిన మెచ్చుకొనువారికొఱకు వ్రాసిన వ్రాతలివి. గ్రంథాదినిగల ఈ దుర్యోధన వర్ణనము కావ్య శిల్పమునుబట్టి చూచిన అక్కఱకు రాని యట్టిది. విరాట పర్వకథ యందలి దుర్యోధనుని చిత్త ప్రవృత్తితో పొత్తు పొందికలు లేనిది. తిక్కన విరాట పర్వ కథారంభమున జనమేజయునిచోట "మహిత సముజ్జ్వలాకృతు"లను పద్యమును పలికించెను. కావ్య "కళావిదు"డయిన తిక్కన ఆ పద్యమున

పాండవులు కుపయోగించిన విశేషణములన్నియు కావ్య శిల్పమునుబట్టి సార్థకములయినవి. అట్టి పాండవులజ్ఞాతవాస మెట్లొనర్తురు? అని జనమేజయుని ప్రశ్న. కథలో సర్వ వర్ణనములు కథోపయోగ కారకములై యుండవలయును. అట్లుండనిచో శిల్పదోషమే యగును. అట్టి దోషము 'తిక్కయజ్వ కవితా రీతిన్ విడంబించు వ్రాతలో నుండరాదు.'

ఇవి నేను వ్రాసిన వాక్యములు. "సైరంధ్రి" వచన కావ్యమును సమీక్షించునపుడు, తత్కావ్య ప్రారంభమునగల దుర్యోధన ప్రశంస కావ్య శిల్పమునుబట్టి దోషమని పై రీతిగా వ్రాసితిని. కవిత్రయమువారు వ్యాస భారతమునకు కావ్యత్వము కల్గించిరని చౌదరిగారికి తెలియును. తదితర లక్షణము లెట్లున్నను "అవి యున్నియు నొక ఎత్తుగా—కావ్యత్వ మొక ఎత్తుగా మనము భావింపవచ్చును. అందును కళావేత్తయైన తిక్కన—ఈ మహా కావ్యము వలననే "కవి బ్రహ్మ" పద వాచ్యుడయ్యెను" అని వారే వ్రాసిరి. "నేటి కుట్టికాలు" 'కవిబ్రహ్మ కావ్య ప్రతిభ నని చూడుము—ఆ పలుకుబడులే—ఆ వాక్య విన్యాసమే యున్నదిని జూపి "పద విన్యాసములో భావ ప్రకటనలో విషయ సమన్వయములో ఒక క్రొత్తదనము బొడగ" వారి "సైరంధ్రి"ని రచించిరి. ఇంకొక ముఖ్యాంశము గలదు. తిక్కన కావ్యప్రతిభ విద్యార్థులకు తెలియునట్లుగా చౌదరిగారు "సైరంధ్రి"ని రచించిరి. ఆ కావ్య ప్రతిభ గ్రంథమిందినట్టి దీనిలో పూర్ణముగా ప్రతిబింబించినదా? ఖండముగా ప్రతిబింబించినదా? యనునది వేఱుమాట. తిక్కన కావ్య ప్రతిభ తెలియజేయుటయే చౌదరిగారి లక్ష్యము. అందుచే "సైరంధ్రి"యు వచన రూపమునయున్న కావ్యమగుచున్నది. వచన కావ్యమగు దీనిని కావ్య శిల్ప ధర్మమునుబట్టియే నేను సమీక్షించితిని. ఈ వచన కావ్యాదిని ప్రతి నాయకుడగు దుర్యోధనుని ప్రశంస యుండుట దోషమని నాకు తోచినది. అదే నేను వ్రాసితిని. దీనిగూర్చి తరువాత చెప్పెదను.

కావ్య శిల్ప దోషమును వివరించుటకు ఆలంకారికుల నుండి యధికారము నొక్కదానినే పొందుట, ఆ యధికారముతోనే విమర్శకు పూనుకొనుట తగదనియే నా యభిప్రాయము. ఆలంకారికులనుండి సంక్రమించిన యధికార మొక్కటే విమర్శకు చాలదు. దీనితోడు మఱియొకటి కావలయును. అదే సాహిత్య పరిణామమును గుర్తించు తెలివిడి. అధికారము పొందుటయేగాక సాహిత్య పరిణామమును గూర్చియు జ్ఞాన మార్జింపవలయును. ఆలంకారికులు కావ్యమును గూర్చియు, కావ్యగతాంశములను గూర్చియు ఎంతో లోతుగా చర్చించిరి. కాని ప్రాచీనాంధ్ర సాహిత్య పరిణామ మెట్లున్నది? ఏవి కావ్యము నందుండవలయునని యాలంకారికులు చెప్పిరో యవి యున్నియు లేకపోవుటయు, ఏవి యుండగూడదని చెప్పిరో యవియెయుండి సహృదయ రంజనము చేయుటయు ప్రాచీనాంధ్ర సాహిత్యమునందు సంభవింపలేదా? అందాక యెందులకు? ఆలంకారికుల ప్రకారము దోషములైన, యశ్లీలార్థ ద్యోతకములైన సంధులు తిక్కన మహాభారతము నందే యున్నవే. ఉపాఖ్యాన విషయమున తిక్కన్న, పెద్దన్న ఆలంకారికుల కేమి సమాధానము చెప్పగలరు? వారి కావ్యములను విమర్శించునపుడు ఆలంకారికులనుండి విమర్శకుడు పొందు అధికారము ఏమగుచున్నది? విమర్శ వ్రాయునపుడు ఆలంకారికుల మాటల కెంత విలువ నిత్తుమో, యంతే విలువ సాహిత్యమునందలి కావ్యముల పోకడకు నీవలయును. ఆలంకార శాస్త్రమునే ప్రమాణముగా తీసికొన్నచో ప్రతి కావ్యము దోషమయమే యగును. శాస్త్రమొక భూతమని మహర్షి యరవిందుడు చెప్పెను. కేవలము ఆలంకారికుల నుండి సంక్రమించిన యధికారమునే యనుభవించుచు కావ్య విమర్శకు పూనినచో ఏ ఫలము సిద్ధించునో చౌదరిగారికి తెలియనిదిగాదు. ఆలంకార శాస్త్రము తర్కములో నోరు మూయించునేగాని హృదయమును గెల్వనొప్పలేదు. సాహిత్య ప్రయోజనము ఆనందము. ఈ యానందము సమృద్ధిగా లభించినాడు ఆలంకారశాస్త్రము ప్రకార మొకటి రెండు దోషములున్నను మనమెంచుకొనిపోవలసినదేమియు నుండదు. ఆలంకారశాస్త్రమును తృప్తిపఱచు కావ్యములు రసానంద మొసగునని నిశ్చయముగా చెప్పలేము. బుషికల్పులగు ఆలంకారికులు త్రికాలా బాధితములగు పరమ సత్యములు చెప్పిరి. అది నాకును తెలియును. విమర్శకు ఆలంకారికులు ప్రసాదించు అధికార మొకటియే చాలదని నా మనవి. లక్షణ మెంత ముఖ్యమో లక్ష్యము నంతే ముఖ్యము.

సత్యనారాయణచౌదరిగారు వ్రాసినది విరాట పర్వ గాథ. వారనుసరించినది తిక్కన విరాట పర్వమును. విరాట పర్వాదులను ప్రబంధములనగా తిక్కన తీర్చిదిద్దెను. తిక్కన్న కావ్య ప్రతిభ—అది ఎంతయేయైన గానిమ్ము—ప్రతిబింబించునట్లుగా వ్రాసిన వచన కావ్య ప్రారంభమును తిక్కన మహాభారతారంభమునుబట్టియే నేను సమీక్షించితిని. దీనిలో దోషమేమున్నదో నా కర్థము కావుటలేదు. తిక్కన విరాట పర్వ కథాదిని పాండవుల ఔత్కృష్ట్యమును సుందర విశేషణముల నుపయోగించి వ్యక్తీకరించెననియు, కథా నాయకుల ప్రస్తావనము కావ్యాదిని యుండుట కావ్యశిల్ప హేతువనియు నా యభి

ప్రాయము. ప్రాచీన కావ్యములలో కావ్యాదిని నాయక ప్రస్తావనమే యున్నది. "సైరంధ్రి" పాత్రోచితి, రసపోషణము కవితా వైఖరి ఇత్యాద్యంశములలో తిక్కన మహాభారతము ననుసరించుటయే కాదు కథా కథనమునందును దానినే యనుసరించినది. కథా కథనమనగా కథను చెప్పుట. అనగా ఘట్టములను కూర్చుట. తిక్కన ఏ ఘట్టమునకు పిదప ఏ ఘట్టమును చెప్పెనో, ఆ క్రమమునగాక మరియొక క్రమములో కథను నడిపించితినని చౌదరిగారు చెప్పగలరా? ఎక్కడను వారు క్రమము తప్పలేదు. "కావ్యాదిని తిక్కన ఈ విధముగా చెప్పెను. చౌదరిగారు వ్రాసిన కావ్య ప్రారంభము కావ్యాంతర్గతమయిన ఇతివృత్తమున కుచితముగా లేదు. ఇట్లుండుట శిల్పమున కౌచిత్యము కలిగించదు. అట్టి యౌచిత్యమును తిక్కన సంపాదించె"నని నేను సమీక్షించగా చౌదరిగారు నా సమీక్షకు దుర్వ్యాఖ్యానము చేయుచున్నారు. వారు తిక్కన కావ్య ప్రతిభను కొల్లగొనుటకు తెలియజేయ నిశ్చయించిరి. ఆ తిక్కన కావ్య ప్రతిభనేకదా నే నుదాహరించినది. కావ్యమందలి కథలో దుర్యోధనుడు ప్రధాన నాయకుడుగాడు. కథయందలి దుర్యోధన చిత్త ప్రవృత్తికి కావ్యాదిని వారు వర్ణించిన దుర్యోధనుని యౌన్నత్యమునకు సంబంధము లేదు. ముఖ్యకథలో ప్రధాన నాయకుడుగాని వాని యౌన్నత్యము—కథయందలి ప్రకృతికి భిన్నముగా నున్నదానిని—చౌదరిగారు వర్ణించుట కావ్య శిల్పదోషమనినాడను. ఇది తప్పా! పెద్దన ప్రవరునకు నుపయోగించిన వర్ణ విశేషణములును, మనుచరిత్రలో ప్రవరుడు నడిచిన తీరుతో గాఢ సంబంధము కలిగియున్నవి. తిక్కయజ్వను పాత్రోచితి, రసపోషణము కవితావైఖరి ఇత్యాద్యంశములలో అనుసరించుట "సైరంధ్రి", శిల్ప దోషమని నేననలేదు. "కథా కథనములో ప్రాచీన కవులు కైకొన్న ఇతివృత్తమును గ్రహించుట "సైరంధ్రి" శిల్ప దోషమని నా యభిప్రాయమునుగాదు. నేను వ్రాసిన వాక్యములను ప్రకరణమునుండి ఈవలకీడ్చి వ్యాఖ్యానించుట తగదు. "సైరంధ్రి" కావ్యాదినిగల దుర్యోధన వర్ణనము విరాట పర్వకథా శిల్పమునకు అక్కఱకు రాదనియు, ఆ కథలోని దుర్యోధనుని నడవడికి ఈ వర్ణనమునకు పొత్తు లేదనియు, ఇట్లుండుట కావ్య శిల్ప దోషమనియు నా తలంపు. ఈ తలంపు తోడనే కావ్యమందలి సర్వవర్ణనములు కథోపయోగకారకములై యుండవలయునని వ్రాసితిని. తిక్కన ఇట్టి పని చేయలేదు, చేసినదేమియో చెప్పితిని. తిక్కన కావ్య ప్రతిభ ప్రతిబింబించు రచనలో మొదట తిక్కన చూపిన యౌచిత్యము కొఱవడిన దనుట నేరమియా? కావ్యమునందలి కథావర్ణనములు పరస్పర పోషకములై యుండవలయును. అదియే కావ్య శిల్పము. ఆ శిల్పమే "సైరంధ్రి"లో కొఱవడినది.

సంస్కృత దృశ్య శ్రవ్య కావ్యకర్తలు ఆంధ్ర కావ్యకర్తలు దుర్యోధనుని పరిపాలనమునుగూర్చి వర్ణించినను విషయము

ఈ సమీక్షకునకు క్రొత్త ఏమియునుగాదు. తెలియని యంశ మునుగాదు. సమీక్షకునకు తెలియదని చౌదరిగా రూహించుట, వారికే యంతయు తెలియునని అనుకొనుటవలన కలిగిన ఫలము. వారికి దుర్యోధనునిగూర్చి ఎవరెక్కడ నేమి వ్రాసినది ఎంతయో తెలియవచ్చును. అది వారి పాండిత్యమునకు చిహ్నము. కాని ఇక్కడ కావలసినది పాండిత్యముగాదు. మంచి శిల్పము. దుర్యోధనుని రాజ్యము సర్వ సంపదలతో తులదూగ వచ్చు. అతనివంటి రాజు చతుర్దశభువనములలో లేకపోవచ్చు. దుర్యోధనుడు నాయకుడయిన కథలో మొదట ఆ వర్ణన మున్నచో అది ఎంతో యౌచితీ సంపాదనావహమగును. విరాట పర్వకథలో దుర్యోధనునికంటె పాండవులకే యధిక ప్రాధాన్యము గలదు. ద్రౌపదివల్ల కీచకునకు పుట్టిన మరులే విరాటపర్వ కథలో సర్వ పాత్రలను ప్రత్యక్షముగనో పరోక్షముగనో నడిపించినవి. అందుచేతనేకదా చౌదరిగారీ రచనమునకు "సైరంధ్రి" యని పేరు పెట్టిరి. వారే శిల్ప దృష్టితో కావ్యమునకు పేరు పెట్టిరో యా శిల్ప దృష్టియే కావ్య ప్రారంభమునగల దుర్యోధన పరిపాలన వర్ణనములో లోపించినదని యన్నాడను. దాదాపు రెండు పుటలలో దుర్యోధన పరిపాలన వర్ణనముచేసి చౌదరిగారు సాధించిన శిల్ప ప్రయోజనమేమి? దుర్యోధనుని సత్పరిపాలనమునుగూర్చి "విన్నది మొదలు ధర్మరాజున కొక్కటే దిగులు పుట్టె" నని చౌదరిగారు వ్రాసిరి. "తిక్కన శిల్పమును" తీసికొని వ్రాసిన వ్రాతయా ఇది? "అరణ్యవాసములో వార్తాహరుల వలన దుర్యోధనుని పరిపాలనముగూర్చి విని ధర్మజుడు" ఎంతో బాధపడి యుండవచ్చు. కాని విరాట పర్వ కథాదిని ఆ విషయమును ప్రస్తావించినందువలన ధర్మజుని పాత్ర పోషణములో ఏ విశేషము పొడచూపినది? తిక్కన ఈవిధముగా వ్రాయలేదు. ఆయన వర్ణించిన ధర్మరాజు "దిగులు" ప్రకరణమునకు తగినది. దుర్యోధన పాత్రకుగాని, ధర్మరాజ పాత్రకు గాని, విరాటపర్వకథనుబట్టి చూచినచో "సైరంధ్రి" మొదటి మూడు పుటలలోగల వర్ణనములవలన ఏ వెలుగును కలుగ లేదు. అవి కేవలము చౌదరిగారి పాండిత్య పక్షపాతములను మాత్రమే ప్రకటించుచున్నవి. చౌదరిగారు సంస్కృతాంధ్ర గ్రంథములను పఠించి ఎన్నో నూతన విషయములు గ్రహించి యుండవచ్చును. వారి పాండిత్యము గొప్పది కావచ్చును. అది వేఱుమాట. తాను చదివిన గ్రంథములు, విమర్శలు, సమీక్షకుడు చూడలేడనుట చదువలేడనుట చౌదరిగారి విశాల దృష్టిని చూపదు.

తిక్కన కావ్య ప్రతిభ ప్రతిబింబించు కథలోని సర్వాంగములు సముచిత రూపమున కుదురుకొన్నవా? లేవా? యని మాత్రమే సమీక్షకుడు చూచును. అట్లు చూచుటయే ధర్మము. సాహిత్యము శిల్ప సమన్వితము. ఏవ తలపులను ఎక్కడో ఏ కవియో వ్యక్తీకరించి యుండవచ్చును. అవి ప్రకరణోచితములా? కావా? యని శిల్ప దృష్టిగలవాడు పరిశీలించును.

ప్రాచీన సంస్కృతాంధ్రకవులు—అందును తిక్కన కావ్య శిల్పము బాటను జూచియో ఈ నాలుగు ముక్కలు వ్రాసితిని. పాత్రల వ్యక్తిత్వమునకు నూతన వ్యాఖ్యానము చేయుటతో—చేసినవారి ననుసరించుటలో—చౌదరిగారు తృప్తి వహించిరి. ఆ నూతన వ్యాఖ్యానము ప్రస్తుత కథకు తగినదా? కాదా? యని శిల్పదృష్టితో పరిశీలింపవలయునని నా సిద్ధాంతము. కావ్యమునందలి యొక భాగమును స్వతంత్రముగా పరిశీలించినపుడది పరమ రమణీయముగా నుండవచ్చును. కాని యది ప్రధానకథలో నొకభాగము. ఆ భాగమునకు స్వతంత్ర లక్ష్యముండదు. ఉండరాదు. ఆ యొక దేశము ప్రధాన కథకు పోషకమై యుండవలయును. అట్లుండనిచో పరిపూర్ణరూప మునుబట్టి చూచినవాడు అది శిల్ప భంజకముగా సిద్ధమగును. కావ్య మొక సుందర శిల్పము. తత్తదవయవములు శిల్పానురూప నిష్పత్తిలో నుండునట్లు చూచుట రచయిత విధి. ఆలంకారికు లీ రహస్యమును గుర్తింపలేకపోలేదు. "నహి కవేరితి వృత్తమాత్ర నిర్వాహేణ ఆత్మపదలాభః ఇతిహాసాదేవ తత్సిద్ధేః" అనిధ్వన్యాలోకము. మంచి కావ్యము పోకడవేఱు. ఈ దృష్టితో చూచి దుర్యోధన పరిపాలన ప్రశంస విరాట పర్వకథతో విత్తు పొందికలులేక యున్న దన్నాడను. తిక్కన ననుసరించిన రచనముగాన తిక్కననే తార్కాణముగా తీసికొన్నాడను. ఇంతకంటె చెప్పవలసిన దింకేమియునులేదు.

—శాక్యసింహ.



జూపబడి యున్నది. సప్తవర్గ నందు రాశియందు స్వక్షేత్ర మందున్న గ్రహమునకు 5 బిందువులు ప్రాప్తించును. అదే గ్రహము దశవర్గ నందు రాశిలో స్వక్షేత్రమందున్న 3 బిందువులు ప్రాప్తించును. షోడశవర్గ నందు రాశిలో స్వక్షేత్రమందున్న 3½ బిందువులు ప్రాప్తించును. గ్రహములు స్వక్షేత్రము లందు గాక అధిమిత్ర, మిత్ర, సమ, శత్రు, అధిశత్రు క్షేత్రము లందున్న వారి బల నిర్ణయమునకు రాశియందు ఆయా గ్రహములకు స్వక్షేత్రమందు ప్రాప్తించు బిందువులను 18,20 చేతను, 15,20 చేతను, 10,20 చేతను, 7,20 చేతను, 5,20 చేతను భాగించగా ప్రాప్తించు భాగఫలము—ఆయా క్షేత్రములందున్న గ్రహముల బలముల చూపును. గ్రహముల సాముదాయకబలము 10 బిందువులకు ఎక్కువైన ఆ గ్రహములు క్రమముగా బలము గలవని, తక్కువైన క్రమముగ బలహీనులని వీరల బల నిర్ణయము చేయుట శాస్త్రసమ్మతము. ఇది స్థూల పద్ధతులలో నొకటి. షడ్బల సాధనాక్రమము ఉత్తమము. షడ్బలానంతరము గ్రహములు ఏయే భావములందు ఎంత ఫలముల నీయగలవో దివాకర సిద్ధాంతరీత్యా గణింపవలెను. ఇట్లు నిర్ణయించిన ఫలముల ప్రమాణ నిజస్వరూపము తెలియ నగును. ఇతర మార్గముల ఫలముల నిర్ణయించుట శాస్త్ర సమ్మతముగాదు.

ఉదాహరణ జాతకము :

ఈ జాతకుడు 1904 సంవత్సరం అక్టోబరు 1 వ తేది రాత్రి స్థానికవేళ 11 గంటల 25 నిమిషముల 58 సెకన్లకు ఆర్ద్రా నక్షత్ర ద్వితీయ చరణయుక్తమగు ఆదివారమందు జన్మించెను. జననకాల రాహు మహర్దశా శేషం 10 సంవత్సరముల 11 మాసముల 7 దినములు. గ్రహస్ఫుటం :— రవి— 5.16.4, చంద్రుడు— 2.11.54, కుజుడు—4.7.54 బుధుడు— 4.28.17, గురుడు— 0.4.48, (వక్రి), శుక్రుడు —6.9.10, శని—9.22.3 (వక్రి), రాహువు—4.24.23, కేతువు—10.24.23, లగ్నభావము జేష్ఠా నాల్గవ పాదము (7.28.34). దశమ భావము ఉత్తర చతుర్థ పాదము (5.9.40). శుక్ర శనుల స్వక్షేత్ర స్థితి, రవి బుధుల పరివర్తన, గురు కేతుల నక్షత్ర పరివర్తన, శుక్రరాహుల నక్షత్ర పరివర్తన, రవి, బుధ, శుక్ర, రాహుల మిత్ర నక్షత్ర స్థితి, ఇందరి సుఖ్యాంశములు. రవి, చంద్ర, బుధ, రాహు, కేతులు కేంద్రభావములందున్నారు. గురు కుజులు కోణభావములందున్నారు. తృతీయమందు శని. లాభమందు శుక్రుడు. లగ్న, రవి, చంద్ర, కుజ, గురు, శుక్ర, శనులు రవి హోరయందు, బుధ, రాహు, కేతులు చంద్రహోరయందున్నారు. దశాంశ చక్రమందు రవి, శని, కుజ, రాహుకేతు శుక్రులు కేంద్రవర్తులు. రవి, శనుల నీచ, బుధ గురుల ధనభావ స్థితి, షష్ఠభావమందు చతుర్థాధిపతియగు చంద్రుడు. భావచక్రమందు లగ్నమునకు గురు, కుజ, చంద్రుల దృష్టి. కుజునకు గురుదృష్టి. రవి బుధ రాహులకు శని షష్టాష్టకము. అష్టమాంశయందు తృతీయ వ్యయాధిపతి లగ్నస్థితి, సప్తమ అష్టమాధిపతి తృతీయ స్థితి. లగ్నాధిపతి పంచమ స్థితి, కేతుయుక్తుడగు ధనాధిపతి షష్ఠస్థితి, అష్టమ కుజుడు, లాభ గురుడు, వ్యయ శుక్రయుత రాహువున్నారు. కారకాంశ లగ్నము ధనస్సు. ఆత్మకారకుడు బుధుడు. ఈ జాతకుని, గొప్పదనము పై జెప్పబడిన అంశముల పరిశీలించిన విశదమగును. ఈ వ్యాసమందుదహరింపబడిన ఫలములు స్థూల ఫలములని, ఇవి గ్రహస్థిత సంబంధములకు లోనై మార్పు నొందునని గ్రహింపవలెను. ఈ స్థూల ఫలముల దృష్ట్యా ఉదాహరణ జాతకము పరిశీలించిన జాతకబలము విశదమగును.



# నిండని కుండ

## శ్రీ నూతలపాటి గంగాధరం

నిండనికుండ తొణుకుతుంది, నిజం!
ఎప్పుడు?
ఎవరైనా కదిపినప్పుడు,—
నిండుకుండ మాత్రం తొణకదా?

నిశ్చలంగా ఉంచేస్తే,
ఏదిమాత్రం ఎందుకు తొణుకుతుంది?

దిక్కు– దిక్కులూ తిరిగి
తెచ్చి పెట్టుకున్న తేనెపట్టుని
తిన్నగా తింటూంటాయి, తమకష్టం—తేనెటీగలు!
ఎప్పుడు?
ఎవరూ కదపనప్పుడు,—
గంటలు మాత్రం ఎందుకు శబ్దం చేస్తాయి?

గోవు సాధు జంతువే!
కాదని ఎవరన్నారు?
పాలు పితకబోతే పళ్ళు రాలదంతుంది
ఎప్పుడు?
తిండి పెట్టకుండా, కడుపు కాల్చినప్పుడు,—
సేవకు డైతేమాత్రం, ఎలా సహించగలడు?

ఓటికుండ నిండ దేనాటికీ!
నీళ్లులేని కుండ—నిర్జీవం!
అది ఎలా తొణకగలదు?

నిండనికుండ తొణుకుతుంది – ఎందుకు?
అది, సజీవమైనది కాబట్టి!
ఇంకా నిండని నీటి కోసం
సడిచేస్తుంది—దాని ధర్మం, అది!

---

# మయూరుడు సూర్యోపాస్తి

## శ్రీ యామిజాల పద్మనాభస్వామి

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అనే సూక్తి వినని వారుండరు. ఆరోగ్యం కావాలనుకునేవారికి సూర్యుడే గతి. నిత్యమూ సూర్యనమస్కారాలు చేస్తూ అర పండిన వయసులో కూడా శారీరక పటుత్వం లవలేశమైనా కొరవడక జీవిస్తున్న వారింకా మనకి అక్కడా అక్కడా కనిపిస్తున్నారు. కుష్ఠు, క్షయ వంటి మొండి రోగాలను పోగొట్టుకుని సుఖంగా ఉండాలంటే సూర్యోపాస్తి చెయ్యవలసిందే. అలా చేస్తున్నవాళ్ళూ ఉన్నారు. స్వయంగా సూర్యనమస్కారాలు చెయ్యలేని రోగులకు మరి ఒకరు రోగి పేరు చెప్పి సంకల్పించేసి సూర్యోపాస్తి కావించి తద్వారా వచ్చే ఫలాన్ని రోగికి ధారాదత్తం చెయ్యడం కద్దు. అలా రోగాలు పోగొట్టుకున్నవారిని నే నెరుగుదును.....

అభీప్సితార్థసిద్ధికీ, ఆపన్నివారణకూ దేవతానుగ్రహం అపేక్షించి ఉపాసించడం అనేది భారతీయుల పారంపరికమూ, ఆర్షమూ అయిన ఒక విశిష్ట సంప్రదాయం. పరదేశాలలో దేవతోపాసన లేదనలేముగాని మన ఋషుల అనుభూతి అనన్యాదృశం అని గట్టిగా చెప్పగలను.

పర్షియా యూరపు దేశాలలోను, ప్రాచీన గ్రీసు దేశంలో మన్నూ ప్రచారంలో ఉన్న సూర్య ప్రార్థనలకూ, భారతీయుల సూర్యోపాసనకూ చాలా తేడా ఉంది. పదార్థ విజ్ఞానంలో అతిశయించి యూరపువల పురోగమించిన పడమటి దేశాలలో దేవతలకూ, మతానికీ అంతగా ప్రాధాన్యం ఉన్నట్టు కన్పట్టదు. ఏది ఏలా ఉన్నా భారతదేశంలో మాత్రం దేవతోపాస్తి నియమ విషయాలకు ప్రాధాన్యం కొరవడలేదు. అనేక విధమైన పవిత్ర విశ్వాసం కల దేశం మనది. కనుక ప్రాచీన సంస్కృతికి దెబ్బ తగలకుండా కాపాడుకొంటూ వస్తున్నాము. అలాటి ఆర్య సంస్కృతిలో ఆదిత్య ప్రశంస అత్యున్నత స్థానాన్నే ఆక్రమించుకున్నది.

సామాన్యంగా తార్కికబుద్ధితో పర్యాన్వేషణ చేస్తేగాని మానవుడు ఏపనీ ఆరంభించడు. ఏదో సన్నిహితఫలా న్నపేక్షించి ప్రవర్తించడం లోక పరిపాటి. ఈ కారణంచేతనే ప్రాచీన ఋషులు తాము ఉపదేశించే మార్గాలలో పండితులకూ, పామరులకూ కూడా వారివారి అధికారాన్నిబట్టి మేలు కలిగే అవకాశాన్ని చూపి ఉన్నారు. దేహధారులలో రాగం రోగం రాని వారే ఉండరు. భర్తృహరి—

'భోగే రోగభయం'— అన్నాడు.

విషయభోగాలు ఆస్వాదించేవుడు సమృద్ధంగా సక్రమంగా నడిచేవారికి కూడా రోగభయం ఉండనే ఉంది అని దీని భావం. ఆ పక్షంలో క్రమం తప్పి లోపభూయిష్ఠంగా భోగాలు రుచిమూసేవారికి రోగభయం తప్పించుకోడం సాధ్యం కాదు. అందరికీ

'వైరాగ్యమేవా భయం'—

అనే సూక్తిని అనుసరించే వివేక స్థైర్యా లుంటాయా ? కనక ఆరోగ్య రక్షాకాంక్ష సర్వ సముపాదేయ మవుతూవుంది. ప్రత్యక్షదైవమయిన సూర్యుడే ఆరోగ్యప్రదాత అయివున్నాడనేది నిర్వివాదాంశం. సజీవ జగత్తు స్థిరచరజీవుల కన్నిటికీ అనుదినమూ సర్వ నవనవ తేజోవికాస స్వాస్థ్యాలు ప్రసాదించే శక్తి సూర్యబింబంలో ఉన్నదనేది అందరికూ అనుభవ విదితమే. భౌతికంగానే కాక, ఆధ్యాత్మికంగా కూడా లోకాన్ని నియమించగల నిగ్రహానుగ్రహసామర్థ్యం సూర్యమండల వర్తియైన భగవానుడికి ఉన్నదని విజ్ఞులు చెప్పి ఉన్నారు. కర్మఠులు,

తద్ద్వారా పుణ్యభూమి అయిన భారతదేశంలో సనాతనంగా పండితులు పామరులూ సూర్యుణ్ణి ఉపాసించడంలో ఆశ్చర్యమేమున్నీ లేదు!—

వేదాలు, పురాణాలు, కావ్యాలు సూర్యుణ్ణి ఏకకంఠంగానే ప్రశంసించాయి. కాని, లౌకిక వాఙ్మయంలో సూర్యమాహాత్మ్యాన్ని ప్రతిపాదించే కావ్యాలు చాలా తక్కువగా ఉన్నాయి. సంస్కృత భాషలో కూడా ప్రాచీన కవులలో కాళిదాసాది మహాకవు లనేకు లున్నా సూర్యమాహాత్మ్యాన్ని ఉద్ఘాటించిన కీర్తి మహాకవి మయూరున కొక్కనికే దక్కింది. మయూరుడు అప్రతిమాన ప్రతిభాశాలి. వేద రహస్యవేది. కథారూపమైన వస్తువు లేకపోయినా, కల్పనావైచిత్ర్యానికి అవకాశం లేకపోయినా ఆ రెంటితో అక్కర లేకుండా సూర్యస్వభావోక్తిని మాత్రం ఆశ్రయించి సూర్యోపాసనా రహస్యాలను వెల్లడించిన ఋషికల్పుడు. సంస్కృతభాషా పరిచయమే కొరవడిన యీ రోజులలో కవితాప్రౌఢిమతో వైదిక మంత్ర సమ్మితములుగా శ్లోకాలు వ్రాసిన మయూరుని సూర్య శతకం ప్రచారానికి రాకపోవడంలో ఆశ్చర్యంలేదు. కాని ఆ శత శ్లోకాల భావాలున్నా అందరూ తెలుసుకోవలసినవి. అందుకనే సాధ్యమయినంతవరకూ మయూరుని భావాలు తెలుగు వెలుగులోకి రావాలనే ఆకాంక్షతో నే నీ శతకాన్ని తెలుగు చేశాను.

## మ యూ ర చ రి త్ర

సూర్య శతకమును సంస్కృతభాషలో వ్రాసిన మయూరుడు కాదంబరీ కథారచయితగా ఖ్యాతిగాంచిన భట్ట భాణుడికి సమకాలికుడు. బాణుడు శ్రీ హర్షుని ఆస్థానకవి. మయూరుడు ఉజ్జయినీ ప్రభువైన వృద్ధభోజుని ఆస్థాన పండితుడనీ, బాణుడికి మామగారనీ చెప్పడానికి రెండు ఆధారాలున్నాయి. ఒకటి :—

మానతుంగాచార్య ప్రణీతమైన భక్తామరాఖ్యస్తోత్రం టీకా ప్రారంభంలోని ప్రశంస.

రెండు :—

మేరుతుంగ ప్రణీతమైన 'ప్రబంధ చింతామణి' అనే జైన గ్రంథంలోని ప్రశంస.

రెండోదానిలో బాణుడు మయూరుడికి 'బావమరిది'— అని కూడా చెప్పడం కద్దు. ఇది ఏలాటి చుట్టరికమో సరిగా తెలియదు గాని శ్రీ హర్షుడి కాలాన్ననుసరించి బాణ మయూరులు సమకాలికులని గట్టిగా చెప్పడానికి మాత్రం ఉపకరిస్తోంది. ఈలాటి చుట్టరికాన్ని బట్టి పోతన శ్రీనాథులు సమకాలికులని చెప్పుకుంటున్నాము కదా!

''అహో! ప్రభావ వాగ్దేవ్యాః
యన్మాతంగ దివాకరః
శ్రీ హర్షస్యాభవ త్సభ్యః
సమో బాణమయూరయోః'—అనే శార్ఙ్గధర పద్ధత్యాది ప్రసిద్ధ రాజశేఖర వచనం కూడా బాణమయూరులు సమకాలికులని చెప్పడానికి తోడ్పడుతూంది. కనుక మయూరకవి క్రీ. శ. 7 వ శతాబ్ది పూర్వార్థంలో ఉండేవాడని చెప్పడానికి సందేహంలేదు.

మయూరుని జననం, జన్మస్థలం, బాల్య జీవితం చెప్పడానికి ఏ ఆధారాలూ దొరకవు. కవిగా ప్రసిద్ధి పొందక పూర్వం మయూరుడు సర్వ విషయవైదుష్యుడుగా జీవించి ఉండవచ్చునని ఒక అమెరికా విద్వాంసుడు క్వాకెన్‌బాస్ అనే ఆతడు అభిప్రాయపడ్డాడు. ఈ విద్వాంసుడు మయూరుని సూర్య శతకాన్ని, అందుకు పోటీగా బాణుడు రచించినట్లు వ్యవహారమైన చండీ శతకాన్ని దొరికినంతవరకూ మయూరుని యితర కృతులనూ కూర్చి ఆంగ్లభాషలో విపులమైన టీక, అనువాదం, ఉపోద్ఘాతాలు చేర్చి అమెరికాలోని కాలిఫోర్నియా యూనివర్సిటీ ద్వారా ప్రకటీకరించి ఉన్నాడు.

జైన గ్రంథాలలో ప్రభావక చరిత్రలో బాణమయూరులకు పరస్పరం కవితావిషయకమైన పోటీ జరిగినట్లున్నా, జైనాచార్యుడు మానతుంగుడు కూడా పోటీచేసి పై యిరువుర్నీ మించినట్లున్నా కథలున్నాయి. వానివల్ల ఒక్క విషయం మాత్రం నిర్వివాదంగా తేలుతూంది. కొన్ని సభలలో మయూరుని అసాధారణ కవితా ప్రాభవం అభివ్యక్తం కాగా అప్పటి రాజు హర్షుడు మయూరుణ్ణి పిలిపించి తన ఆస్థానంలో నిలుపుకొని ఉంటాడు. భోజుని ఆస్థానంలో మయూరుడు ఉండేవాడన డానికి తగిన చారిత్రకాధారాలు కానరావు. శంకర విజయంలో శంకరాచార్యుల వారు వాదంలో మయూరుణ్ణి ఓడించినట్లు ఉన్నదట! శంకరుల కాలానికీ మయూరుని కాలానికీ పొసగదు కనుక యీ వ్రాత కేవలం ఇతరమతస్థుల్ని శంకరులు జయించారనడానికి ఉపలక్షణం కావచ్చుననీ, ఎట్లయినా మయూరుణ్ణి శంకరుల ప్రతిస్పర్థిగా వర్ణించడంవల్ల విద్వన్మండలిలో మయూరున కెలాటి గౌరవ మున్నదీ వ్యక్తం అవుతూందనీ క్వాకెన్‌బాస్ ఊహించాడు. మయూరునకు శంకరుడనే పేరిట ఒక కొడుకుండేవాడట! కాని, కవులలో యిద్దరు ముగ్గురు శంకరు లున్నందువల్ల మయూరుడే శంకరుని తండ్రియో చరిత్రకారులు నిర్ణయించలేకపోయారు.

సూర్యశతకం తరువాత చెప్పదగినది మయూరాష్టకం. మిగిలినవి సందర్భానుసారంగా వచ్చిన ప్రాస్తావిక రచనలు. అందులో

జూపబడి యున్నది. సప్తవర్గనందు రాశియందు స్వక్షేత్ర మందున్న గ్రహమునకు 5 బిందువులు ప్రాప్తించును. అదే గ్రహము దశవర్గనందు రాశిలో స్వక్షేత్రమందున్న 3 బిందువులు ప్రాప్తించును. షోడశవర్గనందు రాశిలో స్వక్షేత్రమందున్న 3½ బిందువులు ప్రాప్తించును. గ్రహములు స్వక్షేత్రము లందు గాక అధిమిత్ర, మిత్ర, సమ, శత్రు, అధిశత్రు క్షేత్రము లందున్న వారి బల నిర్ణయమునకు రాశియందు ఆయా గ్రహములకు స్వక్షేత్రమందు ప్రాప్తించు బిందువులను 18,20 చేతను, 15,20 చేతను, 10,20 చేతను, 7,20 చేతను, 5,20 చేతను భాగింపగా ప్రాప్తించు భాగఫలము—ఆయా క్షేత్రములందున్న గ్రహముల బలముల చూపును. గ్రహముల సాముదాయికబలము 10 బిందువులకు ఎక్కువైన ఆ గ్రహములు క్రమముగా బలము గలవని, తక్కువైన క్రమముగా బలహీనులని వీరల బల నిర్ణయము చేయుట శాస్త్రసమ్మతము. ఇది స్థూల పద్ధతులలో నొకటి. షడ్బల సాధనాక్రమము ఉత్తమము. షడ్బలానంతరము గ్రహములు ఏయే భావములందు ఎంత ఫలముల నీయగలవో దివాకర సిద్ధాంతరీత్యా గణింపవలెను. ఇట్లు నిర్ణయించిన ఫలముల ప్రమాణ నిజవ్యయాదులను తెలియ వగును. ఇతర మార్గముల ఫలముల నిర్ణయించుట శాస్త్ర సమ్మతముగాదు.

బుధుడు–4.28.17, గురుడు–0.4.48, (వక్రి), శుక్రుడు –6.9.10, శని–9.22.3 (వక్రి), రాహువు–4.24.23, కేతువు–10.24.23, లగ్నభావము జ్యేష్ఠ నాల్గవ పాదము, (7.28.34). దశమ భావము ఉత్తర చతుర్థ పాదము (5.9.40). శుక్ర శనుల స్వక్షేత్ర స్థితి, రవి బుధుల పరివర్తన, గురు కేతుల నక్షత్ర పరివర్తన, శుక్రరాహుల నక్షత్ర పరివర్తన, రవి, బుధ, శుక్ర, రాహుల మిత్ర నక్షత్ర స్థితి, ఇందరి మాధ్యాంశ ములు. రవి, చంద్ర, బుధ, రాహు, కేతులు కేంద్రభావములం దున్నారు. గురు కుజులు కోణభావములం దున్నారు. తృతీయ మందు శని. లాభమందు శుక్రుడు. లగ్న, రవి, చంద్ర, కుజ, గురు, శుక్ర, శనులు రవి హోరయందు, బుధ, రాహు, కేతులు చంద్రహోరయం దున్నారు. దశాంశ చక్రమందు రవి, శని, కుజ, రాహుకేతు శుక్రులు కేంద్రవర్తులు. రవి, శనుల నీచ, బుధ గురుల ధనభావ స్థితి, షష్ఠభావమందు చతుర్థాధిపతియగు చంద్రుడు. భావచక్రమందు లగ్నమునకు గురు, కుజ, చంద్రుల దృష్టి. కుజునకు గురుదృష్టి. రవి బుధ రాహులకు శని షష్టాష్టకము. అష్టవర్గాంశయందు తృతీయ వ్యయాధిపతి లగ్నస్థితి, సప్తమ అష్టమాధిపతి తృతీయ స్థితి. లగ్నాధిపతి పంచమ స్థితి, కేతుయుక్తుడగు ధనాధిపతి షష్ఠస్థితి, అష్టమ కుజుడు, లాభ గురుడు, వ్యయ శుక్రయుత రాహులున్నారు.

# నిండని కుండ

శ్రీ నూతలపాటి గంగాధరం

నిండనికుండ తొణుకుతుంది, నిజం!
ఎప్పుడు?
ఎవరైనా కదిపినప్పుడు,—
నిండుకుండ మాత్రం తొణకదా?

నిశ్చలంగా ఉంచేస్తే,
ఏదిమాత్రం ఎందుకు తొణుకుతుంది?

దిక్కు దిక్కులూ తిరిగి
తెచ్చిపెట్టుకున్న తేనెపట్టుని
తిన్నగా తింటూంటాయి, తమకష్టం—తేనెటీగలు!
ఎప్పుడు?
ఎవరూ కదపనప్పుడు,—
గంటలు మాత్రం ఎందుకు శబ్దం చేస్తాయి?

గోవు సాధు జంతువే!
కాదని ఎవరన్నారు?
పాలు పితకబోతే పళ్ళు రాలదంతుంది
ఎప్పుడు?
తిండి పెట్టకుండా, కడుపు కాల్చినప్పుడు,—
సేవకు డైతేమాత్రం, ఎలా సహించగలడు?

ఓటికుండ నిండ దేనాటికీ!
నీళ్లులేని కుండ—నిర్జీవం!
అది ఎలా తొణకగలదు?

నిండనికుండ తొణుకుతుంది - ఎందుకు?
అది, సజీవమైనది కాబట్టి!
ఇంకా నిండని నీటి కోసం
సడిచేస్తుంది—దాని ధర్మం, అది!

---

శివపార్వతుల సరస సల్లాపాలు వివరించే శ్లేష చమత్కృతులనుంచి లేగదూడకి పాలు కుడుపుతూన్న గోవుల వర్ణన వరకూ వివిధ సన్నివేశాలు చిత్రించాడు. మయూరకవికి శబ్ద చమత్కృతిపై ఎక్కువ మోజు అనడానికి సూర్య శతకంలోని శ్లేష భంగిమలే కాక హర్షుని గూర్చి ఆయన చెప్పినట్టు వినవస్తున్న ఈ క్రింది శ్లోకం ఒక్కటి చాలు.

'భూపాలాః శశిభాస్కరాన్వయ భువః
కే నామ నాసాదితాః
భర్తారం పునరేక మేవహి భువః
త్వాం దేవ మన్యామహే
యేనాంగం పరిమృశ్య కుంతల మథా
కృష్య వ్యుదస్యాయతం
చోళం ప్రాప్య చ మధ్యదేశ మధునా
కాంచ్యాం కరః పాతితః'—

ఈ వర్ణన ప్రకారం హర్షుడు దక్షిణాపథ విజయయాత్రకై బయలుదేరినప్పుడు అతనికి కంచి వరకూ జయించాలి అని ఉండే కుతూహలాన్ని బట్టి ఇలా వర్ణించాడేమో గాని చారిత్రకంగా చూస్తే హర్షుడు కాంచిని జయించలేదనే బుజువవుతూంది. మధ్యేమార్గంలోనే పులకేశి చేతిలో ఓడిపోయాడు. హర్షుని జయాపజయాలెలా ఉన్నా మయూరకవి శబ్ద చమత్కృతిన్నీ దానితోపాటు శృంగారరస ప్రియత్వమున్నూ ఈ పై శ్లోకంలో స్పష్టంగా గోచరిస్తున్నాయి.

మయూరాష్టకం కేవలం శృంగారరసప్రధానం. ఉదాహరిస్తున్నా నొక శ్లోకం మచ్చుకి—

'ఏషా కా భుక్త ముక్తా ప్రచలిత నయనా
స్వేద లగ్నాంగ వస్త్రా
ప్రత్యూషే యాతిబాలా మృగ ఇవ చకితా
సర్వతః శంకయంతీ
కేనేదం వక్త్రపద్మం స్ఫురదధర రసం
షట్పదేనేవ పీతం
స్వర్గః కేనాద్య భుక్తో, హరనయన హతో
మన్మథః కస్య తుష్టః'—

ఈ అష్టక రచన గురించి ఇలా ఉంది పరంపరయా వస్తున్నమాట :—

మయూరుని కూతురు ఒకనాడు లోపలి గదిలోంచి వస్తూండగా చూసి 'ఎవరో' అనుకుని ఆమె అతిలోక సౌందర్యానికి ముగ్ధుడై ఈ యెనిమిది శ్లోకాలూ చెప్పాడట మయూరుడు. తరువాత తన తనూజ అని తెలుసుకొని పశ్చాత్తప్తుడయాడట!

సూర్య శతకంలో మయూరుడు వెలువరించిన భక్తి తాత్పర్యాల తీవ్రగతికీ, అతీంద్రియ దర్శనానికిన్నీ అతనిజీవితంలో ఒక ఘట్టంలో సంభవించిన ఉగ్రతాపమే కారణమని లోకు లంటారు. అది కట్టుకథ యైనా కావచ్చు. కాని దాని భావం కొంత చిత్రంగా ఉంటుంది కనుక విన్నది విన్నట్టుగా వివరిస్తున్నాను.

మయూరుడు చక్కని రూపురేఖలు కలవాడు. భార్య ఒక ఆడుబిడ్డను కని గతించింది. క్రమంగా ఆ పిల్ల పెరిగి పెద్దదయింది. బాణుని కిచ్చి మయూరుడు కన్యాదానం గడించుకున్నాడు. ఒకనా డామె జలకమాడి మేడపై తలని ఆర్చుకుంటూంది. ఎండలో. ఆ దృశ్యం మయూరునిలో ఉద్రేకాన్ని కలిగించింది. అతిత్వరితంగా కుష్ఠురోగి అయాడు.

మయూరుని తల్లి అప్పటికింకా జీవించి ఉంది. మయూరుని వ్యాధి దినదినమూ వృద్ధి పొందుతోంది. తల్లి దుఃఖమూ మనోవేదనా పోటాపోటీగా పెరుగుతున్నాయి. ముక్కు ముక్కలుగా తెగి అవయవాలు రాలిపోయే దశతో మయూరుడు ఒకమూల గదిలో పూయలపై ఉంటున్నాడు.

ఒకనాడు పొద్దుగూకే వేళ. అగస్త్యుడు వృద్ధ బ్రాహ్మణ వేషధారియై యాయవారానికి వచ్చినట్టుగా మయూరుని ఇంటికి వచ్చికోరి ఆ గదిలో ప్రవేశించాడు. అసహ్యమైన రుజతో గజగజ వణుకుతూ మూలుగుతున్న మయూరుణ్ణి పలకరించాడు. మయూరుడికి దృష్టి కూడా సరిగా లేదు. అగస్త్యుడు దగ్గరగా వెళ్లి మయూరుడి తలపై దక్షిణ హస్తం ఉంచి ఆదిత్య హృదయం ఉపదేశించి వచ్చిన దారినే వెళ్లిపోయాడు. కర్మ పరిపక్వమయింది. మయూరుడు రోగ విముక్తుడయాడు. ఆత్మప్రేరణతో సూర్యశతకం వ్రాశాడు— ఇది పెద్దల వల్ల విన్న కథ—

ఈ కథ ఏలాటిదయినా సామాన్యమైన ఔషధాలకు సాధ్యంకాని ఏ మొండి రోగానికో చిక్కి మయూరుడు 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' — అనే సూక్తి ననుసరించి సూర్య శతకం వ్రాసి దానివల్ల కృతార్థుడయాడనేది మనం భావించ వలసి ఉంది.

'శీర్ణ ఘ్రాణాంఘ్రి పాణీన్ వ్రణిభిరపఘనైః
ఘర్ఘరా వ్యక్త ఘోషాన్'—

అనే సూర్యశతకం ఆరవ శ్లోకంలోనూ, అలాటివే మరి కొన్ని శ్లోకాలలోనూ తీవ్రపాప ఫలితాలు, 'వానికి సూర్య సంస్తుతియే మందు' అనే భావాలున్నూ ధ్వనిస్తున్నాయి.

మమ్మటుని కావ్య ప్రకాశంలో కావ్య శక్తులలో పాప హరణం ఒకటి అని చెప్పడంలో

'ఆదిత్యా దేర్మయూరాదీనామివ అనర్థ నివారణం' అని ఉంది. మమ్మటుడు క్రీ. శ. 1050 నాటి వాడు. ఈ వ్రాతకు వ్యాఖ్యాత 'మయూరనామా కవిః శతశ్లోకేనాదిత్యం స్తుత్వా కుష్ఠాన్నిస్తీర్ణ ఇతి ప్రసిద్ధిః'— అని వ్రాశాడు.

నాగోజీ భట్టు ఉద్యోతంలో 'మయూర శర్మా సూర్య శతకేన కుష్ఠాన్నిస్తీర్ణ ఇతిచ ప్రసిద్ధిః' అని ఉంది.

ఆ కాలంలో ఆదిత్యోపాసన ప్రచురంగా ఉండడానికి కూడా చరిత్రలో ఆధారాలున్నాయి. హర్షుని తండ్రి ప్రభాకర వర్ధనుడు 'పరమాదిత్య భక్తుడు' అని హర్ష చరిత్రలో ఉంది. ప్రయాగలో హర్షుడు సూర్యబుద్ధ శివ విగ్రహాలకు పూజ చేసే వాడని చీనాయాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ వ్రాశాడు.

మయూరుడికి కుష్ఠు ఏ కారణం వల్ల వచ్చిందనేది సరిగా నిర్ణయించలేము. అది అనావశ్యకం కూడ. కాని జైన గ్రంథాలలో ఉన్న కథ విచిత్రంగా ఉంది. అందరి కవితా చమత్కృతిని చూపే ఉద్దేశంతో దానిని కూడా ఒకింత వ్రాస్తున్నాను. సూర్య శతకాన్ని ప్రకటించిన యజ్ఞేశ్వరుడు అనే ఆయన తాను మేరుతుంగాచార్యుని ప్రబంధ చింతామణి నుంచి సంగ్రహించినట్లు ఈ కథ చెప్పాడు. ఆ కథ ఇది :

బాణ మయూరులు కవితా వినోదాలలో ఒకరిని మించి ఒకరు ప్రసంగించుకొనే వారు. మయూరుడొకనాటి రాత్రి ఏవో శ్లోకాలల్లి తెల్లవారుజామున పెందలకడలేచి బాణునకు వినిపించాలనే కుతూహలంతో బాణుని ఇంటికి వచ్చాడు. ఇంకా అంతా నిద్రిస్తున్న సమయం అది. కాని బాణుని గొంతు మయూరుడికి వినిపించింది. ప్రణయ కలహంలో భీష్మించుకొని ఉన్న భార్యని ప్రసన్నురాల్ని చేసుకోడానికి పడినపాట్లు విఫలమై తెలవారి పోవచ్చిందే అని దిగులుతో బాణుడు శ్లోక రూపంగా ఆమెను అనునయించ నారంభించాడు.

'గత ప్రాయా రాత్రిః కృశతను ! శశీ శీర్యత ఇవ
ప్రదీపోఽయం నిద్రావశముపగతో ఘూర్ణిత ఇవ
ప్రణామాంతో మానః, త్యజసి న తథాపి క్రుధమహో'

ఆ పైన ఏమనాలో తోచలేదేమో ఆ మహాడు పాదాలే మళ్లీ మళ్లీ చదువుతున్నాడు. మయూరుడు విన్నాడు.

'సెబాష్ ! బొంకాడు'— అని అక్కడే నిల్చున్నాడు. గదిలోంచి అంతలో చప్పుడు వినిపించింది. బాణుని గొంతు

కుచ ప్రత్యాసత్త్యా హృదయమపి తే
సుభ్రూ ! కఠినం'— ...... అని వినిపించింది.

ఈ భాగంలో ఈ కథ వేరువేరు గ్రంథాలలో వేర్వేరు విధంగా ఉంది. ఈ నాల్గవ పాదం గది బయట నున్న మయూరుడే చెప్పినట్టు కొందరన్నారు. కొందరు బాణుడే చెప్పగా బయట నున్న మయూరుడు అందెల చప్పుడు విన్నాడు కనుక బాణుడు భార్య కాలితో పులిన్నాడని గ్రహించి వెంటనే బాణుణ్ణి సంబోధించి

'సుభ్రూ ! అని అనడం కన్న 'చండి !' అని అనడం సముచితంగా ఉంటుందయ్యా ! అని అన్నాడని అన్నారు.

'సుభ్రూ' అనేది షట్కృత్తికలలో ఒక కృత్తిక పేరు. షణ్ముఖమాతలు కృత్తికలు శివార్చనాసక్తులు. కనుక శ్లేష చిత్యంలో సర్వదా తెలియజేసే మయూరుని వూహ 'చండి' అనే సంస్కరణను సూచించేంత దాకా పరుగెత్తింది. ఆ ఔచిత్యాన్ని గ్రహించి సంతోషం పట్టలేక బాణుడు గది వెడలివచ్చి మయూరుణ్ణి కౌగలించుకున్నాడు. కాని గదిలో ఉన్న ఆమె స్థితి రసాభాస మయింది. బాణుడు బయటికి రావడంతో ఆమె హృదయ కుహరంలో ఇంతవరకూ దాగి ఉండి, అభిమానమనే తెరచాటున మగ్గిన వాంఛకి వ్యాఘాతం కలిగింది. పైగా తన సోదరుడు తన శృంగారకేళిని కవితా వస్తువుగా తీసుకోవడమా! అంతేకాదు, చిన్నప్పటి నుంచీ తన కోప కర్కశతనం తెలిసి ఉన్నందువల్ల ఆ భావాన్ని ఈ లలితమైన పద్యంలో బిగించి తన గుట్టు బయట పెట్టడమా ?.... ఆమె పతివ్రత. కోపం ఆపుకోలేక పోయింది. ఛీత్కారంతో కిటికీలోంచి సోదరుని మీద పుక్కిలిస్తున్న తాంబూల రసం తుప్పున ఉమ్మింది శపిస్తూ. అంతే. తాంబూల రసం పడిన తావంతా కుష్ఠు వ్యాప్తమై పోయింది మయూరుడికి.

తెల్లవారింది. దిగాలుగా మయూరుడింటికి వచ్చి నిత్య కృత్యాలు అతికష్టం మీద అయిందనిపించుకొని మామూలుగా దర్బారుకి వెళ్లాడు. వ్యాధి పెక్కింది. హర్షుడు మయూరుణ్ణి బహిష్కరించాడు. మయూరుడు కింది పెదవి మీది కెత్తకుండా ఇంటికి వచ్చాడు. దైవ ప్రసాదముగా తనలో ఉన్న కవితా శక్తితో ఆదిత్యోపాసన చేశాడు. శతక రచన ఆరంభించాడు. ఆరవ శ్లోకం వ్రాసేసరికే కుష్ఠు నయమై పోయింది. శతకం పూర్తి చేశాడు. మునపటికన్నా తేజస్వి అయాడు. కొలువుకి వెళ్లాడు. రాచమన్నన పొందాడు.

హర్షుని కొలువులో బాణుడికీ మయూరుడికీ ఏవో దార్ఢ్యమై అనుకున్నా పోటీ సడలకా ఉండడం అలవాటై పోయింది. హర్షుని ప్రోత్సాహంతో బాణుడు కాళ్ళు, చేతులూ నరికించుకొని చండీశతకం ఆరంభించాడు.

'మాభాంక్షీ ర్విభ్రమంభ్రూః'—

అని అరవ - అక్షరం 'శుభప్రదమైన మయూరం' పునరావృత్త మయింది. దేవి కరుణించింది. కాళ్లు చేతులు యథామామూలుగా వచ్చేశాయి.

అప్పుడే కుతూహలం అంతతో ఆగలేదు. జైన పండితుడైన మానతుంగుణ్ణి చూసి తన మతంలోని మహాత్మ్యం చూపమన్నారు. మానతుంగుడు 42 ఇనుపసంకెళ్లు వేయించుకొని ఒక గదిలో కూర్చుని 'తాళము వేసుకోండి' అన్నాడు. భక్తామరస్తోత్రం అనే పేరుతో 44 శ్లోకాలు చెప్పాడు. శ్లోకానికొక్క సంకెల తెగి పోయింది. తాళం వేసిన తలుపు దానంతట అదే తెరుచుకున్నది. చిరునవ్వుతో విజయగర్వంతో వెలుపలకు వచ్చాడు. సభ మందిన్నీ 'బలే' అని ప్రశంసించారు.

ఈ కథాసంవిధానం పర్యాలోచిస్తే జైనమతాను యాయులు మానతుంగుని ఔత్కృష్ట్యాన్ని ఉద్ఘాటించ డానికి వ్రాసినట్లు తోస్తుంది. దానిలో బాణమానతుంగుల కథ ఒక వేళ కల్పితమే అయినా మయూరుని కథవరకూ సత్యమే అనీ, ప్రజలలో మయూరుని మాహాత్మ్యం కడు ప్రసిద్ధంగా వ్యాపించి ఉండడం వల్ల దానినే ఆశ్రయించి మానతుంగుని పేరు జత పరిచి ఉండవచ్చుననీ అన్నీ మనం నిర్ణయించుకో వచ్చు.

మొదట మయూరుడు యౌవన సహజమైన కామోద్రేకానికి లొంగినా క్రమేణా అతని తపస్సు, వాక్శుద్ధి అనుభవాలున్నూ ఉత్తమ కక్ష్యకి చేరాయనడానికి సందేహం లేదు. అందుకు సూర్యశతకమే బలీయమైన సాక్షి. ఆతని జీవితంలో కూడా ఒక మార్పు వచ్చి ఉండాలని చెప్పడానికి ఆధారంగా ఒక ప్రాస్తావిక శ్లోకం ఉంది. రాజశేఖర కవి తన సూక్తి ముక్తావళిలో

'దర్పం కవిభుజంగా నాం
గతా శ్రవణ గోచరం
విష విద్యేవ మాయూరీ
మయూరీ వాక్ నికృంతతి'—

అని వ్రాశాడు.

ఈ ప్రశంసా వాక్యం భోగలాలసులై రాజుల నాశ్రయించి వారిని రంజింప చేయడానికి విలాసవతీ వర్ణనలు చేస్తూ భగవత్ప్రసాదమైన కవిత్వాన్ని గాఢంగా ఉపయోగించుకుంటూ గర్వించే ఇతర కవులకంటే మయూరుని యందు గల విశిష్టాచారాన్ని వెల్లడిస్తూంది.

## మయూరుని వైశిష్ట్యం

మయూరుని కవితా పద్ధతి వైదిక లౌకిక వాఙ్మయాలకు నడుమ మయూరుడు రాయబారిగా ఉన్నట్లు చెప్తుంది. అతి ప్రాచీనమైన వేద మహత్తు అతని రచన యందు అంతర్వాహినిగా ఉంటుంది. విశ్వాత్మమైన సూర్యుడు మయూరుని కెంతటి కైవస మయినాడో గాని తానుతరించి తోటివారిని తరింప చేయడానికి మానవలోకంలో మయూరుడు వేదసూర్యుడైనాడు. లేకపోతే లోకక్షేమం కోసం సూర్యశతకం వ్రాసినట్లు చెప్పుకోడు.

'శ్లోకాః లోకస్య భూత్యై శతమితి రచితాః
శ్రీ మయూరేణ'— (సూర్యశతకం 101వ శ్లోకం)

కవులందరూ తమతమ ఇష్టదైవాన్ని ప్రార్థిస్తూ రచించిన గ్రంథాలలో 'మా మవతు, 'మాం పునాతు'— అని స్వార్థంగా తమ భక్తిని ఉపయోగించుకున్నారే గాని మయూర కవి లాగా ప్రతిశ్లోకంలోనూ 'వోవ్యాత్' 'మంగళం వో దిశంతు' అని అనలేదు. ఈ తేడాలే ఈ శ్లోక శతకానికి మకుటాలు.

వాఙ్మయ చరిత్రలను వ్రాసిన వారు వేదాలు అలౌకికాలని, సృజన సామాన్యములు కావనీ, వ్యవహారోపయుక్తములు కావనీ కాబోలు వాటికి వాఙ్మయంలో స్థానం ఈయలేదు. ఆలంకారికులలో కొందరు సాహసికులు 'వేదాలు నీరసములు' అని అనడానికి కూడా జంకలేదట! వేదాలకు అంగములనిపించు కున్న సాహసముచేత కాబోలు అవి శాస్త్రాలున్నూ అలంకారికుల ధర్మమా అని వాఙ్మయ రంగానికి రాలేదు. ఇక శతక వాఙ్మయం గురించి చెప్పవలసి వస్తే, వాటి వైశిష్ట్యాన్ని తెలుసుకో లేక కాబోలు వాటికిన్నీ వాఙ్మయంలో రమణీయమైన స్థలం అనుగ్రహించ లేదు. ఈలాటి విపరీత శాసనం వల్ల ఈ సూర్య శతకాన్ని ఇంకా ఈలాటి వాటినిన్నీ ఏ చరిత్రలో చేర్చాలో వారే చెప్పాలి. ఏమైనా ఏ కాలానికైనా శతక వాఙ్మయానికంతకూ మకుటాయ మానమైన ఈ సూర్యశతకం వాఙ్మయ చరిత్రలో ప్రత్యేక స్థానం పొంది తీరుతుందని నా ఆత్మ విశ్వాసం. ఇక ఈ శతకం స్వరూప స్వభావాలు కొంచెం వివరిస్తాను.

సూర్యశతకాన్ని మహాకవి మయూరుడు ఒక చక్కని ప్రణాళిక వేసుకుని రచించినట్టు నాకు తోస్తుంది.

కిరణ ప్రసార వర్ణనతో ఆరంభించి 19 శ్లోకాలలో సక్రమంగా కిరణపుంజ సాంద్రత వర్ణించాడు. ఆ పైన 43వ శ్లోకం వరకూ ద్యుతివర్ణన, తరువాత 49వ శ్లోకం వరకూ వాహన చిత్రణ, తరువాత 61వ శ్లోకం వరకూ సారథి ప్రశంస, పిదప 72వ శ్లోకం దాకా రథశ్లాఘ, 82వ శ్లోకం పర్యంతం మండల శోభ, ఆటుపై 100వ శ్లోకం వరకూ సూర్యమూర్తి — ఇదీ ఈ శతక పద్ధతి— జగత్త్రయసంసారాన్ని సూర్యుడు ఎలా పాలించుకొనేదీ కన్నుల ఎదుట ప్రత్యక్షీకరించే మహాకావ్యం ఈ సూర్య శతకం అని అనడానికి నేను సందేహించను.

సూర్యశతకం నవరస భరితం. ఇందలి కవిత కన్యగా కాక ప్రౌఢయైన పతివ్రతగా భాసించింది. ప్రతి శ్లోకమూ శ్రుతికి వేదమంత్రం, ఆత్మ బోధకు ఉపనిషత్తు, లోక జ్ఞానానికి పురాణం, కావ్య నిర్మాణానికి వజ్రధార అవుతూ మయూరుని లేఖిని నుంచి ప్రభవించి సూర్యుని వలెనే అనేకార్థ సంపాదకమై ఒప్పుతూంది.

శైలి సులభసాధ్యం కాదుగాని నాతికఠినం. గంభీ రార్థాలకు దేవులాడే వారికి మాత్రం మయూరుని వాక్కు నందలి పదార్థ రసాస్వాదనం.

'ఉద్బాహురివ వామనః' అన్నట్టే అవుతుంది.

ఓజస్సు, కాంతి, అనుప్రాస, యమకం అడుగడుగునా ఎటుకొలతా శతకం అంతా గంభీరమై గౌడరీతిలో నడిచింది. కనుక అవ్యుత్పన్నుల దుష్పరిక్కనంత మాత్రాన మయూరుని కేలాంటి కొరతా వాటిల్లదు.

'వేణ పదాల చెక్కుగ్రీ
టిన పనవోల్పు బాలకుడు శంబసుతం
గరగంగ చేర్పవే'—

అని కవిసార్వభౌముడు చెప్పినట్లు మయూరుని కవితకు గుంఫనములు గూడా 'సోమరిపోతులు కొండరయ్య లోపలి' కొనియాడలేరంటే దోషం ఏ పక్షాన ఉండదు. కాని 7వ శతాబ్దం నుంచి 17వ శతాబ్దం వరకూ ఈ శతకం విద్వాంసులకూ, శిష్ట జనులకూ పారాయణ గ్రంథంగా ప్రభాసించిందని చెప్పవచ్చు. ఇటీవల బొత్తిగా ప్రజలలో ప్రచారం లేక ఈ గ్రంథం తెరచాటున పోవడం ప్రజల దురదృష్టమే అని అనాలి. ముఖ్యంగా సంస్కృత వాఙ్మయ ధురంధరులనిపించు కొన్న ఆంధ్రుల దురదృష్టం కాకపోతే ఈ శతకానికొక్క ప్రతియైనా మన సుప్రసిద్ధ విద్యా సంస్థలలో కూడా కానరాక పోవడం ఏమనాలి ?

మయూరుని కవితా ప్రభావం ప్రాచీనాంధ్ర కవి లోకం మీద ఎంతగానో ప్రసరించింది. కవిలోకంలో అతిరథ మహారథులైన శ్రీనాథాది మహామహులు కూడా కవిస్తుతి సందర్భంలో మయూరనామం రామ నామంలాగా జపించారు. మయూరుని కృతులు ఇహపరిచితములే అయినా విశిష్టపదరచన కలవి కావడం మూలాన సకల కవిలోకాన్నీ అంతగా మోహ పెట్టాయని అనుకొంటాను.

కాశీఖండంలో

'భట్టబాణ మయూర భవభూతి శివభద్ర
కాళిదాసుల మహాకవుల గొలిచి—' అన్నాడు మన కవి సార్వభౌముడు.

తెలుగు కవులలో ఆలంకారికుడు రామరాజభూషణుడు అయిన భట్టుమూర్తి

'ఎవ్వాని వాఙ్మాత్రమువని ధాత్రికి తెచ్చె
ప్రీతిమై కరమమూర్వించుకొనితో'—

అని సహజ ధోరణితో నుతించాడు.

నిరుపమానమైన పాండిత్యంలోనూ, కవిత్వంలోనూ తన సాటివారు లేరని విర్రవీగిన అప్పకవి వంటి వాడు కూడా

'కాళిదాస మయూరాది కవులకైన
కలవు తప్పులు'—

అని వారిపట్ల తనకుగల విధేయతను తెలియచేసుకున్నాడు. అతని దృష్టిలో తప్పుల మాట ఎలా ఉంచి ఉదార కవీశ్వరునిగా మయూరుణ్ణి గ్రహించటమే పరమోద్దేశ్యంగా మనం భావించవలసి ఉంది.

వీరశైవమతాన్ని ప్రతిష్ఠించిన పాల్కురికి సోమనాథుడు వేదాలన్నీ శివమత ప్రతిపాదకాలే అని, పండితారాధ్యుడు ప్రత్యక్ష పరమేశ్వరుడే అనిన్నీ నిర్ణయించి పన్నెండు పదమూడు శతాబ్దాలలో కవితా ప్రపంచంలో జగజెట్టిగా పేర్గాంచిన మహామతి. అతని పండితారాధ్య చరిత్రలో మయూరుని సూర్యశతకం వీరశైవులకు పారాయణ గ్రంథముగా ఉపయోగింపబడినట్లు తెలియవస్తూంది. సకల దేవతామయుడైన సూర్యుని స్తుతి ఆ నాటికే అన్ని మతాల వారికిన్నీ శిరోధార్యమై మహోపాస్యమై ఉన్నదని అనడానికి ఈ ప్రశంస చాలునను కుంటాను.

## మయూరుని కృతి - అనుకృతులు

సూర్య వర్ణన వచ్చే సందర్భాలలో మన కవులు దిగ్దంతుల వంటివారు కవితా శిల్పానికై సూర్యశతకం నుంచి భిక్ష కైకొన్న వారు ఎందరో ఉన్నారు. ఉభయ భాషా పాండిత్యస్ఫోరకంగా కావ్యాలు చెప్పిన ఉద్దండకవి శ్రీనాథకవి సార్వభౌముడు తన ఉత్తమ రచనగా ప్రాయమింతకు మిగులకై వ్రాకుండ వ్రాసిన కాశీఖండంలో మయూరకవి భావాలను ఇట్టే కైవసం చేసుకున్నాడు. వింధ్య గర్వహరణ కథా ఘట్టంలో 'సూర్యోదయ వర్ణనము' అనే శీర్షిక క్రింద వ్రాసిన పద్యాలలో సూర్య శతక శ్లోకములందలి మయూర కవిచేతి చిత్రణ ఉట్టిపడుతున్నట్లుగా తెలుగుకి దిగింది. కాని కవి సార్వభౌముడు తాను తీసుకున్న వజ్రాలకు స్వకీయ ప్రతిభా ప్రభావంతో పదును పెట్టాడు!

'శాతః శ్యామాలషియాః పరశురిత'— అనే మయూరోక్తి శ్రీనాథుని చేతిలో

చిరుపాన పట్టించి చికిలి చేయించిన
గంధ్ర గొడ్డలి నిశాగ పావలతకు—'

అయింది.

కాశీఖండ ప్రథమాశ్వాసంలో 121 నుండి 132 వరకూ ఉన్న పద్యాలు ఈ పరిణామాన్ని తేట తెల్లగా చెప్తున్నాయి. అందులోనూ 121వ పద్యానికి మయూరుని 54వ శ్లోకం, 122వ పద్యానికి 5వ శ్లోకం, 123 పద్యానికి 26వ శ్లోకం మాతృక లవుతున్నాయని చెప్పవచ్చు. (వ్యాసం పెరుగుతుందని భయపడి శ్లోకాలూ పద్యాలూ ఎత్తిచూపలేక పోతున్నాను. జిజ్ఞాసువులు రెండు గ్రంథాలు ఒకచోట ఉంచుకుని చూస్తే తెలుస్తుంది) తృతీయాశ్వాసంలో 174, 175 పద్యాలు మయూరుని 81, 86 శ్లోకాలకు సాక్షాత్తూ అనువాదాలే. వీటిలో ఒక శ్లోకం, ఒక పద్యమూ ఉదాహరిస్తాను :

'క్రామన్ లోలోపి లోకాన్ తదుపకృతి
కృతా వాశ్రితః స్థైర్య కోటిం,
న్యాణాం దృష్టిం విజిహ్మం విదధదపి
కరోత్యం తరత్యంత భద్రాం
యస్తాపస్యాపి హేతుర్భవతి వియమినా
మేక నిర్వాణ దాయా
భూయాత్స ప్రాగవ స్థాధిక తరపరిణా
మోద యోర్కః శ్రియేవః— శ్లో॥ 86

సంచార శీలుడై జగదు పక్రియకునై
సమధిక స్థైర్యంబు జరుపుగాని,
జనుల దృష్టికి వెక్కసంబై విభాసిల్లు
లోక చైతన్యంబు నీకుగాని,
సంతాప హేతువై సంయమి శ్రేణికి
నిర్వాణ లీల యొసగేర్పుగాని,
ఖరరుచిత్వము బూను కాలక్రమంబున
శీతలావృతము వర్తించు గాని
ప్రాగవ స్థాత్యధిక తరోపత్యమన్న
నతిశయిల్లుచు భువనంబులభిరక్షించు
వారకత్యంత సత్కృపా నైభవమున
అనఘ ! రక్షించుచుండు వియుల్లహితుడు—

కాశీ. తృ. ఆ. 175 పద్యం—

ఉభయ వాక్ప్రౌఢితో ఉద్దండకవిత చెప్పిన శ్రీనాథుని వంటి మహామహులకే ఉపాస్య దైవమయిన మయూరుడు ఎంత మహాశిల్పియో ఇక మనం వూహించుకోవలసిందే !— ఇంకో విచిత్రం— మయూరుని స్రగ్ధరలు శ్రీనాథుని సీసములలో గాని ఇమడక పోవడం— ఇది సంస్కృత భాష ఔత్కృష్ట్యమనాలో ? మయూర కవితలోని అర్థ గౌరవమే అనాలో ?, లేక రెండున్నా అనాలో—

పెదుపాల్గవ అలాబ్దం వాడున్నా, భాస్కర రామాయణ రచయితలలో యుద్ధకాండము తరువాయి వ్రాసినవాడున్నూ, భాస్కరుని మిత్రుడు అయిన అయ్యలార్యుడు సూర్యాస్తమయ వర్ణనలో

'మహార్ఘ్య క్రేద్ధితురగః
తరుషుకి పలయుః'— అనే మయూరుని శ్లోకంలో పదాల భావమును

తరువుల యందు పల్లవ ప
దస్థితి పద్రుల యందు ధామబం
ధురగతి—'

అని ఇముడ్చుకున్నాడు— తరువాయి పద్యాలలో కూడా మయూరుని భావాలు పిడల్లాగ ఉన్నాయి.

సంస్కృత వృత్తాలలో స్రగ్ధరా వృత్తానికున్న శోభ మరే వృత్తానికీన్నీ ఉన్నట్టు కన్పట్టరు. అంతేకాదు నడకలో మందాక్రాంతానికున్న బాగు, హొయా కూడా ఉన్నాయి. ఆ ఛందస్సులో అవతరించినది ఈ సూర్య శతకం. కవి వేద వాఙ్మయ ప్రవీణుడు. సూర్యోపాసనాధన్యుడు. వశ్యవాక్కు. అతని భావాలు తన ఇష్ట దైవం లాగా ఛందోమయాలు. అతని జీవితానుభవం అంతా సూర్యశతక రూపాన ప్రకాశమానమై సంస్కృత వాఙ్మయానికే ధన్యత నాపాదించింది. సంస్కృతానంతరమయిన ఇతర భాషలన్నిటికీ అమూల్య మణుల నందించే గని అయింది.

మయూర సూర్య శతకానికి 25 వ్యాఖ్యలు వెలువడ్డాయి. యథాతథంగా అనువదించడానికి చాలా మంది ప్రయత్నించినట్టు విన్నాను. తెనుగులో 1898వ సంవత్సరంలో వ. మ. రాయకవి రాజమండ్రి, సరస్వతి పత్రికలో 'ఆంధ్ర సూర్య శతకము' అనే పేరుతో ప్రకటించారని ఇటీవల తెలుసుకొన్నాను. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు దీనిని తెలిగించారు.

1905వ సంవత్సరంలో శేషగిరి హైకోర్ట్ జడ్జి పిళ్ళై అనే ఆయన ఇటాలియన్ భాషలోకి అనువదించాడు. సింహళీయులలో ఒకరు దీనిని తమ భాషలోకి అనువదించారట—

సంస్కృతభాష వర్ణనవతి, స్వయంపూర్ణము అయినది సంస్కృత భాష. తెనుగుభాష అక్షరాలు మూడైన ఆరు. మరొకరి మతంలో ఇంకొక్కటి కలిస్తే మూడైన దోషం. స్వల్పాక్షర పరిమితమైన తెనుగులో స్వతంత్ర కావ్యం వ్రాయడమే కష్టం. ఇక వేదోపనిషద్ప్రతిపాదకము లైన సూర్యశతకం వంటి కావ్యాలను సంతరించడం ఎంత కష్టమో ఉభయ భాషావేత్తలైన వారికే ఎరుక —,

'నహి వంధ్యా విజానాతి'—

మయూరునితో ఏ విధంగానూ నాకు పోలిక లేదు. ఆదిత్యుని యందలి భక్తి, ఆ భాషయందలి గౌరవం ఏకమై నాకు మయూర దర్శనం కావించాయి. నాకు గల బలమదే. లేకపోతే, స్రగ్ధరకన్నను అల్పపరిమాణమైన శార్దూల మత్తేభ వృత్తద్వయాన్ని ఆధారం చేసుకుని మయూర సూర్య శతకాన్ని నేను అనువదించానంటే ప్రశక్తి అనుకోవాలి ! మూలాన్ని ఎంతవరకూ అనుసరించా నన్నది నేను చెప్పలేను. ఆదిత్యున కభివాదం చేసి మయూర మహాకవి పదాల మాత్ర యింపి చెప్పడం ఆరంభించాను. మూడు రోజులలో పూర్తి అయింది. పగలంతా ఆ దేవుడు చెప్పనివ్వలేదు. నౌకరీ చేసు కోవాలి. రాత్రి మాత్రమే అనువాద క్రియ. అదిన్నీ తొమ్మిది గంటలు దాటితే నిద్రాముద్ర— ఒక మూల అనారోగ్యం. ఇన్నిటినీ సర్దుకుని అనువదించడం పూర్తి చేశాను.

## సూర్య భగవత్తత్వం

సూర్యోపాసన మంత్రాలలో ఒక శ్రేష్ఠమైన మంత్రం కాస్త పరిశీలిస్తాము.

"ఆదిత్యోన్నం తేజ ఓజో బలం యశశ్చక్షుః
శ్రోత్ర మాత్మా మనోమన్యుః మృత్యుస్సత్యో
మిత్రోవాయు రాకాశః ప్రాణో లోక పాలకః
కింకం తత్సత్య మన్న మాయురమృతో జీవో
విశ్వఃకతమః స్వయం భూః ప్రజాపతి రమృత
ఏష పురుష ఏష భూతానా మధిపతిః బ్రహ్మ
ణస్సాయుజ్యం సలోకతా మాప్నోత్యేతాసా
మేవ దేవతానాగ్ం సాయుజ్యగ్ం సార్ష్టితాగ్ం
సమానలోకతా మాప్నోతి య ఏవం వేద'—

మయూరుడు సూర్య శతకాన్ని పూర్తి చేస్తూ చెప్పిన సారవ పద్యం ఈ మంత్ర భావాన్ని యథాతథంగా ప్రతిధ్వని స్తోందని చెప్తూ ఆ శ్లోకం ఈ క్రింద ఇస్తున్నాను.

'దేవఃకిం బాంధవః స్యాత్ ప్రియ సుహృదథవా
చార్య ఆహోస్విదర్యో
రక్షాచక్షుర్ను దీప గురురుత జనకో
జీవితం బీజమోజః
ఏవం నిర్ణీయ పేయఃక ఇహన జగతాం
సర్వథా సర్వదాసౌ
సర్వాకారోపకారీ దిశతు దశశతా
భీశు రభ్యర్థితం వః'—

భావం ఒక్కటే కాదు. శైలి, పదజాలం కూడా వేద మంత్రమునకు తుల్యంగానే ఉంది. 'దశశతాభీశుః' 'సర్వాకారోపకారీ'— అనే పద సముదాయంలోని విశిష్టార్థం లక్ష్య స్ఫూర్తియంగపం.

పై మంత్రాన్నీ, మయూర శ్లోకాన్నీ చూస్తే భారతీయుల ఆదిత్యోపాసనలోని ఆంతర్యం సూక్ష్మంగా గోచరిస్తుంది. సాధారణంగా ప్రతి ఉపాసనలోనూ ఉపాసకుని అధికార తారతమ్యాన్ని పట్టి అనేక ఆకారాలలో ప్రతిదేవుడూ భాసిస్తాడు. అయినా సర్వదా సర్వదా సర్వకాలాలలోనూ ప్రత్యక్షంగా ప్రకాశిస్తూ ఉపకరించే దేవుడు సూర్యుడు మాత్రమే అనేది మంత్ర శ్లోకాల వల్ల విశదమవుతోంది. ఈ ఆదిత్యుడు ఆకాశంలో కనిపిస్తున్న కాంతి గోళంలోనే ఉన్నాడు గాని ఇంకెక్కడా లేడని అనుకోడం సంకుచిత దృష్టిగా భావించ వలసి ఉంటుంది. విశ్వమంతటా బాహ్యాభ్యంతరాలలో నిండి వెలుగుతూన్న చిదాదిత్యునికి సూర్యమండలం ఒక ప్రతీకం మాత్రమే,ఒక అభివ్యక్తి స్థానం మాత్రమే,అని అనేవారున్నారు. సూర్య మండల వర్తి నారాయణుడు అను పేరుతో కాలనిర్మాత అయిన ఆధికారిక పురుషుడొకడుండవచ్చు. కాని సర్వనియంత, అనేక బ్రహ్మాండ జనకుడు అయిన పరమేశ్వరుని కాంతి కిరణలేశము చేతనే ఇతడు భాసిస్తున్నాడనే సత్యమును గుర్తించుకో వలసి ఉంది. ఈ ఉపనిషద్వచనం అవధరించ గోరు తున్నాను.

'నతత్ర సూర్యోభాతి నచంద్ర తారకం
నేమా విద్యుతో భాంతి కుతోయ మగ్నిః
తమేవభాన్తమ నుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి
(కఠోపనిషత్)

'స్వయం ప్రభాత్మకమైన పరబ్రహ్మకు సూర్యాదులు వశవర్తులు అనే విషయాన్ని 'ధియోదేతి సూర్యః' అనే శ్రుతి చెప్తుంది. స్థూల దృష్టితో చూస్తే పాఠకులకు మయూరుడు ప్రశంసించినది సూర్యమండలాదికమే అని తోచవచ్చు. కాని సూర్య మండల మందు మండలాధిష్ఠిత అయిన నారాయణుని మాత్రమే మయూరుడు ఉద్దేశించి ఉండలేదని నా ఊహ. పరిపూర్ణ పరబ్రహ్మను సాక్షాత్కరింప చెయ్యడమే అతని హృదయం అని నా అభిప్రాయం. వర్ణనాత్మకమయిన భాగమంతా సూర్యుణ్ణే ఉద్దేశించి ఉన్నా ఆ శతకంలో ప్రతి పద్యంలోనూ నిగూఢంగా ఉన్న సర్వాత్మభావం పరబ్రహ్మాభిన్నుడైన ఆదిత్యుణ్ణి సూచిస్తుంది. ఈ క్రింది శ్లోకం చూడండి :

'తీవ్రం నిర్వాణహేతుః యదపి చ విపులం
యత్ప్రకర్షేణ భాను
ప్రత్యక్షం యత్పరోక్షం యదిహ యదపరం
నశ్వరం శాశ్వతం చ
యత్సర్వస్య ప్రసిద్ధం జగతి కతిపయే
యోగినో యద్విదంతి
జ్యోతిస్తద్ద్విప్రకారం సవితురవతు వో
బాహ్యమాభ్యంతరం చ—

(సూర్య శ. శ్లో. 29)

మైత్రి యారణ్యకంలో 'సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే సఏకః'— (2—8) అని చెప్పిన సూక్తిని కూడా గమనించ కోరుతున్నాను. అందులో పరబ్రహ్మానుభూతికి ప్రత్యగాత్మ దర్శనం ద్వారమనీ, దానికి ఆదిత్యారాధన మార్గమనీ బోధించే విద్య తెలుప బడుతూంది. ఇక్కడ పేర్కొన్న విద్యవంటివి మరెన్నో విధానాలను మన ఋషులు ప్రసాదించి ఉన్నారు. వాటి అంతర్యాన్ని ప్రసంగించ డానికి అవకాశం తక్కువ అని వాటి జోలికి పోలేకున్నాను. కాని అలాటి మహత్తర విద్యా సాధనలకు ప్రథమ సోపానంగా మయూర సూర్యశతకం ఎంతో ఉపకరిస్తుందని మనవి చేస్తూ ఈ విషయం ఇంతతో ముగిస్తున్నాను.



నేడే చూడండి







రిపబ్లిక్ ప్రొడక్షన్స్



# బొబ్బిలి యుద్ధం



విఖ్యాత దర్శకుడు
సీతారామ్

నవయుగ

— VIJAYA PUB.

# ప్రజలు ప్రభుత్వము

## శ్రీ జాన్ స్ట్రాచీ

విప్లవం తరువాత, రష్యా పెద్ద పారిశ్రామిక రాజ్యంగా తయారవటం మహదాశ్చర్యకరమైన విషయం అని అన్నారు. కమ్యూనిస్టు సంఘంతప్ప మరేదీ దానిని సాధించ గలిగియుండేవారు కాదన్నారు. రష్యా సాధించినది తప్పక పలసిందైనా, వారు పొగడినంతగా లేదని నా అభి ప్రాయం. అయితే 1917 సం. లో రష్యా ఉన్న స్థితి నుండి, ప్రపంచంలో పెద్ద పారిశ్రామిక రాజ్యాలలో ఒకటిగా తయారు చేయటం చాలా గొప్ప విషయం. దానికి సాటి లేదనటంమాత్రం తప్పు. అనేక దేశాలు వేరు వేరు ఆర్థిక విధానంక్రింద ఇంత ఆర్థికాభివృద్ధిని సాధించాయని, ఈమధ్య వచ్చిన ఆర్థిక చరిత్రను జాగ్రత్తగా గమనిస్తే తెలుస్తుంది.

అంతేకాదు, రష్యా ఈ అభివృద్ధిని సాధించటానికి తీసి కొన్న వ్యవధిని చూస్తే, అది కూడా అంత గొప్ప విషయ మేమీకాదు. 1917 సం. లో రష్యా మరీఅంత వెనుకబడిన స్థితిలోలేదు. అది అప్పుడున్న స్థితినుండి నేడున్న స్థితికి రావాలంటే సాధారణంగా 45 సం. లు పడుతుంది. వేరే ఆర్థిక పద్ధతిక్రింద, అన్ని సంవత్సరాలలో అంత అభివృద్ధిని సాధింప గలిగిన దానికి జపాను పెద్ద నిదర్శనము. రష్యా అభివృద్ధిని గురించి చెప్పే మరో విషయంలో కూడా జపాను సరి సమా నంగానే నిలబడింది. అతి ఘోరమైన రెండు మహా యుద్ధా లను తట్టుకొని కూడా రష్యా ఈ ఉన్నతస్థాయికి రావటం మహా విశేషమంటారు. అయితే జపాను విషయంలో కూడా ఇది వర్తిస్తుంది. ప్రథమ ప్రపంచయుద్ధంలో రష్యా జపానుకంటె ఎక్కువ దెబ్బతిన్నది. కాని రెండవ యుద్ధంలో జపాను సంపూర్ణంగా హతమైపోయింది. అసలు ఈ రెండు మహా యుద్ధాల మధ్యకాలంలో చాలాకాలం చైనాను జయించా లనే ప్రయత్నంలో చాలా ఆర్థిక నష్టానికి లోనైంది. అయి నప్పటికి కూడా జపాను జాతీయ ఉత్పత్తి శక్తి రష్యా కన్న ఎక్కువ వేగంతో జరిగింది.

దీనికి సంబంధించిన లెక్కలతో మిమ్మల్ని విసిగించదలచ లేదు. అవి అంత నమ్మదగినవి కూడా కావు. అయినా దేశాలు సాధించిన ఆర్థికాభివృద్ధిని కొలవటానికి ఆర్థికవేత్తలు చాల ప్రయత్నిస్తారు. అలా కొలవటానికి ఒక నిర్దిష్టమైన కొలత బద్ద ఉండటం అవసరం. జాతీయ ఉత్పత్తిని చూపే అంకెలు సాధారణంగా అనుకున్నంత సరియైనవికావు. ఉజ్జా యింపుగానే ఉంటాయి.

ఈ సందర్భంలో జపాను ఒక్కటేకాదు, సోవియట్ కూడా అదే కాలంలో అతివేగంగా ఆర్థికాభివృద్ధిని సాధించింది. ఆర్థిక వేత్తల కొలతల ప్రకారం కొన్ని కొన్ని సంవత్సరాలలో ప్రపం చంలో మరే దేశం కంటే కూడా తొందరగా అభివృద్ధిని సాధించిన దనవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధము తరువాత పదిహేడు సంవత్స రాలలో అందరు ఆశ్చర్యపోయేటంత అసాధారణ వేగంతో పశ్చిమ యూరపు దేశాలు కోలుకున్నాయి. 1917 సం. లో రష్యా స్థితికంటె వీరి స్థితి బాగా ఉన్నమాట నిజం. ఒకొక్కప్పుడు అకళంకకరంగాను, ఎగుడు దిగుడుగాను వున్న ఈ 17 సంవ త్సరాలలోనూ, బ్రిటను, అమెరికా దేశాలు సాధించిన అభి వృద్ధి ఇంతకుముందు ప్రపంచములో ఎక్కడ వచ్చిన అభి వృద్ధితోనైనా పోల్చిచూస్తే అధికంగానే ఉంటుంది.

ఇంకా ప్రాథమిక దశలోవున్న భారతదేశం కూడా సంవత్సరానికి 4% చొప్పున అభివృద్ధిని సాధిస్తోంది. ఆర్థిక వేత్తల లెక్కల ప్రకారం త్వరలోనే 6% అభివృద్ధిని సాధించ గలదని ఆశించవచ్చు. దేశ జనాభా సంఖ్య దృష్ట్యా ఇది మందగమనమని అనుకున్నా, ఇంతకు పూర్వం ఎప్పుడు జరిగిన దానితోనైనా పోల్చిచూస్తే అత్యద్భుతమైన వేగముతో సాగి పోతున్నదనే చెప్పవచ్చు.

ఇలా భిన్నమైన ఆర్థిక విధానాలక్రింద అనేక దేశాలు, విప్లవానంతరం రష్యా అభివృద్ధి చెందినంత వేగంలో అభి వృద్ధి చెందినట్లు ఉదాహరణలు ఇంకా అనేకం ఇవ్వవచ్చు. ఒకదేశం ఏదోవిధంగా పారిశ్రామిక అభివృద్ధి సాధ్యమవటతో

పూర్వం మానవ సంఘాలు ఎప్పుడూ అందుకోని వేగంతో అభివృద్ధి చెందగలవని దీనివల్ల రుజువు అవుతున్నది. ఒకదేశం ప్రధానంగా పెట్టుబడిదారీ విధానం, స్వేచ్ఛా విధానం, కమ్యూనిస్టు విధానం, లేకపోతే భారతదేశం అనుసరిస్తున్న మధ్యే మార్గాన్ని అవలంబిస్తున్నా, ఇది నిజమని తేలుతున్నది. ప్రతి విధానంలోను కొన్ని సౌకర్యాలు ఉన్నాయి. అసౌకర్యాలూ ఉన్నాయి. అయితే వీటిలో ఒకదానికి ఒకదానికి ఉండే భేదం అనుకున్నంతగా లేదని అనుభవంవల్ల తేలింది.

1970–80 సం. ల నాటికి రష్యా జాతీయ ఉత్పత్తి అమెరికనుల ఉత్పత్తిని మించిపోతుందని అందరిని హడలు గొట్టిన రష్యన్ జోస్యాలు సంగతి ఏమిటని అడగవచ్చు. ఈ రెండు దేశాల అభివృద్ధి పెరుగుదలను పోల్చిచూస్తే వారి జోస్యాలు సత్యమనే అనిపిస్తుంది. రష్యా, అమెరికా శాస్త్రవేత్తలు ఈ అంకెలను పరిశోధిస్తూ ఉంటారు. వారి లెక్కలలో చాలా భేదం ఉన్నా, అవన్నీ ఒకే లక్ష్యాన్ని చూపిస్తున్నాయి. అయితే వారు నిరూపించింది అనేకమంది అనుకున్నంత గొప్పగా కనపడదు. పారిశ్రామిక సంపదలో ఆలస్యంగా బయలుదేరినవారు అధిక ప్రయాసతో ముందు వారిని అందుకోవచ్చు. పారిశ్రామికాభివృద్ధిలో ఇతర దేశాలను అందుకోవడానికి రష్యా ఇదేవిధంగా తన ప్రజలను బలవంత పెట్టి, అధిక ప్రయాసకు గురిచేసింది. అమెరికాదికాని లేక పశ్చిమ రాజ్యాల సంపన్నస్థితినిగాని చేరుకోగానే సమాజోత్పత్తిని సూచించే అంకెలు సాధారణ అభివృద్ధికి దాదాపు నిదర్శనం కావాలి.

ఆర్థిక సమస్యలకు సంబంధించిన చర్చనీయాంశాలలో ఇరుక్కోవడానికి సిద్ధపడే, ఒక ఉదాహరణను ఇస్తాను. నాకు తెలిసినంతవరకు "జాతీయోత్పత్తి" అనేదానిని రష్యనులు ఒక విధంగాను, పశ్చిమ దేశాల ఆర్థికవేత్తలు మరొక విధంగాను చూస్తారు. వారి మార్క్సు సాంప్రదాయాన్ని అనుసరించి రష్యనులు కేవలం వ్యవసాయ పారిశ్రామిక సమష్ట్యుత్పత్తులను మాత్రం లెక్క వేస్తారు. అంటే ఇన్ని టన్నుల ఉక్కు, ఇన్ని టన్నుల గోధుమలు. ఇంత పత్తి. ఇన్ని జతల బూట్లు, ఇన్ని యంత్ర పరికరాలు అని చెబుతారు. అంతేగాని మామూలుగా మనం అనుకొనే "సర్వీసు ట్రేడ్సు" (Service Trades) అంటే సరుకులు అందజేయడానికి అవసరమైన ప్రయత్నాన్ని వారు లెక్కలోనికి తీసుకోరు. అంటే టోకు వ్యాపారం, చిల్లర వ్యాపారం. వస్తురూపంలో కనపడనివానికి చేసే ప్రయత్నం మొదలైనవి.

జాతీయ ఉత్పత్తిని ఒక మహా పర్వతమంత వస్తువుల రాసిగా అనుకోవడం, మార్క్సిస్టు సాంప్రదాయాన్ని అనుసరిస్తున్నట్టుగా రష్యన్ ఆర్థికవేత్తలు అనుకుంటారు. కొన్ని సందర్భాలలో వారు అనుసరిస్తున్నారు. ఎందుకంటే టోకు వ్యాపారం, చిల్లర వ్యాపారం. అసలు వ్యాపారం అనేవి వస్తువుకు విలువ తీసుకురావని మార్క్సు వ్రాశాడు. ఆయన చేసిన "శ్రామిక విలువ "సిద్ధాంతం"మే ఈ అభిప్రాయానికి ఆధారం. ఈయన ఈ సిద్ధాంతాన్ని రికార్డో అనే ఆర్థిక శాస్త్రవేత్తనుంచి తెచ్చుకున్నాడు. ఆ సిద్ధాంతం ప్రకారం "(వ్యక్తి) సాంఘిక జీవనానికి అవసరమైనంతవరకు శ్రమించిన కాలాన్ని బట్టి" వస్తువు విలువ నిర్ణయించాలి. మార్క్సు గొప్ప ఆలోచనా శక్తిగల వ్యక్తి. అందుకనే సరుకులు అన్నీ వస్తురూపంలో ఉండేవేకావు అని ఆయన గ్రహించాడు. అందుకనే వాంఛను తీర్చేదే సరుకు అని నిర్వచించాడు. ఆ వాంఛ అనేది ఉదరంనుంచి రావచ్చు. ఊహనుంచి రావచ్చు" అని చెప్పాడు.

దేశ ఆర్థికస్థితి అభివృద్ధి చెందినకొద్దీ ఉత్పత్తి కావలసిన వస్తువులు ఉదరంనుంచి వచ్చే వాంఛలనుకాక, ఊహనుంచి వచ్చే వాంఛను తృప్తి పరచడానికి చేయవలసి వస్తుంది. ఇది తప్పనిసరి. ఉదరపోషణ అయిన తర్వాతకాని ఇతర విషయాలపట్ల మన దృష్టి మళ్లదు. ఆ తర్వాత అన్ని రకాల కోరికలు, అవసరాలు మన బుర్రలో పుట్టడం ఆరంభిస్తాయి. ఇవి తరచు పట్టే సరుకులతోకాక ఒకవిధమైన "సేవ"తో తీర్చవలసి ఉంటుంది. ఆ సేవకు మనం డబ్బు ఇవ్వడానికి ఇష్టపడతాము. ఈ వాంఛలలో కొన్ని ఆకలిని తీర్చే ఆహారాన్ని మించిన దానికన్న గొప్పవికాకపోవచ్చు. (వాటిలో కొన్ని చాలా వ్యయంతో కూడినవి) అవి నాటక, సంగీత కచేరీ టిక్కట్లు కావచ్చు. లేకపోతే అపూర్వ అతి సుందర వస్తువును సందర్శించటం కావచ్చు.

కాబట్టి బాగా అభివృద్ధి చెందిన దేశాలలో సరుకులను కుప్పగా చేయడంతో సరిపోతుందని అనుకోకూడదు. ఉదాహరణకు స్త్రీల కేశాలంకరణను తీసుకోండి. ఒక కాలంలో స్త్రీలు టోపీలను పెట్టుకొనడం మోజుగా ఉండేది. ఆ తర్వాత ఈ టోపీలను వదలి, అంతకంటె ఎక్కువ ఖర్చు అయ్యే కేశాలంకరణ షాపులలోకి వెడుతూ వచ్చారు. ఈ రెండు వాంఛలు ఊహకు సంబంధించినవేకాని ఉదరానికి సంబంధించినవికావు. ఈ వాంఛను తృప్తిపరచడానికి చేయవలసిన కృషి మొత్తం సంఘానికి గల ఉత్పత్తి శక్తిలో కొంత లాక్కుంటుంది. మొత్తం జాతీయ ఉత్పత్తిని లెక్కగట్టడానికి సరుకులు అంటే మామూలుగా చెప్పే అర్థానికి మాత్రమే అంటిపెట్టుకొనిఉంటే స్త్రీల టోపీల ఉత్పత్తికి వ్యయమైన ప్రయత్నాన్ని మాత్రమే లెక్కకు తీసుకుంటాము. కేశాలంకరణకు జరిగిన ప్రయత్నాన్ని తీసుకోము. ఇలా చేయటం సరైన పద్ధతికాదు. అది తప్పుడు నిర్ణయాలకి దారి తీస్తుంది. ఆర్థికాభివృద్ధి బాగా జరిగినప్పుడు, ఆ యా దేశాలలో జరిగేదానికి ఇది ఒక ఉదాహరణ. కేవలం అవసరంగా సరుకులను ఇవ్వడంకోసంకాక, ఎక్కువ సదుపాయాలతో జీవితాన్ని ఆహ్లాదకరంగా చేయడానికి అవసరమైన వాటికోసం "సర్వీసు ట్రేడ్సు"—లో ఎక్కువ ఆర్థిక ప్రయత్నం చేయడం జరుగుతుంది.

రష్యా ఆర్థిక ఉత్పత్తి శక్తి అమెరికా శక్తిని దాటిపోతుంది అని అరవు క్రుశ్చేవ్ చెప్పిన జోస్యం సందేహాస్పదం అని చూపడానికి ఇదంతా చెప్పాను. ఏదో ఒకరోజున అమెరికా కంటె రష్యా ఎక్కువ (సంవత్సరానికి) టన్నుల ఉక్కును తయారు చేయవచ్చు. చేసిందనుకొనండి. అయితే ఏమిటి? అంతమాత్రంతో ఏమీకాదు. అప్పటికి ఆర్థిక అభివృద్ధికి మరొక లోహం ప్రధానం కావచ్చు. ఒక దేశానికి ఉన్న ఇంజనీర్ల, నైపుణ్యంకల పనివారలున్న సంఖ్యనుబట్టి ప్రాధాన్యత రావచ్చు. అభివృద్ధి అనేది బాగా పెరిగినప్పుడు జాతీయోత్పత్తిని పోల్చడంలో అర్థంలేదు. ఇలా అనడం మూలాన ఆర్థికాభివృద్ధికి ప్రాధాన్యత లేదనికాదు. జీవిత ప్రమాణం తక్కువ స్థితిలో ఉన్నప్పుడు ఇది చాలా ప్రాముఖ్యత కలిగి ఉంటుంది. అయితే ఆర్థిక అభివృద్ధిని పోల్చి చూడటం అనేది ఒక రకమైన దృష్టితో చూడాలనేదే నేను చెబుతూ వచ్చింది.

ఆర్థిక శక్తి తర్వాత అంతగా ఆకర్షించేది రష్యా సైనిక శక్తి. అయితే ఇక్కడ ఒక సందేహం ఉంది. సైనిక శక్తి నిదర్శనంగా రష్యా స్పుట్నిక్‌ను తయారు చేసింది. దాని సైనిక శక్తిని ప్రదర్శించింది. బ్రహ్మాండమైన అణ్వస్త్ర పరీక్షలు జరిపింది. ఇవన్నీ అతి అధునాతనమైన శాస్త్ర పరిశోధనను ఆధారం చేసుకొని తయారు చేయబడినవి. కాబట్టి రష్యా సాధించిన దానిని తక్కువ చేయాలని నా ఉద్దేశ్యం ఎంతమాత్రంకాదు.

అయితే ఒకటి కనబడుతుంది. ప్రత్యేకంగా దానికోసమే ఈ జాతీయ సంపదలో ఎక్కువ భాగాన్ని, శాస్త్రజ్ఞుల ప్రతిభను, నైపుణ్యాన్ని ఎక్కువగా సైనిక శక్తి కోసమే వినియోగిస్తే, ఆశ్చర్యకరమైన సైనిక శక్తిని సాధించవచ్చు. రష్యా అలాగే చేసింది.

రష్యా అలా చేయడానికి కారణం తెలుసుకొనడం కష్టం కాదు. విప్లవం వచ్చినప్పటినుంచి తాము శత్రు ముట్టడిలో ఉన్నామని భావించారు. తమ మనుగడ తమ సైనిక శక్తిమీద ఆధారపడి ఉందని విశ్వసించారు. ఆధునిక సైనిక శక్తికి అన్నిటికన్న మించిన ప్రాధాన్యం ఇచ్చారు. మిగతా దేశాలు కూడా తప్పు దోవను బడి, రష్యా అలా భావించడానికి అవకాశమిచ్చారు. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం బోల్షివిక్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి కొంతమంది కలుగజేసుకున్నారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం మధ్యలో హిట్లరు రష్యామీద దండయాత్ర చేశాడు. అందుకని ముట్టడింపబడిన కోటలో ఉన్నామనే భావన ఇంకా రష్యనులను వదలలేదు. ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే అలా అనుకొనడం, అవసరమా? దానికి అర్థం ఉన్నదా?

రష్యా ఆయుధ విసర్జనచేయాలని ఎవ్వరూ అనరు. ప్రపంచంలో ఇతర దేశాలకు ఆయుధ శక్తి ఉన్నప్పుడు ఏ దేశమూ ఎప్పుడూ అది కమ్యూనిస్టు దేశమైనా, కేపిటలిస్టు దేశమైనా, భూస్వామిక దేశమైనా, [illegible] దేశమైనా ఆయుధ విసర్జన చేయలేదు. దేశాలు ఎప్పుడైనా అలా చేస్తాయని అనుకొనడం వట్టి ఆశ కావచ్చు. అయినా రష్యనులు ఆయుధ నిర్మాణంపట్ల చూపెట్టిన శ్రద్ధ ఒక వెర్రిగా కనబడుతుంది. నే నింతకుముందు వివరిస్తూ వచ్చిన ఆర్థికవేత్తల లెక్కల ప్రకారం బ్రిటన్ తన జాతీయోత్పత్తిలో ఏడు వంతులు ఆయుధ నిర్మాణంకోసం వ్యయపరుస్తున్నది. అమెరికా పదివంతులు ఖర్చు పెడుతున్నది. రష్యనులు కనీసం పదిహేను వంతులు వెచ్చిస్తున్నారు. ఈలో జనులకు కూడా అభివృద్ధి విషయంలో తీవ్రమైన ఆర్థిక సమస్యలను రష్యా ఎదుర్కొంటున్నది. అందుకని ఆ దేశం పదిహేను వంతులు ఆయుధాల కోసం ఖర్చు పెట్టడం విపరీతం. సైనికంగా రష్యా సాధించింది చాలా గొప్ప విషయం ఇది సాధించడానికి సమగ్రమైన చారిత్రక కారణాలు ఉన్నాయి. అయితే ఇదొక మహోద్వృత వర్గ కాదని జాతీయతాభావం గల దేశం, ఆ భావంగల దేశాలు ఎప్పుడూ వ్యవహరించినట్లే, వ్యవహరిస్తుందన్నది ఈ సందర్భంలో గమనించవలసిన విషయం. జాతీయతాభావం గల దేశాలన్నీ ఆయుధ నిర్మాణంలో పోటీ పడుతూ వచ్చాయి. రష్యా వారందరిని కాస్త మించింది. ఆర్థిక—సైనిక రంగాలలో రష్యా సాధించినవి నిజంగా గొప్పవి. కాని పోటీలేనివని అనడానికి వీలులేదు. రష్యా ఉన్న స్థితిలోనే ఉండి వేర్వేరు ఆర్థికవిధానాల కింద ఉండిన ఇతర దేశాలు సాధించినవే వీరూ సాధించారు. సైనిక—పారిశ్రామిక శక్తిని అభివృద్ధి చేసుకొనడంలో ఏ దేశమూ చేయనంత పట్టుదలతో రష్యా కృషి చేసింది. ఇక్కడ రెండు ప్రశ్నలు వేయాలి. ఒకటి అంతగా పటిష్టమైన శక్తిని కేంద్రీకరించడం వాంఛనీయమా? రెండు. దీనికి మనం చర్చిస్తున్న విషయానికి అంటే ప్రజాస్వామిక వ్యవస్థలకు సంబంధం ఏమిటి? మొదటి దాని విషయంలో నా సమాధానం వ్యతిరేకం. ఇంత వెర్రి పట్టుదలతో భారీ పరిశ్రమలను, ఆయుధాలను పెంచటం రష్యాకిగాని ప్రపంచానికిగాని మంచిదికాదని నా అభిప్రాయం. విప్లవం తర్వాత జరిగిన ఈ 45 సంవత్సరాలలోను భారీ పరిశ్రమల మీద కొంత ఎక్కువ శ్రద్ధ చూపి, నిత్య జీవితావసరవస్తువులను ముఖ్యంగా వ్యవసాయోత్పత్తిని అధికం చేయడానికి ప్రయత్నించినట్లయితే రష్యా అభివృద్ధివేగం ఇంత సన్నగిల్లేది కాదని నా అభిప్రాయం. దానిని గురించి విపులంగా వివరిస్తూ చర్చకు దిగటానికి ఇది సమయంకాదు. కాని అలా చేసి ఉంటే రష్యా ఆర్థిక వ్యవస్థ సమన్వయంగా ఉండి, ఇప్పటికంటె బలంగా ఉండేది. ఇప్పుడు ఉత్పత్తి చేస్తున్నంత ఉక్కును యంత్ర పరికరాలను, ఉత్పత్తి చేయలేక పోవచ్చు. కాని ఇప్పటికన్న ఎక్కువ గోధుమలు, పాలు, మాంసం పాదరక్షలు మొదలైనవి ఉత్పత్తి చేయగలిగి ఉండేది. అది అందరికీ శ్రేయస్కరంగా ఉండేది.

# ఏది అభ్యుదయ కవిత?

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

భారతి అక్టోబరు సంచికలో 'అక్షయ' అనే కలం పేరుతో ఎవరో వ్యాసము వినవతో నా ఆగస్టు సంచిక "రాత్రి" సమీక్షను విమర్శించారు. "కవి బాధను చదువరులలో రేకెత్తించె రచనచేస్తే ఆ బాధ ఫలితము వారి సంస్కార మవుతుంది. అది అభ్యుదయ రచన అవుతుంది" అని ఒప్పుకొంటూ "నిష్కృతిలేని బాధలు వర్ణించి కవులు సాధించగలిగేదిలేదు" అన్నానట నేను. అవును, ఈ రెండు వాక్యాలూ చేర్చి చూచితేనే నా అభిప్రాయము పూర్తి అవుతుంది. "నైష్ఫల్య సమాధి దగ్గర పరిదేవనముచేసి లాభమేమిటి?" అని ప్రశ్నించానట నేను. అవును. నిరాశను, దానికి దారితీసిన కారణాలు చూపకుండా ఎవరేనా "ఇంతేలే, జీవితమంతా విఫలమ్మలే, నైరాశ్యమంతా దానవులే, దివసములు మేకుల బాకులులే మనవారంతా వెధవలులే" అని వ్రాస్తే క్షాళనము కావలసిన కల్మషము సూచనగానైనా తెలియకపోడమువల్ల చదువరు లల్లో సంస్కారము బదులు తిరస్కారము జనిస్తుంది. అది అభ్యుదయ కవిత్వము కాదంటాను. "సాహసమనిపించుకొంటుంది"న్నారు విమర్శకులు. ఏం చెయ్యను? చెప్పవలసినది శక్తివంతంగా చెప్పాలని నా యత్నం. "బహుక్రూరము"గా విమర్శించారని 'అక్షయ'గారూ మరోలాగా ఇంకొకరూ ఇంకోలాను, వేరొకరూ అనుకుంటే 'కానీండి' అంటాను. "ఆశా నిరాశలను వస్తువులుగా తీసుకొనకపోతే ఇక ఏ విషయం వ్రాయగలడు?" అని నిలవదీసి అడిగేరు అక్షయగారు. "నిష్కృతిలేని, అది సూచనగానైనా స్ఫురించని మనస్సులోని తీరని కోరికలు, ఆవిరులైపోయిన అనురాగాల మేఘాలు, అర్ధాకలి సరాల పేటులూ ధుమ్ములో కలిసిపోయిన వలపుల మల్లికలు" గుదిగుచ్చి వ్రాస్తే చదువరికి సానుభూతి కలగదూ, (ఆఫ్రికాలోని) ఎపార్థియుడూ, (అమెరికా) నీగ్రో ఆత్మకథ, 'ప్రాణములొడ్డి ఘోర గహనాటవులు నరికి, భూమిని దున్ని పండించినా దుష్పరిస్థితులవల్ల నాలుగువేళ్లూ నోట్లోకిపోని కర్షకుని అర్ధాకలి సరాలపేట్లూ, శక్తి దూరపు చూపూ ఉండి దేశానికి మంచి చేయగలిగినవాడికికాక ధనవంతుడికీ కులమొసగాడికీ అవకాశమిచ్చే అధ్వాన్నపు పరిస్థితులవల్ల ఆవిరులైపోయిన ఆశామేఘాలూ చిత్రిస్తే చదువరులలో కలకలము పుట్టుతుంది' అంటాను నేను. కోరికలే గుర్రాలైతే అందరూ రౌతులే. నా కోరిక నెరవేరితేనే లక్ష్మీపతివారికి సానుభూతి. ఒక రచయితకి "వెనక వైపున ఇంకొక తలా, రెండు చేతులూ ఉంటే ఎప్పుడూ దానుకుంటూ ఉందునే" అన్న కోరిక కలగవచ్చును. ఇంకొకరికి 'ఈ శరీరము నల్లగాకాక తెల్లగా ఉంటే ఎంతమంది వరించి ఉండేవారూ' అనే వలపు మల్లికలు పూయవచ్చును. మరిఒకరికి "ఆయన హాయిగా వారానికి ఒక దేశము చూస్తున్నారు. నాకు వీలులేకపోయిందే" అన్న నిరాశ కలగవచ్చును. ఆశ, నిరాశ అన్నవి సహజముగా సాధ్యములూ, సబబులూ అయిన ఆదర్శాలను గురించినవైతే, అలాటి వని చదువరికి విశ్వాసము కలిగితే, కావలసిన సంస్కారము జరుగుతుంది చదువరిలో. అది అభ్యుదయము తెస్తుంది.

విధి వైఫల్యాలుకాదు పతకులముందు నిలబెట్టడమూ, సహజములూ నెరవేరని కృతక పరిస్థితులవల్ల విరిగినవీ అయిన వైఫల్యము వాటి పరిస్థితులతోపాటు నిలబెట్టండి, అదీ అభ్యుదయ కవిత్వమూ" అంటాను. "కట్నం డబ్బులు లేక పెళ్ళికాని కన్యగతి విచారకరము. కట్నము ఆమె సంపాదించవలసినదికాదు. అయినా ఆమె బ్రతుకుని బర్బరం చేస్తోంది. నేరముగా చేయవలసినట్టిది, జరిగిపోతూ సాగుతోంది. ఇది అన్యాయము" అని చదువరికి అనిపిస్తే అభ్యుదయము కలగడానికి వీలు. "పెళ్ళికాని కన్య" అని మాత్రమే అంటే ఆ పెళ్ళి ఎందుకు కాలేదో? ఆమె వక్రపనుా కారణము కావచ్చునుగదా! "ఎదిగిన దానికి పెళ్ళికి తలపెట్టని.... మయ్యా గొయ్యా చేతగాక కడుపుకొరకు వడుపువృత్తి చేబట్టిన......తరుణు"లనా, చదువరుల సానుభూతినే రేకెత్తిస్తారుకాని పట్టెనె వడుపు వృత్తి చేబట్టినవారు తిరస్కారమే లేపుతారు. కవిగారు "పట్టనే" అని అనకపోయినా, కారణము చెప్పనివన్నీ లేనివాటితో చేరిపోతాయి. కారణాలు సూచించక పోయినా మీరు చిత్రించిన ఆశ, నిరాశలతో నూరింటి కాళ్ళ గాళ్ళే జోడించుకోమంటారా? అలాగేలెండి.

ఆశ మానవశక్తి ఎప్పుడూ ముందుకే లాగుతూంటుంది గదా, అది చిత్రించడము అభ్యుదయము కాదా? అని అడుగుతా

ఆయన వయస్సు 72. ఆయన కొంతకాలంగా పుట్టకురుపు వ్యాధితో బాధపడుతున్నారు. 1962 ఆగస్టునుంచి హాల్డేన్ దంపతులు ఒరిస్సా ప్రభుత్వం తాలూకు పరిశోధనా సంస్థలో పని చేస్తున్నారు. డాక్టర్ హాల్డేన్ భారతీయ పౌర సత్వం స్వీకరించారు.

డాక్టర్ హాల్డేన్ కోరిక ప్రకారం ఆయన భౌతిక కాయానికి అంత్యక్రియలుగాని, పూలమాలలు ఉంచడంగాని జరగలేదు. వైద్య పరిశోధనార్థం దానిని కాకినాడలోని రంగరాయ వైద్య కళాశాలవారికి అప్పగించారు.

1964 ఫిబ్రవరిలో శస్త్ర చికిత్సకోసం డాక్టర్ హాల్డేన్ లండన్ వెళ్లారు. అప్పుడు బి. బి. సి. వారు కోరగా, తన మరణానికి సంబంధించిన అంశాలను గురించి ఒక ప్రసంగాన్ని టి. వి. రికార్డుగా ఇచ్చారు. ఆయన బి. బి. సి. ప్రసంగం పూర్తి పాఠాన్ని న్యూసైంటిస్టు అనే పత్రిక ప్రచురించింది. భారత దేశాన్ని గురించి, భారతీయ విద్యార్థులను గురించి ఆ ప్రసంగంలో డాక్టర్ హాల్డేన్ ఇలా అన్నారు:—

"ఇప్పుడిది 1964 ఫిబ్రవరి. ఇది నా మృతికి సంబంధించిన విషయంగా భావించబడినది కనక, ఇది 1975 వరకు అనగా నాకు 82 ఏండ్ల వయస్సు—బహుశా ముసలితనం—వచ్చేవరకు చూపించబడదని ఆశిస్తాను. నన్ను గురించి ప్రజలు, అందులోను మూరేండ్ల తర్వాత ఏమనుకుంటారనేది నేను నిజంగా పట్టించుకొనను. నా భార్య, స్నేహితులు బ్రతికి ఉన్నంతకాలం, నన్ను గురించి ప్రజలు ఎక్కువగా విమర్శించడం అనేది నాకు సరిపడదు. చెడుగాని, మంచిగాని నేను చేసిన దేమిటి అన్నదే ప్రధానముగాని, ప్రజలు నన్ను గురించి ఏమనుకుంటారన్నది మాత్రంకాదు."

"నేను 1957 లో భారతదేశం చేరుకున్నాను. అందుకు ఒక కారణం ఆదేశం అంటే నాకు ఉన్న ప్రేమ. ఆ ప్రేమలో నేను పడిపోయాను. మెసపొటేమియాలో నేను ఒకసారి గాయపడ్డాను. ఇప్పుడు దానిని ఇరాక్ అంటున్నారు. ఇది 1917 నాటి సంగతి. అప్పుడు నేను మొదటిసారి భారత దేశాన్ని చూశాను. తర్వాత కూడా చాలాసార్లు వెళ్లాను. నాకు అక్కడ నివాసం ఏర్పరచుకోవాలని అనిపించింది. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా చాలాసార్లు చూశాను. అయితే భారతదేశంలో స్థిరంగా ఉండిపోవాలంటే, అక్కడ నా సహచరులతో కలిసి మెలిసి ఉండాలి. మేమంతా సమాన స్థాయిలో ఉండాలి. ఇది సంభవం కానప్పుడు నేను వెళ్లడం అనవసరం. ఇప్పుడు భారతదేశంలో స్థిర నివాసం ఏర్పరచుకొన్న తర్వాత అట్లా చేయ గలుగుతున్నాను. కొంతమంది శాస్త్రజ్ఞులైన నా స్నేహితులు, నేను ఆత్మహత్య చేసుకున్నానని అన్నారు. కారణం నాకు విశ్వ విద్యాలయ కళాశాలలో ఆచార్య పదవి ఉంది. అది ఇంకొక మూడేళ్లలో అయిపోతుంది. అది పూర్తి చేసుకొని వెళ్లరాదా అని వాళ్ల భావం. నేను అట్లా చేయలేదు కాబట్టి ఆత్మహత్య చేసుకున్నానని అన్నారు.

"నేను ఈ మాట కచ్చితంగా చెప్పగలను. భారతదేశంలో నేను చేసిన పని గొప్పది. ప్రయోజనకరంగా జరిగింది. ఫలప్రదంగా సాగింది. కష్టాలు లేవనను. ప్రతిబంధకాలు కూడా ఉన్నాయి. కావలసిన పరికరాలు దొరకవు. అనుకున్న పనులు అనుకున్నట్లు జరగాలంటే, జరగవు. ఇక్కడికంటె కూడా చాలా కష్టం. అయితే బయటికి వెళ్ళి పరిశోధనలు కొన సాగించేందుకు ఉన్నవీళ్లు బ్రహ్మాండమైనవి. జంతువులమీద, వృక్షాలమీద, మనుష్యులమీద పరిశోధనలు సాగించవచ్చు. మళ్లీ మంచి పని చేసేందుకు బుద్ధిమంతులైన కుర్రవాళ్లు పుష్కలంగా ఉన్నారు. ఇక్కడ కేంబ్రిడ్జిలో ఎట్లాగో అక్కడ అట్లాగే. నేను అక్కడ పది సంవత్సరాలు ఉన్నాను. లండన్‌లో నేను ప్రొఫెసర్‌గా ఉన్నప్పుడు నా దగ్గర చదువుకున్న విద్యార్థులకంటె, ఈ విద్యార్థులు మొత్తంమీద ఎంతో మెరుగు అనిపించింది."

డాక్టర్ హాల్డేన్‌వంటి మహాశాస్త్రవేత్త ఈ మాటలు అన్నాడంటే ఆయనతో కలసి పని చేసిన భారత విజ్ఞాన శాస్త్ర పట్టభద్రులు ఎంతటి శక్తి కలవారో విశదం అవుతున్నది.

# "తెలుఁగొకండ" అంటే?

శ్రీ మల్లెల నారాయణ

ఆ. తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను
తెలుఁగు వల్లభుండఁ దెలుఁగొకండ
యెల్ల నృపులుఁ గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందు తెలుగు లెస్స."

(ఆశ్వా. 1—15 పద్యము)

ఈ పద్యము శ్రీ కృష్ణదేవరాయలు రచించిన ఆముక్త మాల్యద" ప్రబంధ పీఠికలోనిది. చాలా రోజుల క్రితం దీనికి[1] కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు వ్యాఖ్యానము చేయుచూ పై పద్యమునందలి "తెలుగొకండ" యన్నచో తెలుగుభాష పులకండమువంటిదని (అనగా కలకండ) దానిని నానారాజుల గొలుచుచుండిరనియు—అదే దేశభాషలందు తెలుగు లెస్సగా కీర్తింపబడుచుండెడిదనియు వ్రాసిరి. ఆ తర్వాత[2] శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారి ఆముక్తమాల్యద వ్యాఖ్యానములో "తెలు గొకండయన తెలు గొక్కటియే (అనగా నది ఏంటిగా దనుట)

---

1. "ఆముక్తమాల్యద"— వేదము వేంకటరాయశాస్త్రిగారి సంజీవనీ వ్యాఖ్యనము (21 వ పేజి)

2. "ఆముక్తమాల్యద"—వావిళ్ల రామస్వామిశాస్త్రులగారి వ్యాఖ్యానము (15 వ పేజి).

యు" నియూ దానినే సకల రాజన్యులు సేవింపగా నీవు సంభాషించెదవు (రాయలు) ఆ భాషలోనే సనియూ వ్రాసిరి. 3 ఇక ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే ముద్రించిన "సాహిత్యోపన్యాసములు" అన్న సంపుటిలోని డా. గిడుగు వెంకట సీతాపతిగారి "తెలుగు నుడికారము" వ్యాసమునందు "తెలుగొకండ" అనగా పుంకండ యనియూ "ఆ తెలుగుభాష పుంకండవలె తీయనిదని" తమ భావమును వెలిబుచ్చిరి. 4 ఇటీవల వెలువడిన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ వజ్రోత్సవ సంచికయందు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు "రాయలవారి ఆంధ్ర వాఙ్మయసేవ" అన్న వ్యాసములో "తెలుగొకండ ఎల్ల నృపులు గొలువ, దెలుగే బాసాడి" అన్న పద్యమునకు—అంటే ఎల్ల రాజులు (అనగా భిన్నభిన్న భాషా ప్రదేశములవేలు రాజులు) గొలువగా రాయలు బాసాడినది—మాట్లాడినది, "తెలుగొకండ"—ఒకే యొక తెలుగుభాషలోనే—దీనినిబట్టి రాయల కాలమున దక్షిణ హిందూదేశమున తెలుగుభాష "Court Language"గా నుండినదని ఘంటాపథముగా చెప్పవచ్చునని వ్రాసిరి.5 ఇక నా గురువర్యులు కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగారు "దొడ్డ బళ్లాపురము" నందు శ్రీ గురిపేటి మున్నప్ప—బొమ్మన హనుమంతు—ఎర్రకుల్లి నాగలింగప్ప వారి వద్దనుండి సంపాదించిన అముక్తమాల్యద మూడు తాళపత్ర గ్రంథాలలోను "తెలుగొకండ" అన్న దానికి మారు పాఠాంతరముగా "తెలుగొకంట" "తెలుగొకండు", "తెలుగొకండ" యని వివృతముగా నున్నది. ఇప్పు డింకేది సబబైనదో కొంత సుదీర్ఘముగా పరామర్శించుకొందము. ఇక్కడ వేదమువారు గిడుగువారు చన్నట్లు, తెలుగు పుంకండము వంటి దన్న అర్థము పరిపడదు. "తెలుగొకండ" యన్న ఉన్న దేశభాషలలో తెలుగొకటియే గాని కలకండ యని పుంకండ యని స్ఫురించుటలేదే? పోనీ యటులైతే రాయలు చెప్పినా దన్నచో "తెలుగొ" అని పదమును విరచి నిలబెట్టి సంబోధించి పలుకుటట్లు ఆశ్చర్యార్థమును తెలియజేయుటట్లు గుర్తొకటి పెట్టలేదే! మఱి ఎందుకీ విపరీత వ్యాఖ్యలు. వ్యావహారికములో ఒకట్లు ఒకటి లాగానే ల, ద, ర, న, ల కభేదము పాటించబడి "తెలుగు ఒకండ" యగుచున్నది. నేటికిని రాయల సీమ కర్నాటక సరిహద్దు ప్రాంతములందు "నీ వొకండవే పోతావా— నీ వొకండె పోతుందట చూడు— వా ఒక్కండె పోవి—దా ఒక్కంటవే పోవిన్నకు యని యనుట పరిపాటి. దీనినిబట్టి చూచినచో తెలుగొకండ, తెలుగొకంట, తెలుగొకండు, తెలుగొకొండ—యనినా ఒకే భావమును వ్యక్తపరచుచున్న దనుటలో సందేహములేదు.

— [illegible]

# కవయిత్రి ఎడిత్ సిట్వెల్ కాలధర్మం

[illegible]

ప్రసిద్ధ ఆంగ్ల కవయిత్రి డేమ్ ఎడిత్ సిట్వెల్ డిశంబరు 9 వ తేదీ రాత్రి గుండెపోటుతో లండన్ ఆసుపత్రిలో కాలధర్మం చెందారు. ఆమె వయస్సు 77. ఆమె రాయల్ సొసైటి ఆఫ్ లిటరేచర్‌కు ఉపాధ్యక్షురాలు. లీడ్స్, డుర్హామ్, ఆక్స్‌ఫర్డ్, షెఫీల్డ్ విశ్వ విద్యాలయాలనుంచి సాహిత్యంలో డాక్టరేట్ బిరుదులు పొందారు. అమెరికా సాహిత్య సంస్థలో గౌరవ సభ్యురాలు. ఈమె సర్. ఆస్బర్ట్ సిట్వెల్ శ్రీ సచీవరెల్ సిట్వెల్‌ల సోదరి. వీరు ముగ్గురు కలిసి ఆంగ్ల సాహిత్యంలో త్రిమూర్తులనిపించుకున్నారు. ఈమె ప్రథమ రచన "ది మదర్ అండ్ అదర్ పోయమ్స్". 1915 లో వెలువడింది. నాటినుంచి ఆమె పద్య సంపుటాలు వస్తూనే ఉన్నాయి. పెక్కు పద్య సంకలనాలను కూడా ఆమె ప్రచురించారు. సంగీతం వినడం, మౌనంగా కూర్చోవడం అంటే ఆమెకు ఎంతో ఇష్టం.

---

3. "తెలుగు నుడికారము"— డా. గిడుగు వేంకటసీతాపతి గారు (సాహిత్యోపన్యాసములు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (41 వ పేజి.)

4. "రాయలవారి ఆంధ్ర వాఙ్మయసేవ"—విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. వజ్రోత్సవ సంచిక—(పూర్వ భాగము)—శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము. 1962 సంవత్సరము, 68 వ పేజి.

5. కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగారి స్వదస్తూరిలో వ్రాసికొన్న డైరీ నుండి గ్రహించితిని. ఆ తాళపత్రులు ఎవరి వద్ద నున్నా దయచేసి "తెలుగు సాహిత్య అకాడమి" కి అందజేయుండి.

# లకుమాదేవి

ఆర్యా,

శ్రీమద్రామాయణ మహాభారతముల వంటి ఇతిహాసముల నుండి వస్తువును గ్రహించి కాళిదాస భవభూత్యాది మహా కవులు రసవంతములైన నాటకములు నిర్మించిరి. ఇతిహాసముల నుండి స్వీకరింపబడిన యితివృత్తములను ఆ మహా కవులు యథాతథముగ తమ రచనల యందు చిత్రించలేదు. పెక్కు మార్పులను చేసిరి. **స్వకపోల కల్పితాంశములను** పెక్కింటిని చేర్చిరి. శాకుంతలమున కాళిదాసు, ఉత్తర రామచరిత్రమున భవభూతి నిర్మించిన ఇతివృత్తములందు మూల విరుద్ధములు, అమూలకములు నైన యంశము లెన్ని కలవో యిప్పుడు ప్రత్యేకించి చెప్పవలసిన యవసరము లేదు. విజ్ఞు లెల్లరు నెరింగినవే.

ఇతిహాస రచయితకు సత్యనిష్ఠయు, ఇతిహాస కావ్య రచయితకు రసాది రమణీయార్థనిష్ఠయు ప్రధానములని ప్రాచీన వాఙ్మయ విభాగవేత్తలు చేసిన నిష్కర్ష. ఆధునిక యుగమునందును ఆ నిష్కర్షకు క్షతి లేదు. ఐతిహాసికమైన వృత్తమును కావ్యముగా నిర్మింపదలచినవాడు రసానుగుణముగా దానిని మార్చుకోవలెనని యానందవర్ధనాదులు చేసిన యుపదేశము నేటికిని అనుసరింపబడుచునే యున్నది. నేటి ప్రసిద్ధ నవలా రచయితల ఐతిహాసిక నవలలను పరిశీలించినచో వానియందు చరిత్రకు విరుద్ధములైన యంశములు పెక్కు గోచరించు చుండుట ప్రసిద్ధమైన విషయము. అసలు మన చరిత్ర స్థితియే అవ్యవస్థముగ నున్నది. పెక్కు విషయములందు చారిత్రకులకే అభిప్రాయభేదము లున్నవి. పరిశోధన సాగుచున్న కొలందియు క్రొత్త యాధారములు లభించుట, వాని వలన తత్పూర్వము సత్యములుగా ప్రతిష్ఠింపబడిన పెక్కు విషయములు అసత్యములుగా నిరూపింపబడి తిరస్కరింపబడుట మన చరిత్రయందు క్రొత్త విషయములు కావు. కనుక ఐతిహాసిక నవలల యందలి యితిహాసాంశముల సత్యాసత్యములను గురించిన శంకలు, సాహిత్య తత్త్వజ్ఞులు లేవదీయరు. జరిగినదానిని జరిగినట్లే చెప్పుట సాహిత్య నిర్మాత పని కాదుగదా.

ఇది యిట్లుండ భారతి 1964 అక్టోబరు సంచికలో శ్రీ లాంపాకుమార్‌గారు 'రాజశిల్పి' యందలి కొన్ని యంశముల ఐతిహాసికతను గురించి శంకలు వెలిబుచ్చినారు. రాజశిల్పి నవల 1956 లో వ్రాయబడినది. అప్పటికి రెడ్డిరాజుల చరిత్రను గురించి తెలుపబడిన గ్రంథములను, శాసనములను పెక్కింటిని పరిశీలించి విషయములను సేకరించి నేను ఆ నవలను వ్రాసితిని. కథా చమత్కృతి కొఱకు, పాత్రపోషణ కొఱకు, రసపుష్టి కొఱకు కొన్ని మార్పులను చేసితిని. కాని, చరిత్ర తలక్రిందగు మార్పులను నెప్పుడును చేయలేదు. చరిత్రకారులు భేదించిన యంశములను యథాసంభవము ఏదో యొక పక్షమువారి వాదము ననుసరించి గ్రహించితిని. చరిత్ర మౌనము వహించినచోట్ల స్వేచ్ఛానుసారము కల్పన చేసితిని.

లాంపాకుమార్‌గారి సందేహములు ముఖ్యముగా నాలుగు:

1. కొండవీడు రాజధానిగా చేసిన దెవరు?
2. మల్లాంబిక కుమారగిరి చెల్లెలా?
3. లకుమకు కుమారగిరితోడి సంబంధము.
4. లకుమ యెవరి కూతురు?

అద్దంకినుండి కొండవీటికి రాజధానిని మార్చినవాడు అనపోతారెడ్డి యని నేను వ్రాసితిని. ఇది నిజముకాదని లాంపాకుమార్‌గారు శిరంగిపురం శాసనములోనిదని యొక శ్లోకము నుదాహరించినారు. ఆ శ్లోకము దోషభూయిష్ఠముగా నున్నది. విస్పష్టమైన పాఠమిది—

"తతోఽన్నపోత నృపతిః పటుః పాలన కర్మణి
అపాల యత్తస్య పుత్రస్స దంతేఽంధ్ర వసుంధరాం
కొండవీడుం రాజధానీం విచిత్రా మకల్ప యత్
దృష్ట్వా త్వష్టాపి వైచిత్ర్య మభూద్యస్యాః
సవిస్మయః."

ఈ శ్లోకము 'రాజమహేంద్రవరం యిలాకా మన్యవా పురం శాసనం' లో ఉన్నట్లు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు శృంగార శ్రీనాథము 52వ పుటలో వ్రాసినారు. శిరంగి పురం శాసనంలో ఉన్నదని లాంపాకుమార్‌గారు వ్రాయుచున్నారు.

ఈ శ్లోకము క్రింది శ్లోకము తరువాతి శ్లోక మిట్లున్నది —

"సోఽన్నపోత నృపః స్వేన నిర్మితాయాం పురి స్థితః
కుర్వన్ హేమాద్రి దానాది చిరం భువ మపాలయత్."

ఈ శ్లోకమువల్ల అన్నపోతారెడ్డియే కొండవీడును నిర్మించి అద్దంకి నుండి రాజధానిని అచ్చటికి మార్చినట్లు స్పష్టము.

"తతోఽన్నపోత నృపతిః" అను శ్లోకము, శాసనము నందు "తతోఽన్నవేమ నృపతిః" అని యున్నదని [illegible]

తరువాత పాలించినవాడు అనపోతారెడ్డి యగుటవల్లను, క్రింది శ్లోకమునందు "పోఽన్నపోత నృపః" అని యుండుటచేతను, శాసనమును చెక్కినవాడు తప్పుచేసి యుండునని భావించి శ్రీ ప్రభాకరశాస్త్రులవారు మున్నగువారు "తతోఽన్నపోత నృపతిః" అని సవరించిరి. (చూ. శృంగార శ్రీనాథము 52 పుట—అధస్సూచిక, రెడ్డిసంచిక పుట. 41—వద్దాది అప్పారావు గారి వ్యాసము.)

రెండవది మల్లాంబిక విషయము. ఈమె కాటయ వేమా రెడ్డి భార్య. తల్లాంబిక, దొడ్డాంబిక యని కాటయవేమునకు మరి యిరువురు భార్యలు కలరు. హరిహరరాయల కూతురు హరిహరాంబ యొకతె కలదు. ఈ హరిహరాంబ పేరు నేను హీరాంబ యని కథయందలి చమత్కృతి కొఱకు మార్చితిని. కాటయవేముని యితర భార్యలలో దొడ్డాంబిక కుమారగిరి సోదరి యని చరిత్రకారులు చెప్పుచున్నారు. మల్లాంబిక యన్న పేరు శ్రుతికి యింపుగా నుండుటవల్లను మల్లిక యను పేర ఎడనెడ ఆమెను వ్యవహరించుటవల్ల కథాంశములకు కొంత రామణీయకత కలుగుటవల్లను నేను దొడ్డాంబికను మల్లాంబికయని వ్యవహరించితిని.

దొడ్డాంబిక కుమారగిరి యక్కగారని శ్రీ ప్రభాకర శాస్త్రులవారు వ్రాసిరి. "అందు నిమిత్తమై తన యక్క దొడ్డాంబిక భర్తయును ...... అగు కాటయవేముని పిలిచి" (చూ. రెడ్డిసంచిక. పు. 73) కుమారగిరి యక్క మగడైన కాటయ వేముడు కుమారగిరి కంటె చాల పెద్దవాడగును. అతడు హరిహరరాయల పుత్రికయగు హిరాంబికను వార్ధక్యమున పెండ్లి యాడినను సరసముగా నుండదని తలచి కాటయవేముని భార్య కుమారగిరి చెల్లెలని నేను వ్రాసితిని. అక్క యనుటకుగాని చెల్లెలనుటకుగాని శాసనాద్యాధార మేమియు లేదు.

లకుమకు కుమారగిరితోడి సంబంధమును గూర్చియు చరిత్రకారులయం దభిప్రాయ భేదమున్నది. "జయతి మహిమా లోకాతీతః ఇత్యాది శ్లోకమున "సదసి లకుమాదేవీ యస్య ప్రియా సదృశీ ప్రియా" యను పాఠమును స్వీకరించి శ్రీ ప్రభాకర శాస్త్రులవారు "కొమరగిరి రెడ్డిగారికి ధర్మపత్ని విద్వత్సీమరాలు "లకుమాదేవి" యను ప్రియురాలుండెడిది' అని రెడ్డి సంచిక 422 పుటలో వ్రాసిరి. లకుమాదేవి యందలి "దేవి" యను పదము "ధర్మపత్ని విద్వత్సీమరాలు" అన్న శ్రీ శాస్త్రుల వారి నిర్ణయమునకు కారణమై యుండును. ఐతే ఈ శ్లోకము నందలి "ప్రియా సదృశీ" అను పట్ల "శ్రియాసదృశీ" యను పాఠాంతరము కలదు. రెడ్డిసంచిక 357 వ పుటలో శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు ఇట్లు వ్రాసిరి—"రామయ్యపంతులు గారు ప్రకటించినట్టియు పరిషత్ ప్రతియందును 'శ్రియా— సదృశీ ప్రియా" అనియే కలదు.

నేను "శ్రియా సదృశీ ప్రియా" యను పాఠమునే గ్రహించితిని. కుమారగిరి కళాప్రియుడు, నాట్యశాస్త్ర కర్త. లకుమ నాట్యకర్త్రి. కాటయవేముని వ్యాఖ్యానములవలె లకుమాదేవి నాట్యములను వసంతరాజీయమునందలివని నా భావము. తాను నాట్యము నేర్పిన లకుమతో కుమారగిరికి శరీర సంబంధము ఉన్నదన్న తలంపు నాకు వచ్చలేదు. రాజ్యలక్ష్మివలె నాట్యలక్ష్మి యైన లకుమ కుమారగిరికి ప్రేమపాత్రురాలు అన్న యర్థమే ఉచితతరమని తోచినది. కుమారగిరికి ఉంపుడుకత్తె కాక సోదరివంటిదను సంబంధము కల్పుట కథా చమత్కారమునకు తోడ్పడుటచే నే నట్టి కల్పన చేసితిని.

లకుమ ఎవ్వరి కూతురన్న యంశమున నేను చేసిన కల్పన కేవలము నిరాధారము కాదు. "అనపోతారెడ్డి కంచి, పేరి, పిన్ని అను ముగ్గురు భోగపుసానులకు కొన్ని గ్రామములు దానము చేసెను." అని కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు తమ "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" యను గ్రంథమున 136 వ పుటలో వ్రాసినారు. ఈ భోగపుసానుల పేరులను నేను పంప, పిన్ని, రన్నియని మార్చితిని. అగ్రహారములు పుచ్చుకొన్నచో ఈ వేశ్యలు అనపోతారెడ్డి యుంపుడుకత్తెలై యుందురని భావించితిని. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సూచనమందుకొని వీరిలో పంప అనపోతారెడ్డికి రెండవ దేవేరి వంటిదని వ్రాసితిని. ఆమె కూతురు లకుమాదేవి యంటిని. చరిత్రలందు చెప్పబడని ఈ సంబంధము కేవలము కల్పితము. పాత్రౌచిత్యమును, రసౌచిత్యమును, కథా చమత్కారమును దృష్టియం దిడుకొని ఈ కల్పన చేసితిని. నేను నవల వ్రాసిన యనంతరము ఈ విషయమున నెవరెవ రేమేమి వ్రాసిరో, వారికి గల యుపపత్తు లెట్టివో నేను విచారింపలేదు. నేను నవల వ్రాయునాటికి గల చరిత్రతో నా కల్పన విరోధించుట లేదుగదా.

శాకుంతల నాటక వ్యాఖ్యానావతారికలో కాటయ వేమా రెడ్డి "జయతి మహిమా" ఇత్యాది శ్లోకము వ్రాసెను. ఆ శ్లోకమున దక్క నా యెఱిగినంతలో ఎచ్చటను లకుమాదేవి ప్రసంగము లేదు. కూచిభొట్ల హరిగారు లకుమ మారయామాత్యుని యుంపుడుకత్తె కూతురని యే యాధారములతో నిర్ణయించిరో. ఆ లకుమయే కుమారగిరి యాస్థాన నర్తకి యనుటకు మాత్రము ఆధార మేమున్నది ?

లకుమ యన్న పదము లక్ష్మియన్న పదమునకు వ్యవహారమున గలుగు వికృతి యనుకొన్నచో "శ్రియా సదృశీ ప్రియా" యన్న పాఠమే సమంజస మగును. "ప్రియా సదృశీ ప్రియా" అను పాఠము మహా విద్వాంసుడైన కాటయ వేమారెడ్డి రచనా పాటవమునకు గౌరవమును కూర్చునదియు కాదు.

ఐతిహాసిక నవలలను ఇతిహాసార్థముల కొఱకు గాక —రసాది రమణీయార్థముల కొఱకు పఠించుట యుక్తమని భావింతును.

(హైదరాబాద్) మాధవశర్మ

## 'విమర్శల పోకడ'

ఆర్యా!

శ్రీ బలివాడ రఘునాథరావుగారు జంషెడ్పూర్ నుండి వ్యక్తపరచిన అభిప్రాయాలను పరిశీలించాను. వారు సూచించినట్లు విమర్శల పోకడను పరీక్షించిన నా లేఖ లట వ్యంగా ముగిస్తే బాగుండేదే. 'క్రూర' పద ప్రయోగమూ సభ్యత మర్యాద పరిమితులను దాటినట్లే కనిపిస్తోంది.

గ్రంథ విమర్శలను సమీక్ష చేయడం 'భారతి'లో ఇదే మొదటిసారి అని రావుగారి అభిప్రాయము. అంటూ నేను వివరించిన అంశాలలో విమర్శనాత్మక దృష్టిని గమనించిన వారి సహృదయతకు ధన్యవాదములు.

కొన్ని సంవత్సరములుగా భారతి, మరికొన్ని పత్రికలలో ప్రచురితమైన విమర్శలను పరిశీలించిన నాకు అగమ్య భ్రాంతి చూడగానే ఏదో లోపం కన్పడింది. ఎన్నాళ్లనుంచో వ్రాయాలనుకున్న విషయాలు ఆనాడు ఒక రూపం దాల్చాయి. విమర్శల స్థాయి దిగజారడం సాహిత్య లోకంలో ఆరోగ్యకరమైన వాతావరణం కాదు. స్థాయి దిగజారిందనడానికి ఉదాహరణ లివ్వాలికదా! అట్టి ఉదాహరణలలో శ్రీ శ్రీపాదవారిది కూడా ఒకటి. అది క్లిష్టమైన విషయం కనుక వివరంగా వ్రాయవలసి వచ్చిందేకాని, దానిలో 'అంతర్య' మేమీలేదు.

వివాదం సాహిత్య విమర్శకు అత్యావశ్యకం. అయితే వివాదం ధోరణిమాత్రం మర్యాదను అతిక్రమించే విధంగా పోగరాదు. మర్యాదను అతిక్రమిస్తే, పరస్పర దూషణలకు ప్రాముఖ్యమువచ్చి అసలు విషయం చాటుగాన పడిపోతుంది. సభ్యత మర్యాదను పాటించే వివాదం, చర్చ ఎంతకాలం పడ్డా రసికులకు సహోల్లాసంగా ఉంటుంది.

విమర్శకులు అనేక పద్ధతులవారు ఉన్నారు. కనుకనే విమర్శలను కూడా ఆ యా పద్ధతులుగ విభజించారు పెద్దలు. కనుక విమర్శలో ఉన్న మూడు పద్ధతులూ, విమర్శకులలోని భేదాలను సూచిస్తాయి. ఎవరి ధోరణి వారిది—నిజమే. ఆ ధోరణి సహృదయులకు, సునిశిత హృదయులకూ, రసికులకు నచ్చుతుందా. లేదా అనేదే సమస్య. ఎటువంటివారి మనసు నొప్పించక వారి తప్పును బయటపెట్టగలిగే ధోరణికి నేను అగ్రస్థానమిస్తాను.

విమర్శకునకు ఆవేశం ఎప్పుడూ ప్రమాదకరమే. ఆవేశంలో నిజాల్ని గ్రహించలేరు. ఆవేశంలో వ్రాసిన విమర్శలో తప్పక ప్రమాదాలు జరుగుతాయి. ఫలితం ఆ విమర్శ స్థాయి దిగజారడమే. నిగ్రహం (Balance And Restraint) ఉత్తమ విమర్శకునిలో ఉండవలసిన లక్షణం.

యువ రచయితలు విమర్శలు చూడగానే భయపడి తల్లక్రిందులు అవుతున్నారనే భావం పూర్వాజనితము కావచ్చును. లేక ఆంగ్లకవి జాన్ కీట్సు (John Keats) జీవితం చదివిన తరువాత ఏర్పరచుకున్న భావమైనా కావచ్చును. John Keats వంటి యువ రచయితలు ఈనాడు మన మధ్య ఉన్నారు. తప్పక వారి సునిశిత హృదయాలకు దెబ్బ తగులుతుంది మూఢవ్రతిని విమర్శలతో.

నిగ్రహము ప్రదర్శిస్తూ వ్రాసిన నా లేఖలోని 'క్రూర' పదము దొర్లడము నిజముగ క్షమించరాని అపరాధము. జంషెడ్పూర్ మిత్రునకు కృతజ్ఞతలు.

(నల్గొండ) 'అక్షయ'



# గ్రంథ విమర్శలు

## మహాసర్గ

శివప్రసాద్ సృష్టించిన "మహాసర్గ" (విప్లవ కవిత). వెల : 2—00, ప్రాప్తిస్థానము : జ్యోతిర్మయి ప్రచురణలు. 1—8—465, చిక్కడపల్లి, హైదరాబాదు—20.

మహాసర్గ విలక్షణమైన కావ్యము. ఇది "రాష్ట్రీయ విప్లవ విపంచి" యని ముఖపత్రమున గలదు. ఈ కావ్యము ప్రభువిమర్శనముగా వ్రాయబడినది. గ్రంథకర్త తన తలపులను కుండ బద్దలు కొట్టినట్లుగా, మోమాటము, పిరికితనము లేకుండ చాటెను. "భారతి కన్నీళ్ళలోన కలం ముంచి వ్రాస్తున్నా" నని శివప్రసాదుగారు కావ్యమునకు శ్రీకారము చుట్టిరి. "పలికెడిది రాష్ట్రీయ ధర్మమట, పలికించెడివాడే రుద్రుండట, పలికెడి వాడాతని తత్వంబట, పలుకులె జీవన పరమార్థంబట" యని పోతన మాదిరిగా వారు పలికిరి. "నా రూపం జనవేశ్వరునిది, నా కలమిది పోతేశ్వరునిది, నా కరం పండితమూర్తిది, నా కృతి వీరభద్ర వల్లీము" అని శివప్రసాదు గారు ప్రకటించిరి. వారు "ఆధ్యాత్మిక జాతీయవు సిద్ధాంతపు లక్ష్యము" కై, "పరశురాము వీరశైవ కథకోసం" వ్రాసిరి. "....ఋషిధర్మోక్తి ధ్వని పరివేషంగా కల ధర్మంబే కావ్యాత్మగ" కలిగియున్నదే సత్యమైన విశ్వకావ్యము అనియు, "ధర్మభక్తి సర్వ రసాధిష్ఠాతగ చేస్తున్నా" ననియు వారు వాక్కు వక్కాణించిరి. "నా ఫలితం వీరశైవుంది" యని వారి చాటింపు.

"ఆవేదన—ఆలోచన, ఉత్సాహం—ఉద్రేకం, సంతోషం—సంతాపం" ఈ కావ్యము పుట్టుకకు కారణములైన మూల ద్రవ్యములు. ఈనాటి భారతదేశమును గూర్చి గ్రంథకర్త యెంతో వేదన పొందుచున్నారు. పరమ పవిత్ర భూమియగు ఈ జంబూ ద్వీపఖండము రెండుగా తునకలైనది. మహమ్మదీయ మతమే మూలశక్తిగా గలది పాకిస్తానము. సర్వమత సామరస్యమును చాటునది భారతదేశము. పాకిస్తానమందలి హైందవులు నక్కల కుక్కల పాట్లు పడుచున్నారు. లక్షలకొలది మంది హైందవులు దిక్కు దివాణములేక భారతదేశమునకు వచ్చుచున్నారు. అడుగడుగున వారు మృత్యువు నెదుర్కొను చున్నారు. ఇక భారతదేశమును చూచినా యెటు స్వార్థము, నిర్వీర్యత, అవినీతి, మదిరా మానినీ రక్తి తేలియాడుచున్నవి. ఆహార నిద్రా మైథునములే పురుషార్థములని ప్రజలు భావించు చున్నారు. ఐకమత్యము శూన్యమైనది. అ[illegible] నీతితో చలామణి యగుచున్నది. చైనా పెద్దపోటు పొడిచినది.

"అరి నే డవతలి గట్టున, అగ్నులతో నిలిచియుండ, గద్దెలెక్కి పరమహింసవు; గుంపులు నిద్రిస్తున్నవి. కర్తవ్యం మఱచిన ప్రజ, నేతృత్వం లేని జాతి, ఆదర్శ సమాధిపైన అర్ధనగ్న విషనృత్యం" అని శివప్రసాదుగారన్నారు. మహిమాలయములయ్యె హిమాలయములు గద్దె మెంటవని పల్లకాడులు వారి గద్దెపై నుండిరి. ఈ యార్యజాతి తన ప్రాచీన ధర్మబలము కోల్పోయినది. గోవధ విచ్చలవిడిగా కొనసాగుచున్నది. గాడిద గోమాత కంటె గొప్పది యనువా రుండిరి. ఉన్నారు. ఆకర్మణ్య ప్రవృత్తి పెచ్చుపెరిగిపోయినది. ఇంతేగాదు. నరుని నారాయణునిగా వర్ణించు నాస్తికవాదమును లేక భౌతికవాదమును భారతీయులకు రుచించుచున్నది. ఈ యార్యభూమి చెడి చెటాకులలో కలిసిపోవుచున్నది. ఈ దుస్థితికి కారణమేమి? ఈ దేశమునకు తరణోపాయములేదా? ఈ యార్యభూమి ఈవిధముగా అగుటకు హేతుభూతులైన వారెవ్వరు? మహమ్మదీయులు, పాశ్చాత్యులును. వేయేండ్లనుండి ఈ దేశభూమి విప్లవములకు దోపిళ్లకు గురియైనది. గురి యవనులనే ఇంకగా దగ జారిపోయినది. "అగ్నులు దుస్తులలోనలో జటలుజూ నవ్వుల కుల్లై, పిట్టలెగురుకొని తిరిగే మట్టి మనుష్యులే మిగిలిరి" ఆ రెండు జాతులకు తోడు నేడు సామ్యవాదులనబడువారొకరు మరియొక తెగ కూడ నున్నది. వీరి గద్దల పుట్టి, ఈగాలు అనే పీల్పును, ఇక్కడనే పెట్టుకొనుచు దీనికే ద్రోహము చేయుచుందురు. ఈ మూడుతెగవారు ఈ పురాణభూమి పతనమునకు కారకులై తోడ్పడిరి. తోడ్పడుచున్నారు. మరి ఈ భారతభూమికి తరణోపాయములేదా? ఉన్నది. అదియేమి? హైందవరాజ్య ప్రతిష్ఠాపనము. మానవతావాదముతో కూడిన హైందవ ధర్మ పునరుద్ధరణము. "నిలువెల్ల కన్నీళ్లకు ముగింపు. నిజముగు హిందూ రాజ్యారంభం." సారాంశమేమనగా మ్లేచ్ఛ పాశ్చాత్య సామ్యవాద చ్ఛాయలులేని స్వచ్ఛ సనాతన ధర్మ ప్రతిష్ఠాపనము వినా ఈ జాతికి మరొక తరణోపాయము లేదు. ఆ ధర్మ సంస్థాపనమునకు సేవ చేయుటకైనను ఎంత పచ్చి నెత్తురు కురియించుటకైనను వెనుదీయరాని యుక్తులేదు. "ఈ పవిత్ర ధార్మిక యజ్ఞములో సామ్యవాద తక్షకుడే తొలి బలి. ఈ వీరభద్ర నారసింహమున, విజాతి రక్షసులకు అంతం. ఈ రుద్రానల ప్రచండకీలకు, విజాతి కండపుడే భస్మంబగు. ఈ శైవ మహా పరశుప్రయోగము, అధర్మసామ్రాట్టుల తల తెగును" అని వారు స్పష్టముగా చెప్పిరి. ఇది శివప్రసాదుగారి ధోరణి. ఈ ధోరణి ఆవేదన రూపములో, హుంకారములో, స్వప్నాకృతిలో ఈ కావ్యము నందక్కడల గోచరించును. వారు సామ్యవాదులను చెండాడిరి.

హైందవ ధర్మము మహోత్కృష్టమైనదని యను కొనుచూ, దానివలన నెన్నో మేళ్లు కలిగినవని శివప్రసాదుగా రూహించుచున్నారు. వూహించుటయేగాక భారతీయ ధర్మ మనగా హైందవ ధర్మమేయని చాటుచున్నారు. ఇట్లు చాటుట పొరపాటు. భారతీయ సంస్కృతి యనగా హైందవ సంస్కృతిగాదు. మరి యది భారతీయ సంస్కృతియే. రవీంద్రుని ఈ వాక్యములను చదువుడు.

"The main river of Indian culture has flowed in four streams - the Vedic, the Puranic the Buddhist, and the Jain. It has it's source in the heights of the Indian Consciousness.

But a river belonging to a country is not fed by its own waters alone. The Tibetan Bramhaputra is a tributary to the Indian Ganges Contributions have similarly found their way to India's original culture. The Muhammadan, for example has repeatedly come into India from outside laden with his own stores of knowledge, and feeling and his wonderful religious democracy, bringing freshet after freshet to swell the current. In our music, our archi tecture our pictorial art, our literature the Muhammadans have made their permanent and precious contribution. Those who have studied the lives and writings of our medie -val saints, and all the great religious movements that sprang in the time of the Muhammadan rule, know how deep is our debt to this foreign Current that has so intimately mingled with our life."

"The Europeam Culture has come to us not only with its knowledge but with its Velocity. Though our assimilation of it is imperfect and the consequent aberrations numerous, still it is rousing our intellectual life from its inertia of formal habits into glowing consciousness by the very contradiction it offers to our own mental traditions."

పందొమ్మిదవ శతాబ్దమునందలి భారతదేశ సాంస్కృతిక పునరుజ్జీవనమునకు పాశ్చాత్య సంస్కృతియే ప్రబల హేతువు. ధర్మదేవత సన్నిధానమున సర్వులు సమానులేయని చాటినది. పాశ్చాత్య ప్రభుత్వము. అధ్యయనాధ్యాపనములకు సర్వ వర్ణములు శక్తివంతములేయని గుర్తించినది పాశ్చాత్య సభ్యత. భారతీయ భాషా పునర్వికాసము, ఉదార సాంఘిక సంస్కరణము, మత మౌఢ్య ప్రక్షాళనము ఇట్టి మేలెన్నో పాశ్చాత్య సభ్యతవలన కలిగినవి. మతాభిమాన దురహంకార ధూమములతో విడివడిన మహమ్మదీయులుగాని, పాశ్చాత్యులు గాని తెలిసి చేయుటలేదు. వారిది విశ్వ దృష్టి. వారికి పెద్దతీకము కట్టిపెట్టినవా రెవరునులేరు. సభ్యతా పరామర్శ చేయునపుడు గూడా గుణ విచారము చేయుట బుద్ధి పరం పరకు చెందినవారి లక్షణము. కేవల దోషములను ప్రదర్శించుట ప్రాచ్య దృష్టి ఫలమేయనక తప్పదు. శివప్రసాదు గారు అడవిన మ్లేచ్ఛ పాశ్చాత్యులవంటివారు హైందవులయం దున్నారు. బౌద్ధమువల్ల హైందవులు చూపిన "సమాన దృష్టి", శైవ వైష్ణవుల "సోదరానురాగము" లోకమెరిగి నట్టివే. శ్రుతి ప్రమాణమును గూర్చి బ్రహ్మ సూత్ర వ్యాఖ్యా తలు చేసిన ప్రసంగములు హైందవ ధర్మమునకు మాయని మచ్చలే. చారిత్రక యుగములలో సంభవించిన సన్నివేశములను ఎత్తి చూపి, ఆ సన్నివేశములలో నాయకులైన వారిని విమ ర్శింపబూనుకొన్నచో, అట్టి విమర్శకు హైందవ ధర్మము బలి కావలసినదే. ఈవారికి హైందవ ధర్మము చేసిన అన్యా యము లెన్నో యున్నవి. పౌరాణిక చారిత్రక యుగములలో రాక్షస ప్రవృత్తిగల దేవతలు, దివ్య ప్రవృత్తిగల రాక్షసులు, దేశద్రోహులైన హైందవులు భారత దేశములో కావలసినంత మందియున్నారు. ఈనాడు గత కాలమున జరిగిన అధర్మము లను గడకట్టి గంట వాయించుచు చాటినచో ప్రయోజనము లేదు. అట్టివి జరుగకుండా అప్రమత్తత వహించుట సత్య పరాయణులగువారి ధర్మము. అక్బరును అంగ్ల ప్రభువులను హంస కంస రావణులవంటి వారనుట శివప్రసాదుగారి అవ హన శక్తిని చాటినంతగా ధర్మరక్తిని చాటదు. పుష్యమిత్రుని కంటె అక్బరు హీనుడని అనుకొనుట బుద్ధిమాంద్యమునకు తార్కాణము. హైందవమంతయు గొప్పదియు, మేల్తర మనియు శివప్రసాదుగారివలె భావించుట చదువరులకు సాధ్యము గాదు.

శివప్రసాదుగారు తాము కోరుచున్న హైందవా ధ్యాత్మిక జాతీయతావాదము గాని, హైందవ మహా వ్యవస్థా వాదమును స్పష్టముగా సమగ్రముగా వర్ణించరైరి. ప్రాచీన ధర్మ వైభవమును ప్రబలముగా ప్రశంసించుట, పరజాతు లను పరసిద్ధాంతములను పడదిట్టుటచో ఫలమత్య ల్పము. పరజాతి విమర్శతోపాటు ఆత్మ జాతి విమర్శయు అత్యంతావశ్యకమే. అది పరిణామ శీలమునకు గుర్తు. అందరు హైందవ ధర్మమును విస్మరించుచున్నారని ఆవేదన పొందుట కంటె, ఎందుల కా స్థితి యేర్పడినదని ఆత్మ విమర్శ చేసికొని సన్మార్గమున పోవుట మనుష్యుని లక్షణము. శివప్రసాదుగారు గోరుచున్న హైందవాధ్యాత్మిక దృష్టి వర్తమాన భారతదేశ సమస్యలను పరిష్కరింపగలదా? పరిష్కరింపలేదనియే ప్రత్యు త్తరము. వేదోపనిషద్ధర్మములు భగవద్గీతా సందేశము వినం బడిన ఈ కర్మభూమిలో పర జాతీయులు విలద్రొక్కుకొను టకు హేతువేమి? ప్రాచీన హైందవజాతి అంతగా నిర్వీర్య మగుటకు కారణమేమి? అసలీ హైందవ ధర్మము మహా మహిమ కలదైనచో విదేశీయుల నెదిరింపలేక, తనలో తాను

ముడుచుకొనిపోయి; చుట్టు వెలుగు వెలారని పాలుగు గోడలు కట్టుకొని హైందవ సంఘము సాంస్కృతిక ప్రత్యేకతను కోల్పడినదేమి? శాంకరమతము ఏ విదేశీయుల జైత్రయాత్రలను అడ్డగింపలేదు. ప్రాచీన కాలమున హైందవ ధర్మ ప్రబోధము బాగుగా జరుగలేదా? కేవల హైందవ ధర్మోద్ధరణము సంకుచిత సౌకర్యముకొరకు గ్రంథము అంతేకాదు. తత్త్వమునుబట్టి హైందవ ధర్మమునకు, సామ్యవాదమునకు భేదమంతగాలేదు. ఒకదానికి వర్ణ వ్యవస్థ ప్రాణకల్పము. మరొకదానికి వర్గ కలహము మూలబీజము. ఒకచో భగవంతుడున్నాడు. మరొకచో లేడు. ఒకటి ధర్మ వ్యవస్థ పేరిట వ్యక్తిని బలిగోరగా, మరొకటి రాజ్య వ్యవస్థ పేరిట వ్యక్తిని బలిగోరును. ఒకచో నారాయణుడే నరుని తత్త్వములో పూజలు పొందును. మరొకచో నరుడే నారాయణుడని యనుకొనును.

వర్తమాన భారత దేశము రామరాజ్యము (ఈమాట లక్ష్యార్థమునందే యుపయుక్తము) గాని మాట నిజమే. దానిని రామరాజ్యము చేయవలయునన్నచో వర్తమానస్థితికి సంపూర్ణముగా భిన్నమైన ప్రవాహమును చేసికొన్న పిదప ప్రవృత్తియే కావలయును. ప్రాచీన ధర్మమునందలి మంచి పెన్నిధి ఎంత యుండ, దానిని పాడుచున్న అదర్శవాదము పనికిరాదు. జనవేశ్వర సోమనాథుల యుద్రేకము ధర్మోద్ధారకుల కార్యము కానేకాదు. అది సర్వ వినాశమునకే త్రోవదీయును. త్రోవ తీసినది కూడను. సర్వ ధర్మ సమన్వయము చేయుట భారత దేశమునకు వెన్నతో పెట్టిన విద్య. అట్టి భారత దేశ వైభవము పునః ప్రతిష్ఠింపవలయుననుకొను వారి రహస్యము గుర్తింపకుండుట శోచనీయము. హైందవ ధర్మము మునిశీల ధర్మము. ఆ ధర్మమును చాటుచున్నామనుకొనువారు దాని పరిధిని సంకుచిత పరచుచున్నారు. దానికి దోషయుక్తమైన వ్యాఖ్యానము చేయుచున్నారు. శివప్రసాదు గారట్టి వారితో జమ యగుట దురదృష్టము. శివప్రసాదుగారు చాటుచున్న ధర్మయుద్ధము కొనసాగవలసినదే. అది చైతన్యమునకు చిహ్నము. కాని యా ధర్మమునకు కేవల హైందవ ధర్మమే అస్త్రముగారాదు. భారత దేశములో భిన్న జాతుల భిన్న సంస్కృతులు కలవు. ఆ భిన్న సంస్కృతులన్నియు ఆ ధర్మ యుద్ధాస్త్రములే కావలయును. అట్టి ధర్మ యుద్ధమునకు ఆయత్తపడువారికి సమచిత్తత ముఖ్య మహాధర్మము కావలయును. అట్టి సమచిత్తత శివప్రసాదుగారు చాటు చున్న హైందవ ధర్మము చూపలేదు. సర్వ ప్రపంచమునకు భారతదేశమే సంస్కృతి భిక్ష పెట్టినదని చాటు హైందవ ధర్మము సత్యమును గుర్తించినట్టిదిగాదు. సత్యమును గుర్తింప జాలని ధర్మమువలన శ్రేయములు గలుగవు. విలయములు ప్రాప్తించును.

వర్తమాన భారత దేశమునకు మోక్షమును ప్రసాదించుటకు అటు సామ్యవాదముగాని ఇటు హైందవ ధర్మము గాని శక్తివంతములుగావు. ఈ రెంటిలో దోషము లెన్నో కలవు. వ్యక్తి, సమాజము, రాజ్య వ్యవస్థ ఈ మూటిని, దేనికిని భంగము కలుగకుండ ముడివేయు మార్గమే ఈనాడు ఆదరణీయమగునట్టిది. హైందవ ధర్మము వ్యక్తికంటె వర్ణమునకు ప్రాధాన్యమిచ్చి యొకనాడు సమాజ సమస్యను పరిష్కరించుటకు పూనుకొనినది. ఆ పరిష్కార రూపములే ధర్మ శాస్త్రములు. కాని ఆ ధర్మశాస్త్రము లీ కాలమునకు తగినవి కావు. కాలము పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుడు పరిణామ బాధితుడు అను వాదము ఒప్పుకొనబడదు. శివప్రసాదుగారు సామ్యవాదమువలన అటువంటి స్థితియే అనిర్వచనీయమన్నారు, కావున దానివలన భారతదేశమునకు ఏ యుపకారము కలుగదు. ఈనాడు మనము వరించిన ప్రజాస్వామ్య వ్యవస్థయే మనకు సర్వథా సదా ఆదరణీయమైనట్టిది. ఈనాటి ప్రజాస్వామ్య రాజ్యాంగమే మనపాలిటి మహాధర్మశాస్త్రము. అదే సర్వులకు శిరోధార్యము కావలయును. దానిలో దోషములున్నవందురా? మార్పులు చేసికొనవచ్చును. వ్యక్తిని నలిపిన ధర్మము దేవుని నోటినుండి యూడిపడినదైనప్పటికి, అది తిరస్కార్యమే. నరుడు నారాయణుడనుట తప్పు. అట్లే నారాయణుడే సర్వ ప్రదాత యనుట దోషమే. దైవ మానవ శక్తుల రీతా సమన్వయమే జగత్పవిత్రత. "పౌరుషము" అనుచు, "బ్రహ్మమ్" అని పాడుచు "సత్యమ్" "శివమ్" "సుందరమ్" అని రామ భజనలు చేసినంతమాత్రాన, జపతపము లొనర్చినంతమాత్రాన వర్తమాన భారతదేశము స్వర్గసీమ కాజాలదు. దాని కష్టములు గట్టెక్కవు. భౌతికశాస్త్ర విజ్ఞానము, వ్యక్తి వికాసము, సర్వ ధర్మ నీతి సమానతా వాదరతి, వీని యన్నిటిని సమన్వయించుకొనినగాని భారతదేశము బాగుపడదు. ఆ బాగుపడు ప్రయత్నమే ప్రజాస్వామ్య వ్యవస్థ. ఆధ్యాత్మిక భౌతిక వాదములు రెండును జగచ్ఛక్తి స్వరూపములే. వానిని ఏకము చేసికొనుటయందే మానవ పురోగమనము సిద్ధించును. అరవింద మహర్షి మానవజాతి కుపదేశించిన దీ పరమ సత్యమే.

"మంగళాశాసనములో" శివప్రసాదుగారు ఈవిధముగా వ్రాసిరి. "కాల తత్త్వాన్ని పరికించకుండా అవసరాన్ని పరిణామాన్ని అనుసరించి వివిధ మార్పులను నిర్దేశిస్తూ తనలో లీనం చేసుకుంటూ—సమన్వయ దృక్పథంతో సాగిపోవడం సజీవ హిందూ ప్రౌఢత్వాని ప్రాథమిక సూత్రం. సాధనం సాధ్యమంత ముఖ్యమైనదే. కాని బ్రతికినంతకాలమూ శతాబ్దాల పర్యంతమూ—గమ్యాన్ని వదలి, సాధనమే సర్వస్వత్వమని, మూర్ఖత్వంతో పట్టుకొని వ్రేలాడటం, శక్తివంతమైన, చైతన్యవంతమైన శాశ్వతమైన హిందూ ధర్మానికి ప్రతినిధియైన ఏ కవీ చేయలేడు. అంతేకాదు. ధర్మ మహోర్మ వంతో తాత్కాలిక తరంగాలేవి లేచినా కూడా రాజకీయ సిద్ధాంతాలను పలుకరిస్తాడు—పలవరిస్తాడు. ప్రశంసల్నా, ఖండనల్నా రెండూ చేస్తాడు. వేదాలలో అసుర ద్రష్ట

విమర్శ, కాళిదాసులో విదేశీయ దండయాత్రలూ, భార
తంలో చాణక్యులూ, భగవద్గీతలో నిష్కామ కర్మలూ, బసవ
పురాణంలో శైవుల్లూ శివప్రసాదకృతిలో వివ్యవాదులూ—
కాలం ఏదైనా, కావ్యాలు ఏవైనా, పిండబ్బూ విందించి
నది, దానవ గుణాలనే దైత్య శక్తులనీ—" "మానవుడున్నంత
వరకు దానవ శక్తి నిలుచునే. దానవుడున్నంతవరకు ధర్మ
యుద్ధమూ సాగును" కాబట్టి నేటి వివ్యవాదులు లేవు
లేకపోయినా శివప్రసాద కావ్యంయొక్క ఆవశ్యకత వేయిన్నొక్క
పినామా ఉంటుంది. నిజమే. ఆవేశములో శివప్రసాదు గారి
మాటలను వ్రాసికొనుచున్నాను. ఈ సమన్వయ దృక్పథం
ఈ కావ్యములో కానరాదు. సంఘములోని దైత్య శక్తు
లను అణచగల బలిమి కలిమి మహా కవుల కావ్యములయందే
యుండును. "కవిత కత్తివంటిది. ఖండించగలదు. బ్రతికింప
గలదు. మనుష్యుల మది దేవతలుగా సంస్కరింపగలదు. రాక్ష
సులనుజేసి పడద్రోయగలదు. మనుష్య జాతిలో దివ్యత్వము,
భక్తి, త్యాగము, సత్యప్రీతి, ధర్మదృష్టి, ఆత్మసంయమనము,
సౌందర్య పారవశ్యము ఇత్యాది మహా గుణము లీడ్చుకొని నిలచి
యెనగ క్షేమ సాధనములై యుండుటకు గంభీర భావములు,
విశాలదృష్టియుగల మహా కవుల కావ్యములే మహౌషధములు;
మిని కవితలులు. కవి ప్రశాంతుడై దాంతుడై బుద్ధిమంతుడై
నప్పుడు తప్ప అట్టి మహా కావ్యము రచింపలేడు. ఆ సంస్కా
రములేనివాడు తలలోని క్రొత్తలంటయు వెడల్కక్కి, తన్ను
ఇతరులను వెర్రుల జేయునంతే. చిత్తోద్రేకము పాదుల్లో
పెట్టుకొనలేని వారి ఇట్టి కావ్యభావములు నాటికి, నేటికి
ఎన్ని జాతులలోను కలవు." పాల్కురికి సోమన్న ఛోద్యులనే
కాదు వేద మార్గానుయాయుల క్రుత్తులను గూడ కడిగి
కడిగి కంతలో పోసెను. ఆవేశములో చెడదిట్టుటకు బూనిన
వారి కావ్యములవలన సంఘములో దైత్య శక్తులు నిర్మూలిం
చబడుట వినా మరొక లాభము కలుగదు. ఆ యా యుగము
లలో ఎందరో మహాత్ములు హైందవ ధర్మమునందలి దుష్టశక్తిని
కడుగుటకును ప్రయత్నించి, కావ్యము లల్లిరి. వారి కావ్య
ములు సోమనాథుని కావ్యములకంటె వాని ననుసరించిన వారి
కావ్యములకంటె భిన్నముగా నున్నవి. ఏ ధర్మమందైనను కాలము
గడచిన కొలది మార్పులకు లోబడి చెత్త చెదారమును చేర్చు
కొనును. హైందవేతర ధర్మములందు నిట్లే సంభవించి
నది. హైందవ ధర్మము ఈ మాత్రమున కలితముకాలేదు.
వర్తమాన భారతదేశము సద్ధరించి, తరింపజేయవలయు
నన్నచో వర్తమాన కాలమును విస్మరింపరాదు. రాజకీయ
మైనను, సాంఘికమైన, ధార్మికమైన యొక మహా సంస్కార
మాత్రమును వర్తమానకాలమునకు అనుగుణముగా నడుప
వలెనంచి కొనవలయును. ఇట ఏ పూర్వ వాసనలు, ఏ పక్ష
పాతము పనికిరాదు. శివప్రసాదుగారి సంకల్పము ఉదాత్త
మయినదే. కాని వారు చేపట్టిన సంస్కార మాత్రము పరిమిత
మైన, వర్తమానకాలమును లెక్కలోనికి తీసికొనని హైందవ
[illegible]

ధర్మ పక్షపాతము గలట్టిది. అట్టి మాత్రమును ప్రతిపా
దింపు వర్గ మీనా ఒకటి కలదు. శివప్రసాదు గారావర్గ
మునకు ప్రతినిధి మాత్రమే. జాతీయ కవితా మార్గము
మహానర్గలో లేదు. భారతీయ సంస్కృతిని పరిశీలించి పరివ
ర్తింపగల్గినవారికి మహానర్గ పరిమిత దక్పథమునే సిద్ధింప
జేయగలదు.

## వ్యాసమంజరి : షట్పది

(వ్యాసమంజరి. కర్త : అప్పజోడు వేంకట సుబ్బయ్య
ఎం. ఏ. వెల— 2.00. ప్రాప్తిస్థానము : కవితా ప్రభాత
గ్రంథమాల c/o మునుస్వామి ప్రెస్, పవరుపేట, ఏలూరు.)

షట్పది. కర్త : అప్పజోడు వేంకట సుబ్బయ్య
ఎం. ఏ. వెల : 2—00. ప్రాప్తిస్థానము : శ్రీనివాస బుక్
హౌస్, ప్రి. కొనుల శ్రీనివాసులు ఎం. ఏ. డి యల్. యస్ సి.
కావలి, నెల్లూరుజిల్లా.)

వ్యాసము విషయ ప్రధానము. ఆ విషయమును సహే
తుకముగా విభజింపవలయును. ఆ విభక్త భాగములన్నియు
కార్య కారణ సంబంధము కలిగియుండవలయును. విషయ
మును వివరించుట రమణీయముగా నుండవలయును. నవీన
కాలమున వ్యాసము బహుముఖముగా అభివృద్ధి గాంచుచున్నది,
వ్యాసమంజరిలో ఏనిమిది వ్యాసము లున్నవి. అవి సంభాషణ,
రేపు, కోరిక, పోషణ ప్రాధాన్యము, రాత్రి, మృత్యువు, మరి
మరపు, కన్ను, అనునవి. సంభాషణ యనునదే వ్యాసము
యొక్క పరిపూర్ణలక్షణములు కలిగియున్నది. ఒక సమగ్రా
కృతి కలిగియున్నది. మిగిలిన వానిలో ప్రతి వ్యాసమునందు
సగ భాగమున విషయముండును. సగ భాగమున భావనా శక్తి,
ఊహా వైచిత్రి యుండును. అందుచేతనే "రాత్రి" మున్నగు
వానిలో విషయము లోపించిన గుణము స్పష్టముగా కను
పట్టుచున్నది. వేంకట సుబ్బయ్యగారిలో భావనాశక్తి సమృ
ద్ధిగా గలదు. వ్యాసములు కొన్నిచోట్ల కవితా భాషను కలిగి
నవై వచన రూపమునున్న కావ్యఖండములేమో యని
పించుచున్నవి. వ్యాసకర్త ఏవో కొన్ని దృశ్యములను వర్ణించు
చుందురు. అట్టి వర్ణనములవలన వ్యాసముల యొక్క క్రమాను
సంధానములు దెబ్బతిన్నవి. వ్యాసముల యాకృతియు శిథిల
మయినది. విషయ సాంద్రత యుండవలసినచోట్ల ఊహ
యున్నది. పాశ్చాత్య పండితుల వాక్యములతోపాటు ప్రకర
ణోచితములైన భారతీయ మహర్షుల సూక్తులను కూడ
ఉదాహరించిన సముచితముగా నుండెడిది.

షట్పది యందారు వ్యాసము లున్నవి. భువన విజ
యము, ఖడ్గ తిక్కన, తెలుగు చాటువులు, మహాకవి ధూర్జటి,
ఆరాధనము, ఖండ కావ్యము, అనునవి. భువన విజయము
కేవలం మహామహులట్టి గారిలో కట్టిన వేదిక. మిగిలిన వ్యాసములు
వ్యాసము లనదగియున్నవి. కాటమరాజు కథలో పాత్ర
ల్ని దిద్దుచు ఖడ్గతిక్కన వ్యక్తిత్వమును, కావ్య [illegible]
[illegible]

ముఖలో కానంబడు ధూర్జటి మనస్తత్త్వమును సుబ్బయ్యగారు చక్కగా వివరించిరి. తెలుగు చాటువుల వైవిధ్యమును, సౌందర్యమును సోదాహరణముగా చూపిరి. అవధానమునందలి యంగములను సోదాహరణముగా వివరించి ఖండ కావ్య మననేమో నిర్వచించిరి. "కవి, ఒక సరసమైన కథనుండి మనోజ్ఞమైన సన్నివేశమును గ్రహించి, పాత్ర చిత్రణను భావ మాధుర్యమును, భాషా లాలిత్యమును అందముగ పొందుపరచి, రసవంతముగ తీర్చిదిద్దు అతి విస్తృతమైన రచన ఖండ కావ్య"మని వేంకట సుబ్బయ్యగారి నిర్వచనము. పరిమాణమునుబట్టి ఈ నిర్వచనము చెల్లునదిగాని, ఆలంకారికుల సంప్రదాయమునుబట్టి తగినట్లుదిగాదు. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య"మ్మను నిర్వచనమును ప్రమాణముగా తీసికొని నవీన కావ్యముల కేదో యొక సంజ్ఞ నిర్ణయించుకొనుట మంచిది. "ఖండకావ్యం భవేత్కావ్య స్యైకదేశానుసారిచ" యని సాహిత్య దర్పణము చెప్పుచున్నదిగదా! వేంకట సుబ్బయ్యగారి ఈ ఖండ కావ్య మీమాంస అంతగా తృప్తి నివ్వుటలేదు. ఈరెండు గ్రంథముల శైలి సరళ గ్రాంథిక భాషతో కూడియున్నది. మొత్తముమీద ఈ వ్యాసములలో కవితా విమర్శనముల లక్షణములు రెండును మేళగించియున్నవి.

—శాక్యసింహ.

## ఆంధ్రసామ్రాజ్యము
### (రెండవ భాగము)

రచన : పంత సహస్రావధాని శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, ప్రతులకు : శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి, 2—1—471, నల్లకుంట, హైదరాబాదు—20. వెల: రూ. 7.

ఇది 2217 పద్యములుగలది. పూర్వభాగము 2122 పద్యములు గలది. వెరసి రెండు భాగములు 4339 పద్యముల గ్రంథము. మొదటి భాగమున ఆంధ్ర విష్ణువు దగ్గరనుండి కాకతీయ సామ్రాజ్య పతనము వరకు నాంధ్రరాజుల చరిత్రము వర్ణింపబడినది. ఈ భాగమును 1963 మార్చి భారతియందు సమీక్షించితిని. తరువాత పదునెనిమిది మాసములకే రెండవ భాగము వెలువడినది. ఇందు ముసునూరి ప్రోలయ నాయకుని దగ్గరనుండి విశాలాంధ్ర నిర్మాణము వరకు నాంధ్రరాజ్య చరిత్రము వర్ణింపబడినది. పూర్వ గ్రంథమునందువలెనే ప్రకృత గ్రంథమునందును కవిగారు చారిత్రకులు వ్రాసిన వ్రాతల నాధారముగాగొని రచన నడపినారు. ప్రకృత గ్రంథమునందు నాలుగు ప్రధానమైన ప్రకరణములలో నాంధ్ర రాజ్య చరిత్రము వర్ణితమైనది. మొదటి ప్రకరణమునందు కాకతీయ సామ్రాజ్య పతనానంతర మాంధ్ర దేశమునందు ముసునూరి ప్రోలయ కాపయ నాయకుల యైకమత్య ప్రయత్నములు వెలమచేతిలో కాపయ నాయకుని యోటమి మూడవ ప్రతాపరుద్రుడు తురకల పార ద్రోలుట, పద్మనాయకుల పాలనము, బహమనీ రాజ్యారంభము మొదలైన విషయములు వర్ణింపబడినవి. రెండవ భాగమంతయు రెడ్డిరాజుల చరిత్రము, మూడవ భాగము విజయనగర రాజుల చరిత్రము, నాల్గవభాగ మాంధ్రదేశ నిర్మాణము. ఈ నాల్గు భాగములను పరికింపగా కాకతీయ రాజ్య పతనానంతర మాంధ్ర దేశ చరిత్రము సంగ్రహముగా చెప్పినట్లనిపించును. చరిత్ర కెక్కిన రాజులలో పలువురను కవిగారు గ్రంథమున కెక్కించిరి. విద్యానగర రాజుల చరిత్రము రామ రాయలవరకు కొంత వివరముగా వ్రాయబడినది. తరువాత వేంకటపతి రాయలవరకు సంగ్రహీతమైనది. తరువాత నాంగ్లేయుల పరిపాలన మతి సంగ్రహముగా వ్రాయబడినది. ఈలోపల నాంధ్రదేశమునందు తలయెత్తిన సంస్థానములు ముఖ్యముగా నూజివీడు, అమరావతి, విజయనగరం మొదలైన సంస్థానముల చరిత్ర వర్ణితము కాలేదు. మధుర చెంజి తంజావూరు నాయక రాజుల చరిత్రమును గురించి రచయిత యుటంకింపలేదు. బహుశః ఆంధ్రదేశమునకు పరి తమిళదేశమునందు విలసిల్లినది కాబట్టి నాయక రాజుల రాజ్యము శాస్త్రిగారు విడిచియుందురు. కాని ఇటీవలివరకు నాంధ్రదేశమునందు విలసిల్లిన సంస్థానములు భారతీయ సంస్కృతికి, విజ్ఞానమునకు కళలకు నాశ్రయము నొసంగి వానికి ప్రోది చేసినవి. ఆ సంస్థానముల చరిత్రము సంగ్రహముగనైన వ్రాసియున్నచో గ్రంథమున కితోధికమైన పరిపూర్ణత యబ్బియుండెడిది. ఈ భాగమునందు ముఖ్యముగా వర్ణితములైన చరిత్రములు మూడు. పద్మనాయకుల చరిత్రము, రెడ్డిరాజుల చరిత్రము, విజయనగర రాజుల చరిత్రము. ఈ మూడింట పద్మనాయకుల చరిత్రమును గురించి సమగ్రమైన పరిశోధన యింకను జరుగవలసియున్నది. కాబట్టి యది శాస్త్రిగారి రచనయందును సమగ్రముగనే యున్నది. ఈ కుమారిలభట్టు కులోత్తుంగచోడ దేవుని కాలము వాడైనట్లు శాస్త్రిగారు వ్రాసిరి. ఇది విచార్యము. శంకరుని కాల నిర్ణయమును గూర్చి యాంగ్లమునందును, నాంధ్రమునందు గూడ బహు రచనలు వచ్చినవి. వానిలో "ది ఏజ్ ఆఫ్ శంకర" యను గ్రంథము మూర్ధన్యమైనది. కుమారిల భట్టు శ్రీ శంకర భగవత్పాదులకు సమకాలికుడు. చారిత్రకులు శ్రీ శంకరుల కాలమును మనవారు పదునైదు శతాబ్దములు క్రిందికి గుంజివైచిరి. శ్రీ శంకరుల జన్మ క్రీ.పూ. 509. కుమారిలభట్టు క్రీ.పూ. 557 ప్రాంతమున జన్మించినాడు. ఈ నిర్ణయములకు తిరుగులేని జ్యోతిర్గణ నాధారమున్నది. చారిత్రకులు చరిత్ర రచనాధారములలో నీ జ్యోతిర్గణనమును గ్రహించుట కొప్పుకొనరు. ఎందుచేత? దాని నొప్పుకొన్నచో వారి లెక్కలన్నియు తుడిచిపెట్టుకొని పోవును. వారజ్ఞానమువలనో మదమువలనో చేసి కొంతమంది రాజులను మహాపురుషులను వెనుక కొట్టుదురు. ఎగుకొట్టుటకు వీలులేని బావించినవారిని క్రిందికి గుంజుదురు. ఈ

## గ్రంథ విమర్శలు

తప్పుల తడక ఈ యజుర్వేదముల పుట్టుకు చరిత్ర యని పేరు. ఇది మన దౌర్భాగ్యము. దీనిని గురించి ఈ గ్రంథము యొక్క పూర్వ భాగమును సమీక్షించు సందర్భమున కొంత వ్రాసితిని. దానికి సమాధానముగ శాస్త్రిగారు "విజ్ఞప్తి" యనబడు పద్యములను వ్రాసినారు. "కాల నిర్ణయమునందు చారిత్రకులలో భేదము గుపించుచున్నది. ఆ భేదమును తీర్చి వ్రాయుటకు నిశ్శంకమైన యాధారము లేదని. నిశ్శంకమైన యాధారము లేకేమి? కావలసినంత యున్నది. ఆ యాధారమును మనము పరిగణింపవలెనంతే. శాస్త్రిగారు సంప్రదాయ మార్గమునకు చెందినవారు. వారికి కాల నిర్ణయ సందర్భమున జ్యోతిర్గణనమును ప్రధాన సాక్ష్యముగా గైకొనుట కెట్టి యభ్యంతరమును నుండదని భావింతును. కాని వారు టి. యస్. నారాయణయ్యర్‌గారు వ్రాసిన "ది ఏజ్ ఆఫ్ శంకర" మొదలైన యాంగ్ల గ్రంథములు, శ్రీ కోట వెంకటాచలంగారి కలిశక విజ్ఞానము మొదలైన యాంధ్ర గ్రంథములు చూచియుండరు. "విజ్ఞప్తి"లో పలు కాల నిర్ణయమున తగిన సవరణ ద్వితీయముద్రణములో చేయ వలసినచో చేయుదుమని వ్రాసిరి. ఇది వారి సౌజన్యమునకునుదాహరణము. పైని చెప్పిన గ్రంథములు బహు పరిశోధన గావించి వ్రాయబడినవి. శాస్త్రిగారా గ్రంథములను నవలోకించి కాల నిర్ణయమున నా గ్రంథకర్త లిచ్చిన సాక్ష్యము వారికి సంతృప్తిగా నున్నచో తగిన సవరణలు చేయుదురుగాక.

దీనిని విడిచి కథా రచనము, పద్య రచనము భాష మొదలైన వానిని గురించి పూర్వ భాగ సమీక్షా సందర్భమున చెప్పిన దానికంటె నెక్కువ చెప్ప వలసినది లేదు. ఉన్న యవకాశములో శాస్త్రిగారు చూపించిన నవీనము పద్య రచనా పాటవము భాషాశక్తి మిక్కిలి ప్రశంసనీయములుగా నున్నవి. మాధుర్యము, అక్షర రమ్యత శాస్త్రిగారి కవిత్వములో ప్రధాన గుణములు. ఎత్తుకొన్న ఎత్తుగడకు తుదముట్ట తగినట్లు నిర్వహించుట వర్ణనా ప్రౌఢి, అలంకార ప్రౌఢి, రచనా ప్రౌఢి, తెలుగు నుడికారములు, సంస్కృత సమాసములు, వీని యన్నింటికి మరల నుదాహరణముల నిచ్చుట చర్విత చర్వణముగా నుండును. ఈ సర్వ విషయములు నీ గ్రంథమున సమృద్ధిగానున్నది. పూర్వభాగముతో కలిపి మొదటినుండి తుదిదాక నీ గ్రంథ మొకే ధారగా వాకే వడితో నడచినదని చెప్పినచో చాలుననుకొందును. ఇది ఈ కాలములో సంప్రదాయ మార్గములో వచ్చిన కావ్యములలో మేలి తరగతికి చెందినదని చెప్పిన నతిశయోక్తి కాదు.

—శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి.

### తోడు నీడ

(నాటకం) రచన: కె. యల్. నరసింహారావు. పాటలు: శ్రీరామకవచం సత్యనారాయణ, వెల: 1—80. జనపద ప్రచురణలు: 1—1—336/20 చిక్కడపల్లి, హైదరాబాదు—20.

గ్రామాభ్యుదయ సాధనోద్దేశంతో రచించ బడిన ఈ నాటకంలోని పాత్రలు సహజంగా చిత్రించ బడినవి.

పాటలలో ప్రేక్షకుల్ని కార్యోన్ముఖులను గావించే తత్త్వం గోచరిస్తున్నది. ప్రాంతీయ పదాలతో మిళితమైన ఈ నాటకాన్ని అందరూ ప్రదర్శించడం కొంత కష్టం కావచ్చు. ప్రణాళికోద్దేశాలను నాటకంగా రూపొందించడంలో యోదుగయ్యే అభాతాలను అధిగమించడంలో రచయిత కృతకృత్యుడైనాడు.

### అగ్ని పరీక్ష

(నాటకం) శ్రీ కె. యల్. నరసింహారావు, వెల: 1—80, జనపద ప్రచురణలు: 1—1—336/20 చిక్కడపల్లి, హైదరాబాదు—20.

ఈ నాటకం సరిహద్దు యుద్ధ ప్రమాదాన్ని దృష్టిలో ఉంచుకొని వ్రాయబడినది. భారత దేశంలో పంచమాంగ దళం ఒక్కటి ఉన్నదనీ ఆ వర్గాన్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండక తప్పదనీ ప్రజల్ని హెచ్చరించడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు.

కథా సంవిధానము, సంభాషణల తీరు నాటకీయతను పుణికి పుచ్చుకొన్నవి. తెలంగాణా భాషను ఉపయోగించినందున నాటకాన్ని ప్రదర్శించడంలో అన్యమండలాల వారికి కొంత ఇబ్బంది కలుగవచ్చు. ప్రదర్శించిన ఆ భాషను అర్థం చేసుకొనే వీలు ప్రేక్షకులకు అంతగా లేకపోవచ్చు. ఇట్టి నాటకాలు వ్రాసేటపుడు అన్ని జిల్లాల వారికీ అందుబాటులో నున్న సామాన్య భాషను ఉపయోగించడం మంచిది.

ఇందులో ఒక రాజకీయ పార్టీని నిశితంగా విమర్శించక పోయినా వారిని పరోక్షంగా ఎత్తి చూపినట్లు కన్పిస్తుంది. ఈ అనుమానం ఉన్నదే గదా!

నాటకంలోని పాటలు బాగున్నవి. పాత్రలను పోషించడంలో రచయిత ప్రత్యేక కృషి కనిపిస్తుంది.

—సభా.]

### శతకములు

వెంకటేశ శతకము. శ్రీ పిస్సక వెంకటేశ్వరరావు. వికాస ప్రచురణలు. తనాలి. వెల: 50 న. పై.

(1) శ్రీ విశ్వేశ్వర విలాసము (అష్టోత్తర శతకము), (2) శ్రీ సుబ్రహ్మణ్య పల్లీశ్వర శతకము (అష్టోత్తర శతకము), (3) శ్రీ త్రిపురసుందరీ అనుగ్రహ శతకము, రచన: విద్వాన్

బులుసు వెంకటేశ్వర్లు వీరి ప్రకాశకులు బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడ. ఒక్కొక్కదాని వెల : 50 న. పై.

దుర్గాక్రమణ (సోష్ట్రతప్రాల) కృతికర్త : కవిరత్న శ్రీ మున్నం వీరరాఘవకవి. ప్రచురణకర్త : శ్రీ కోమారు రామారావు గారు. ప్రా. శ్రీ రామా ప్రెస్ వర్క్సు. అల్లవరం విశాఖపట్టణం.

## కవితలు

వనమాల. రచయిత : నల్లాన్ చక్రవర్తి వేదాంతాచార్య. సహోదయ సమితి, ముస్తాబాదు, కరీంనగర్‌జిల్లా.

గేయకవిత (పంచమ కుసుమం) స్నేహాశీలం, అమీనాపేట, ఏలూరు. వెల : 35 న. పై.

కవిత. సమీకరణ : కమ్మూరి. కల్పన ప్రచురణలు, రాజమండ్రి—2. వెల : 60 న. పై.

ఏకలవ్యుడు. అలవర్తి వెంకటసుబ్బారావు. ఆంధ్రపత్రిక వారపత్రిక నుంచి పునర్ముద్రితం. ప్రచురణ : దీప్తి పబ్లికేషన్స్, అంగలకుదురు, పోస్టు, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా. వెల : 75 న. పై.

కవితాజ్యోతి. (సాహిత్య చాతుర్మాసిక పత్రిక) ఓరుగల్లు కవితా సమితి, వరంగల్లు. వెల : 75 న. పై.

నవ్యత. (సాహిత్య త్రైమాసిక పత్రిక, తృతీయ సంచిక) సెవెన్ స్టార్స్ సిండికేట్. విద్యానగర్, హైదరాబాదు—7. వెల : ఒక రూపాయి.

## బాలసాహిత్యం

నెహ్రూ కబుర్లు. (పిల్లల నవల) ఆర్. ఆర్. ఉప్పులూరి. శ్రీ రమణా పబ్లిషర్స్, హైరోడ్, చిత్తూరు. వెల : 80 న. పై.

గంగిరెద్దు. ప్రోగ్రెస్ కార్డు (పిల్లల నాటికలు). రచన : శ్రీ అన్నవర్తి సీతారామాంజనేయులు. ఆనందబాల ప్రచురణలు, గుంటూరు—4. వెల : ఒక్కొక్కటి 75 న. పై.

బాల విహారం (గేయాలు, గేయ కథలు) పులిపాటి. ప్రచురణ : రచయితల సమితి. నూతనకల్లు. నల్లగొండజిల్లా. వెల : ఒక రూపాయి.

చేత వెన్నముద్ద. (ఆడపిల్లల నాటిక). రచన : శ్రీ అన్నవర్తి. ఆనందబాల ప్రచురణలు, గుంటూరు — 4. వెల : 50 న. పై.

సన్యాసం. (పిల్లల నాటిక). రచన : శ్రీ ఉన్నవపేటు మాధవరావు. ఆనందబాల ప్రచురణలు, గుంటూరు—4.

## చీకటి వెలుగులు

నాటకం. రచన : పీసపాటి శేషుబాబు. సహోదయ పబ్లిషర్సు, విజయవాడ—2. వెల : రు. 1-50 న. పై.

## జీవిత చిత్రాలు

వివిధ పత్రికలలో ప్రచురింపబడిన నాలుగు కథల సంపుటి. రచన : మధుశ్రీ. ప్రతులకు : శ్రీ ఎం. వెంకటేశ్వర్లు, పర్లపాలెం (వయా) యానాం. వెల : రు. 1-50 న. పై.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu-Prasad.